అపరాధ పరిశోధన అనుబంధం—119

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## వజ్రాల భరిణె
రచన: వసుంధర

## ఏడు రోజుల మజిలీ
రచన: బి. రాజేశ్వరి

## దేవత
రచన: టెంపోరావ్

## మూడు రోడ్ల జంక్షన్
రచన: బొమ్మిడి అచ్చారావు

విషసర్పాలు - తొమ్మిదవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్—119
నవంబర్, 1983
వెల: రు. 5-50
ఏడాది చందా: 66 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామదామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
వసుంధర
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# వజ్రాల భరిణ

వసుంధర

ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావు తీవ్రాలోచనలో వున్నాడు.

ఊళ్ళో స్మగ్లింగ్ ఆపరేషన్లు బాగా యెక్కువై పోయాయి. లక్షల విలువచేసే వజ్రాలు ప్రతిరోజూ చేతులు మారిపోతున్నాయి. ఆపరేషన్లు కొత్తపద్ధతిలో జరుగుతున్నవేమో—ఏమీ క్లూ దొరకడంలేదు.

ఈశ్వర్రావు సమర్థుడిగా డిపార్టుమెంట్లో మంచి పేరు తెచ్చుకున్నాడు. కానీ ఇటీవల ఆ పేరు దెబ్బతినే ప్రమాదం ఏర్పడింది. ఎన్నడూ లేనిది మొదటిసారిగా పై ఆఫీసరు చేత చీవాట్లుకూడా తిన్నాడతడు.

అతడు నగరంలో అనుమానాస్పద ప్రాంతాలన్నింటినీ పరిశీలించాడు. మెరికల్లాంటి కాన్‌స్టేబుల్ని ఊరంతా నిఘా వేయించాడు. నేరస్థుల జాబితాలో వున్న వ్యక్తులందరిమీదా ఓ కన్ను వేసి వుంచాడు. పెద్దమనుషులుగా చలామణీ అవుతున్న వారి గురించికూడా తగు జాగ్రత్తలో వున్నాడు.

# 4

స్మగ్లింగ్ అపరేషన్సుకు ఎటువంటి అవకాశాలుంటాయో—తనకు తెలిసిన మేరకు ఊహించి అవసరమైన జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. అయినప్పటికీ వజ్రాల స్మగ్లింగ్ కొనసాగిపోతూనే వున్నవి.

అసలు స్మగ్లింగ్ అన్నది కొనసాగడంలేదనీ—తను తీసుకున్న చర్యల అనంతరం—స్మగ్లింగ్ సాధ్యపడదనీ ఈశ్వర్రావు పై అధికారులకు చెప్పిచూశాడు. అయితే వారు అంగీకరించలేదు.

దిక్కూ మొక్కూ తెలియని ఓ శవం దగ్గర వారికో చిన్న ట్రాన్సిస్టర్ వంటి సాధనం దొరికింది. అది ఒక రిసీవర్ సెట్.

ఒక బాస్‌నుంచి ఆ సెట్ సందేశాలను అందుకుంటున్నది.

పోలీసులకు ఆ సెట్‌నుబట్టి ఈ క్రింది విషయాలు తెలిశాయి.

ఒక అంతర్జాతీయ స్మగ్లింగ్ ముఠా దేశంలోని వివిధ ప్రాంతాల్లో జోరుగా వ్యవహరిస్తున్నది. ఈ ఊరిలో మొత్తం పాతికమందివద్ద ఇటువంటి సెట్స్ వున్నవి. ఆ సెట్స్ సందేశాలను అందుకునేందుకే తప్ప పంపడానికి పనికిరావు. ఆ సందేశాలు కూడా ఎక్కువ సమాచారాన్నందజేసేవిగా లేవు. ఆ సందేశాలు పాతికమందికీ ఒకేసారి ఉద్దేశించబడినవి.

"మీ కారణంగా నిన్న నలభై లక్షల విలువైన వజ్రాల మార్పిడి జరిగింది. గుడ్ వర్క్.... థాంక్స్...."

"ఈ రోజు రికార్డు. ఒక కోటీ అయిదు లక్షలు. కీపిటప్—థాంక్స్...."

"ఈ రోజు పది లక్షలు మాత్రమే.... డోన్ట్ వర్రీ...."

మీ ఇబ్బందులు నాకు తెలుసు. రేపు ఇది మేకప్ చేసే యాలి.... బెస్టాఫ్ లక్...."

సందేశాలు అ సమానూ రావడంలేదు. ఒకోసారి రోజు విడిచి రోజు, ఒకోసారి పదేసి రోజుల వ్యవధి అనంతరం....ఒకసారి మూడు వారాల గ్యాప్ కూడా వచ్చింది.

పోలీసులు ఆ రిసీవర్ సెట్‌ను నిత్యం ఆన్ చేసి వుంచు తున్నారు. సందేశం ఎక్కడినుంచి వస్తున్నదో, ఎవరికి చేరుతున్నదో వారికి తెలుసుకోనడం సాధ్యపడ లేదు. కానీ స్మగ్లింగ్ ఆపరేషన్ కొనసాగుతున్నదని మాత్రం తెలిసింది.

ఈశ్వర్రావుకిది ప్రాణాంతకంగా వున్నది. ఈ రిసీవర్ సెట్‌లో ఎవరైనా తమను ఫూల్ చేయడం లేదుగదా అని అతడికి అనుమానం వచ్చింది. ఈ అనుమానాన్ని అతడు పై అధికారులముందు వ్యక్తం చేయలేదు. వారు తనతో ఏకీభవించరని అతడికి బాగా తెలుసు.

అందుకే యేం చేయాలో తెలియక ప్రతిరోజూ ఈ విషయమై తీవ్రంగా ఆలోచిస్తున్నాడు.

ఆ రోజు అతడు మరింత తీవ్రాలోచనలో వున్నాడు. ఆలోచనలో టైము రాత్రి పది దాటిందని కూడా అతడు గుర్తించలేదు.

అప్పుడు—"సార్!" అన్న పిలుపు వినిపించి తలెత్తి చూశాడతను.

ఈశ్వర్రావు ప్రశ్నార్థకంగా అతడివంక తలెత్తి చూశాడు.

"మన స్టేషన్‌కు పక్కగా వున్న బస్ స్టాపులో ఓ మనిషిని చూశాను సార్! ఓ బిచ్చగాడికి అతడు తింటున్న

వేరుశనక్కాయల పొట్లం దానంచేశాడు. ఆ దానం ఎలాగున్నదంటే — అతడు ఆ బిచ్చగాడికోసం యెదురు చూస్తున్నట్లూ—అతడికివ్వడంకోసమే తనచేతిలో వేరుశనగకాయల పొట్లం ఉంచుకున్నట్లూ—నాకు అనిపించింది—"

ఈశ్వర్రావు చిరాగ్గా—"కొంతమంది అంతే—ఏమైనా తింటూండగా బిచ్చగాళ్ళు అడిగితే వెంటనే అది ఇచ్చేస్తారు. ఇందులో విశేషమేమీ లేదు...." అన్నాడు.

"కానీ సార్....అతడి జేబులో ఓ వస్తువు చూశాను. వేరుశనగకాయల పొట్లం తీసేటప్పుడు—అదీ బయటకు వచ్చింది. పొట్లం చేతిలో వుంచుకుని దాన్నతడు మళ్ళీ జేబులోకి తోసేశాడు. పొట్లంలోంచి ఓ రెండు వేరుశనగలు తిన్నాడో లేదో—బిచ్చగాడు వచ్చాడు...."

"ఏమిటా వస్తువు?"

"అది మనదగ్గరున్న రిసీవర్ సెట్‌లాగున్నది సార్.." అన్నాడు కాన్‌స్టేబుల్.

ఈశ్వర్రావు ఉలిక్కిపడి లేచి నిలబడి — "వాడెక్కడ?" అన్నాడు.

"ఓ కాన్‌స్టేబుల్ అతణ్ని వాచ్ చేస్తున్నాడు సార్" అన్నాడు కాన్‌స్టేబులు. ఈశ్వర్రావు వెంటనే స్టేషన్ లోంచి బయటకు వచ్చి ఆ యువకుణ్ణి చూశాడు.

అతడికి గుబురు గడ్డం వున్నది. బహుశా అది పెట్టుడు గడ్డమై ఉండాలి. కాన్‌స్టేబులు ఈశ్వర్రావుకి అతణ్ని చూపించాడు.

ఈశ్వర్రావు అతడివైపు నడిచాడు.

బస్‌స్టాపులో వున్నతను ఈ పోలీసుల వ్యవహారం చూశాడు. అయినా కదలలేదు. ఓరకంట పోలీసులను

గమనిస్తున్నాడు.

ఈశ్వర్రావు అతడిని సమీపించాడు. అతడు ఈశ్వర్రావు వంక చూడలేదు.

"మిస్టర్! నిన్ను సోదా చేయాలి—" అన్నాడు ఈశ్వర్రావు.

"ఎందుకు?"

"సోదా చేశాక చెబుతాను...." అన్నాడు ఈశ్వర్రావు.

అతడు చేతులెత్తి నిలబడ్డాడు.

ఈశ్వర్రావు అతడిని సోదా చేయడానికి ముందుకు వచ్చాడు.

అతడూ ఒకడుగు ముందుకువేసి చటుక్కున ఈశ్వర్రావుని ఒక్క తోపు తోసి అక్కణ్నించి ఒక్క పరుగు తీశాడు.

ఇది ఊహించలేదు ఈశ్వర్రావు.

ఈశ్వర్రావు వెనుకనే వున్న కానిస్టేబుల్ వెంటనే విజిల్ వేశాడు.

ఈశ్వర్రావు .... ఇద్దరు కానిస్టేబుల్స్ .... అతడిని వెంట తరిమారు.

అతడు రెండు సందులు తిరిగి అప్రయత్నంగా చటుక్కున ఓ యింట్లో దూరాడు. ఆ యింటి తలుపులు ఓరవాకిలిగా తెరిచి వున్నాయి.

ఈశ్వర్రావు ఆ యింట్లోకి అడుగుపెట్టేసరికి అతడు దొడ్డిదారిన ఎటో పారిపోయాడు.

గదిలో కూర్చున్నాయన—కంగారుగా—"అతడెవరు సార్—అలా హఠాత్తుగా యింట్లో చొరబడ్డాడు—"

అన్నాడు.

ఈశ్వర్రావు క్లుప్తంగా వివరంగా చెప్పి — "దొంగ దొరికినట్లే దొరికి తప్పించుకున్నాడు—అంతా నా దుర దృష్టం—" అన్నాడు.

"హాతాత్తుగా ఇంట్లో చొరబడేసరికి నా బుర్ర పని చేయలేదు. ఆపైన ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు—సమయానికి నేనూ మీకు సాయపడలేకపోయాను—" అన్నాడాయన.

ఇన్స్పెక్టర్ ఈశ్వర్రావు ఆయన వివరాలు తెలుసుకున్నాడు. ఆయన పేరు సుబ్బారావు. బ్యాంకు ఏజంటుగా పనిచేస్తున్నాడు.

ఈశ్వర్రావు వెళ్ళిపోయాక సుబ్బారావు గదిలో మూలకు చూశాడు. ఇందాకా దొంగనుంచి జారిపడి మూలగా దొర్లి వెళ్ళిన కాగితం పొట్లం ఇంకా అక్కడే వున్నది. ఆ వచ్చిన ఇన్స్పెక్టర్ మనిషికోసమే వచ్చిన మూలాన ఇంటిని శోధించలేదు.

సుబ్బారావు వీధి తలుపులు వేసి ఆ పొట్లం తీశాడు. అందులో వేరుశనగకాయలున్నవి.

సుబ్బారావు ఒక్కడూ అక్కడ కూర్చుని ఏదో ఇంగ్లీషు నవల చదువుకుంటున్నాడు. ఆ పొట్లంలోని వేరుశనగకాయల నాయన తన ఎదురుగా వున్న బల్లమీద గుట్టగా పోశాడు. అప్పుడు చూశాడాయన. ఆ పొట్లం అడుగున ఒక చిన్న ప్లాస్టిక్ భరిణ వున్నది.

సుబ్బారావు ఆ భరిణ మూత తీశాడు. వెంటనే కళ్ళు జిగేల్మన్నాయి.

అందులో ధగధగలాడే వజ్రాలున్నవి.

# 2

"నమస్కారమండీ — నా పేరు నాగరాజారావు. చాలామంది నన్ను సింపుల్‌గా మిస్టర్ నాగూ అని పిలుస్తూంటారు—" అన్నాడు తను.

ఏజంటు సుబ్బారావు అతనివంక ప్రశ్నార్థకంగా చూసి—"ఏం కావాలో చెప్పండి—" అన్నాడు.

నాగు రిస్టువాచీవంక చూసుకుని—"ఇప్పుడు పావు తక్కువ రెండయింది కదా—పబ్లిక్ ట్రాన్సాక్షన్సన్నీ మరో పావుగంటలో ముగుస్తాయనుకుంటాను-" అన్నాడు.

"అవును—అన్ని బ్యాంకుల్లాగే మా బ్యాంకు కూడా పబ్లిక్ ట్రాన్సాక్షన్సన్నీ రెండు గంటలకు క్లోజ్ చేస్తుంది—" అన్నాడు సుబ్బారావు.

"దట్స్ వెరీగుడ్!" అన్నాడు నాగు.

"ఎస్ మిస్టర్ నాగూ — మీకేదైనా సాయం కావాలన్నా—అంతే టయిముంది—" అన్నాడు సుబ్బారావు విసుగ్గా.

"అలాగంటే ఎలాగండీ—నాకు మీతో పని వున్నది రెండుగంటలయిన తర్వాతనే—" అన్నాడు మిస్టర్ నాగు తాపీగా.

"మీ మాటలు నాకర్థం కావడంలేదు—"

"మీకు వాసుదేవరావు తెలుసా?" నాగు నెమ్మదిగా అడిగాడు.

"ఎవడా వాసుదేవరావు?"

"అన్ని విధాలా మీ కల్లుడిగా వుండడానికి తగిన వాడని మీరనుకున్న వాడు. అతడు కోరిన కట్నం మీరివ్వలేక వదులుకున్నారు. ఆ వాసుదేవరావు...."

సుబ్బారావు ముఖంలో చిరాకు మాయమయింది—

"వాసుదేవరావు మీకెలా తెలుసు?" అన్నాడు.

"మీ కారణంగానే అతడు నాకు తెలుసు. అతన్ని పెళ్ళికొప్పించగల శక్తి నాకుంది. మీ కభ్యంతరం లేని పక్షంలో నేనే పెళ్ళి స్థిరపరుస్తాను...." అన్నాడు నాగు.

"నిజంగా—" అన్నాడాశ్చర్యంగా సుబ్బారావు. ఆయన మనసులో మళ్ళీ కొత్త ఆశలు చిగిర్చాయి. వాసుదేవరావు సుబ్బారావుగారి కన్నివిధాలా నచ్చాడు. తనకూతురికిచ్చి చేయాలని చాలా మనసుపడినా—అడిగిన కట్నం ఇవ్వలేక—సంబంధం వదులుకున్నాడు.

"నిజంగానే—కానీ మీరు నాకో చిన్న సాయం చేయాలి—"

"ఏమిటది?" అన్నాడు సుబ్బారావు అనుమానంగా.

"నేను కొత్తగా చిన్న పరిశ్రమ ప్రారంభించబోతున్నాను. అందుకుగానూ అయిదు లక్షలు అప్పుకావాలి. ఆ లోన్ శాంక్షన్ కావడానికి మీ సహకారం కావాలి—"

"ఏ లోన్ కయినా సహకార ముంటుంది. ఎటొచ్చీ మీ వైపునుంచి కాగితాలు సరిగ్గా వుండాలి. అన్నీ సక్రమంగా వుంటే నావైపునుంచి ఇబ్బందేమీ వుండదు" అన్నాడు సుబ్బారావు.

"అన్నీ సక్రమంగా వుంటే—మీ అమ్మాయి పెళ్ళి బాధ్యత నేను తీసుకోవడ మెందుకండీ?" అన్నాడు నాగు వేళాకోళంగా.

సుబ్బారావు కూడా వేళాకోళంగా నవ్వి—"సక్రమం కాని పనులు చేసేపక్షంలో — మా అమ్మాయి పెళ్ళికి మీలాంటివాళ్ళు సాయపడ్డ మెందుకూ — నాకు నేనే చూసుకోగలను—" అని—"ఇదే మీరు వచ్చిన పనయితే

ఇంక మీరు వెళ్ళవచ్చు—" అన్నాడు.

నాగు నవ్వి — "వచ్చిన పని పూర్తిచేసుకోకుండా వెళ్ళడం ఈ నాగుకు అలవాటు లేదు—" అన్నాడు.

"ఎదుటి మనుషుల్నిబట్టి అప్పుడప్పుడు కొత్త అలవాట్లు చేసుకోవాలి. చాలా శ్రమపడి వచ్చారు. వెళ్ళిరండి—" అన్నాడు సుబ్బారావు.

"వెళ్ళిరండి అన్నారు. అదే శుభసూచకం—మిమ్మల్ని నేను మళ్ళీ కలుస్తాను—" అంటూ లేచాడు నాగు.

## 3

"నా పేరు మహాలక్ష్మి—సులోచనగారు మీరేనను కుంటాను—" అన్నదామె.

"అవును — నేనెలా తెలుసు మీకు?" సులోచన ఆశ్చర్యంగా అడిగింది.

"ఆడపిల్ల తల్లిని— తెలుసుకోక తప్పుతుందా?" అంది మహాలక్ష్మి. సులోచన తనకేమీ అర్థంకానట్లు ముఖం పెట్టింది. మహాలక్ష్మి అది గ్రహించినట్లుగా-" సురేంద్ర మీ అబ్బాయే కదూ?" అన్నది.

"అవును-వాడెలా తెలుసు నీకు?" అన్నది సులోచన మళ్ళీ ఆశ్చర్యపడుతూ.

"ఆడపిల్ల తల్లిని — తెలుసుకోక తప్పుతుందా?" అంది మహాలక్ష్మి.

"చెప్పేదేదో సూటిగా చెప్పండి. మీ మాటలు నాకర్థం కావడంలేదు—"

"చెప్పడానికేముందమ్మా — మీ అబ్బాయి మా అమ్మాయి వెంటపడ్డాడు. కుర్రాడు ఎర్రగా బుర్రగా వున్న మూలాన అమ్మాయి అతని మోజులో పడింది. వీళ్ళిద్దరూ నాలుగు రోజుల క్రితం పార్కులో నా కళ్ళ

పడ్డారు. నిలదీసి అడిగేసరికి ప్రేమ అన్నారు. బాగానే వుంది — పెద్దవాళ్ళకు తెలియకుండా ఇలా తిరగడం బాగోలేదని మందలించాను. ఈ నాలుగు రోజులూ అమ్మాయతన్ని తప్పించుకు తిరిగింది. ఈ రోజతను తిన్నగా మా యింటికి వచ్చేశాడు—" అని ఆగింది మహాలక్ష్మి.

"మీరు చెప్పేది మా అబ్బాయి గురించేనా?" అనుమానంగా అడిగింది సులోచన.

"అతడి పేరు సురేంద్ర. విజయా బ్యాంకులో పని చేస్తున్నాడు. అడిగితే మీ అడ్రసిచ్చాడు—" అంది మహాలక్ష్మి.

"ఇప్పుడు వాడక్కడ ఏం చేస్తున్నాడు?" అంది సులోచన కోపంగా.

"ప్రేమించడానికి భయంలేదు కానీ ఆ విషయం తలిదండ్రులకు చెప్పడానికి భయమట. ప్రస్తుతం మా యింట్లో మా అమ్మాయితో కబుర్లు చెబుతున్నాడు. కాపలాగా మా పిల్లలున్నారు. ఈ గొప్ప దృశ్యం మీకు చూపించడానికి నేను మీ ఇంటికి పరుగున వచ్చాను—"

సులోచన ఆవేశంగా — "పదండి — మీ యింటికి వెళదాం—" అంది. మహాలక్ష్మి దగ్గర్లో వున్న రిక్షాను పిలుస్తూంటే—సులోచన ఇంటికి తాళం వేసింది.

## 4

"ఎక్స్‌క్యూజ్ మీ—" అంది ఓ తీయని కంఠం. ఉద్రేకంగా ఇంగ్లీషు పాఠం చెబుతున్న మిత్ర లెక్చరర్ చటుక్కున గుమ్మంవైపు చూసి ఒక్క నిమిషం తడబడి- "ఎస్—ప్లీజ్!" అన్నాడు.

"మీ క్లాసులో వున్న దేవీబాల అనే అమ్మాయితో మాట్లాడాలి. చాల అర్జంటు—" అంది గుమ్మం దగ్గర

నిలబడ్డ తీయని కంఠం కలిగిన అప్సరసలాంటి అమ్మాయి.

లెక్చరర్ అనుమతి సూచనగా దేవీబాల వంక చూశాడు. దేవీబాల క్లాసులోంచి లేచి బయటకు వచ్చింది. ఇద్దరూ కలిసి వెళ్ళిపోతూంటే లెక్చరర్ ఓ సారి నిట్టూర్చి మళ్ళీ పాఠంలో పడిపోయాడు.

"మీ రెవరో తెలుసుకోవచ్చా?" అంది దేవీబాల ఆశ్చర్యంగా.

"నన్ను మీ రెరుగరులెండి. కానీ మా అన్నయ్య మీకు తెలుసుననుకుంటాను—" అంది అప్సరస.

"మీ అన్నయ్యెవరో చెబితే...." అంది దేవీబాల ఆలోచిస్తూ.

"వాసుదేవరావు—" అంది అప్సరస.

"వాసుదేవరావంటే...." ఇంకా ఏదో అనబోయే లోగానే దేవీబాలకతనెవరో గుర్తొచ్చేసింది. అతడు తనకు కావలసిన వరుడు. కట్నం దగ్గర బేరం కుదరక సంబంధం చెడిపోయింది.

"మీకు తెలిసిన అతనే — అప్పట్లో కట్నం దగ్గర బేరం కుదరలేదు. కానీ ఇప్పుడు కథ కొత్త దారి తొక్కింది. అందువల్ల ఈ పెళ్ళి వ్యవహారంలోంచి కట్నం సమస్య తప్పుకుంది—" అంది అప్సరస.

"నాకేమీ అర్థంకావడంలేదు. మీరు నన్నెందుకు పిలిచారో — మీ రిప్పుడేం చెప్పదల్చుకున్నారో కాస్త వివరంగా చెప్పండి—" అంది దేవీబాల.

"చెబుతాను కానీ నేనడిగిందానికి జవాబు చెప్పండి. చూడ్డానికి నే నెలాగున్నాను?"

"అప్సరసలాగున్నారు-" అంది దేవీబాల చటుక్కున.

"నా పేరూ అదేననుకోండి. ఎటొచ్చీ ఒక అక్షరం

తక్కువ. అప్సర నా పేరు—" అంటూ నవ్విందామె-
"ఆ కారణంగానే ఒకబ్బాయి నా వెంటపడ్డాడు—"

"ఎవరతను?" అంది దేవీబాల.

"అతడి పేరు సురేంద్ర. అతడు అచ్చం మీకులాగే వుంటాడు. అందుకే అతన్ని నేనూ ప్రేమించాను—" అని ఆగింది అప్సర.

"మిస్ అప్సరా-ఇదంతా నాకెందుకు చెబుతున్నట్లు?"

"ఈపాటికి అర్థమయే వుంటుందనుకుంటాను. సురేంద్ర నేను ప్రేమించుకోవడంతో—కథ కొత్త మలుపు తిరిగింది. నా పెళ్ళికి కట్నమివ్వాలిగదా—బదులుగా కట్నమక్కర్లేకుండా అన్నయ్య మిమ్మల్ని చేసుకోదల్చుకున్నాడు—" అంది అప్సర.

"బాగుంది. అవుననడానికీ కాదనడానికీ అంతా ఒకరిష్టమేనేమిటీ?" అంది దేవీబాల అదోలా.

"అంతేననుకుంటాను. ప్రస్తుతం మా యింట్లో నా అన్నయ్య, మీ అన్నయ్యలతోపాటు మీ అమ్మగారు కూడా వున్నారు-ఎవరెవరికి ఏయే ఇష్టాలున్నదీ అక్కడే చెప్పుకోవచ్చు—" అన్నది అప్సర.

# 5

"తలుపు తాళంతీసుకుని లోపలకు వెళుతున్నారు. మీవాళ్లెవరూ ఊళ్ళో లేరా?" అన్న పలకరింపుకు సుబ్బారావు ఉలిక్కిపడి వెనక్కు తిరిగి అప్రయత్నంగా" "మీరా?" అన్నాడు.

"అవును. మిమ్మల్ని మళ్ళీ కలుస్తానని చెప్పానుగా—అందుకే మళ్ళీ వచ్చాను—" అన్నాడు నాగు.

"నేనేదో మర్యాదకు వెళ్ళిరండన్నాను. నిజంగానే మళ్ళీ వచ్చారు మీరు—అనవసరపు శ్రమ—" అన్నాడు

సుబ్బారావు.

"అనవసరంగా నేను శ్రమపడనులెండి—" అన్నాడు నాగు.

"లోపలకు రండి—మీరెంత తెలివైనవారైనా జామ చెట్టుకు ఆపిల్ కాయలు కాయించలేరు—" అంటూ లోపలకు దారితీశాడు సుబ్బారావు. నాగు ఆయన్ననుసరిస్తూ — "మీకు సత్యబాబుగారు తెలుసుననుకుంటాను. ఆయన ఏ చెట్టునుంచైనా ఏ కాయైనా కోయగలరు—" అన్నాడు.

"అది దైవశక్తి—" అన్నాడు సుబ్బారావు.

"ఏదో ఒక శక్తి—మనమనుకున్నది చేయించగలుగుతున్నదంటారా—లేదంటారా?"

"కూర్చోండి—" అన్నాడు సుబ్బారావు తనూ ఓ కుర్చీలో కూర్చుంటూ.

నాగు కూర్చుంటూ — "నేనంటే మీకిష్టంలేదు. అయినా లోపలకు రమ్మన్నారు. కూర్చోమన్నారు. చూశారా—మీకిష్టంలేని పనులు మీ చేతే ఎలా చేయిస్తున్నానో!" అన్నాడు.

"మీరు పొరబడ్డారు..మీ ఆలోచనలు తప్పుదారిలో నడుస్తున్నాయి. వాటిని సక్రమమైన మార్గంలోనికి మళ్ళించడంకోసం నేనిప్పుడో ఉపన్యాసమిచ్చే ఉద్దేశ్యంలో వున్నాను. అందుకే మిమ్మల్ని రమ్మన్నాను. కూర్చోమన్నాను. నా ఉపన్యాస ప్రభావం మీకు తెలియదు. అది తలచుకుంటే నా భార్యా బిడ్డలు వణికిపోతారు. ఇంతవరకూ నా ఉపన్యాసం పూర్తిగా విన్నవాళ్ళెవ్వరూ లేరు. సగమైనా పూర్తికాకుండా నే నా కాళ్ళు పట్టుకుని—ఉపన్యాసం ఆపమనీ, బుద్ధి వచ్చిందనీ

అనేయాల్సిందే—మొహమాటం లేనివాళ్ళెవరైనా ఉపన్యాసాన్ని సుత్తి అని కూడా అంటారు—"

నాగు నవ్వి—"నేను కూడా మీ సుత్తి పూర్తిగా వినబోవడంలేదు—" అన్నాడు.

"చూశారా-మీలో అప్పుడే భయం మొదలయింది" అన్నాడు సుబ్బారావు.

"భయం కాదండీ—కాస్త ఇది చూడండి-" అంటూ నాగు జేబులోంచి ఒక పొట్లంతీసి సుబ్బారావు కందించి "ఇది కాస్త జాగ్రత్తగా విప్పిచూడండి. ఇందులో చాలా తెలివైన వస్తువులున్నాయి. అలాగని తేలిక చేయకండి. అడిగినమీదట వివరాలు చెప్పగలను. ఆ వివరాలు విన్నాక మరి మీరు సుత్తి కొట్టగలరని నేననుకోను—" అన్నాడు.

సుబ్బారావు తిరస్కారంగానే పొట్లాన్నందుకున్నప్పటికీ దాన్ని జాగ్రత్తగానే విప్పాడు. ఆ కాగితం పొట్లంలో ఒక చిన్న గోరు, తల వెంట్రుక వున్నాయి.

"ఏమిటిది?" అన్నాడు సుబ్బారావు అసహనంగా.

"మీ అమ్మాయి దేవీబాల మా యింట్లో వున్నదనడానికి సాక్ష్యం—"

సుబ్బారావు ఉలిక్కిపడి — "మా అమ్మాయి మీకే తెలుసా?" అన్నాడు.

జేబులోంచి మరో రెండు పొట్లాలు తీశాడు నాగు. వాటిని కూడా సుబ్బారావు కందిస్తూ — "శ్రీమతి సులోచన, మిస్టర్ సురేంద్రలకు సంబంధించినవీ పొట్లాలు. మీరు తప్ప మిగతా మీ కుటుంబ సభ్యులందరూ మా ఇంట్లో వున్నారని తెలుపడానికి గర్విస్తున్నాను...." అన్నాడు.

సుబ్బారావు పొట్లాలు విప్పాడు. వాటిలోనూ అవే గోరు, వెంట్రుక.

"ఏమిటి మీ ఉద్దేశ్యం?" అన్నాడాయన కోపంగా.

"గోళ్ళు మనం చేతులు శుభ్రంగా ఉండడంకోసం వారానికోసారి తీసుకుంటూనే వుంటాం. వద్దనుకున్నా తల దువ్వుకునే సమయంలో కొన్ని తల వెంట్రుకలు రాలిపోతూంటాయి. శరీరంనుంచి బాధ కలిగించకుండా వేరుచేయగల భాగాలివి. ప్రస్తుతం నేను వాటి జోలికి మాత్రమే వెళ్ళాను. అంటే మీ వాళ్ళింకా ప్రమాదంలో లేరని అర్థం. అయితే వాళ్ళు ప్రమాదంలో పడే అవకాశం లేకపోలేదు. అది మీ చేతుల్లో వుంది. ఆలోచించుకోండి—నాకు సుత్తికొడతారో — జామ చెట్టుకు ఆపిల్సు కాయిస్తారో!" అన్నాడు నాగు గంభీరంగా.

సుబ్బారావు నాగువంక పరీక్షగా చూశాడు. అతడి కళ్ళలో భయమన్నది ఎక్కడా కనబడ్డంలేదు. అనుకున్నది సాధించగలనన్న నమ్మకం ఆ కళ్ళలో కనిపిస్తున్నది.

సుబ్బారావు ఆలోచనలో పడ్డాడు. నాగు సామాన్యుడు కాడు.

"లోన్ గురించేకదా మీ రభస అంతా—మీ కాగితాలన్నీ చూపించండి ఒకసారి చూస్తాను...." అన్నాడు సుబ్బారావు.

"ఈ ప్రశ్న మీనుంచి చాలా ఆలస్యంగా వచ్చింది. అయినా ఫరవాలేదులెండి. కానీ ఒక్క విషయం ముందుగానే తమకు మనవి చేసుకుంటున్నాను. కాగితాలన్నీ సక్రమంగా లేవు. మీరు చూసీచూడనట్లూరుకుంటే తప్ప

లోన్ శాంక్షనవదు—" అన్నాడు నాగు.

"అలా కుదరదు—అప్పుడు నా ఉద్యోగానికే ముప్పు వస్తుంది!"

"ఇంకా స్తదారిలో పడుతున్నారు. తప్పు చేస్తున్నాననికాక—తప్పు మీకు తేబోయే ముప్పు గురించి భయపడుతున్నారు. మీకు ఏ ముప్పు రాకుండా నేను చూసుకుంటాను. అదెలాగంటే.... రేపు నేను మీ ఆఫీసుకు వస్తాను. ఈ వేషంలోకాదు. మారువేషంలో. నా పేరు రంగనాథ్ అని చెబుతాను. మీతో కబుర్లు చెబుతూ రెండుగంటలవరకూ కాలక్షేపం చేసే అవకాశం నాకివ్వండి. మధ్యలో వాచ్‌మన్‌ని పిలిచి నాకు పరిచయమయ్యేలా చూడండి. మిగతా సంగతి నేను చూసుకుంటాను. మీకే ఇబ్బందీ వుండదు. మీ అమ్మాయి పెళ్ళి వాసుదేవరావుతో జరిగిపోతుంది—" అన్నాడు నాగు.

"ఇంతకీ మావాళ్ళెక్కడున్నారు?" అన్నాడు సుబ్బారావు.

"ఈ రాత్రికి రారు. మీ అబ్బాయి కూడా అక్కడే వున్నాడు కాబట్టి మీకే అనుమానాలూ అక్కర్లేదు. వాళ్ళను మర్యాదగా చూసుకునేందుకు ఏర్పాట్లు చేశాను. రేపు నా పని ముగియగానే వాళ్ళు క్షేమంగా మీ యింటికి చేరుకుంటారు...." అన్నాడు నాగు.

"చేరుకోకపోతే—" అన్నాడు సుబ్బారావు అనుమానంగా.

"వాళ్ళతో నాకేం పని—కేవలం లోన్‌కోసమేగదా నేనీ తంటాలు పడుతున్నది—" అన్నాడు నాగు.

"నిజమే—కానీ నా భయం నాకుండవచ్చుగదా—" అన్నాడు సుబ్బారావు.

"ఈ నాగు జామచెట్టుకు ఆపిల్సు కాయిస్తాడు. కానీ ఆడినమాట మాత్రం తప్పడు."

## 6

"అమ్మా! నన్ను అప్సర పిలుస్తున్నది—" అన్నాడు సురేంద్ర.

"బాగుంది నాయనా—ఆ అమ్మాయి పిలవడమూ—నువ్వు వెళ్ళడమూ—" అంది సులోచన చిరాగ్గా.

మహాలక్ష్మి నవ్వి—"చూడండి వదినగారూ—మన మెలాగూ వియ్యమందబోతున్నాము. ఈనాటి కుర్రాళ్ళ సంగతి మనకు తెలియదు. వాళ్ళకేమేం మాట్లాడుకోవాలనుకుంటుందో-ఏకాంతంలో మాట్లాడుకోవడమే బాగుంటుంది—" అన్నది.

సులోచన ఇబ్బందిగా నవ్వి—"మగపిల్లల విషయంలో నాకంత పట్టింపు లేదుకానీ — ఆడపిల్లల విషయంలో మాత్రం ఇలా నచ్చదు నాకు. మీ అమ్మాయి విషయం మీ యిష్టంకానీ"....అని ఆగిపోయింది.

వాసుదేవరావు కూడా—"ఏ ఏకాంతమైనా పెళ్ళయ్యాక—మా మాటలకు ఏకాంతం అక్కర్లేదు—" అన్నాడు.

"మీ అమ్మాయిమీద మీకు నమ్మకం లేకపోతేసరే-మా అమ్మాయిమీద నాకా మాత్రం నమ్మకముంది—" అన్నది మహాలక్ష్మి.

"మనిషిని నమ్మొచ్చుకానీ వయసును నమ్మకూడదు పిన్నీ—" అన్నాడు వాసుదేవరావు. వీళ్ళ మాటలు జరుగుతుండగానే సురేంద్ర ఏకాంతానికి పక్కగదిలోకి వెళ్ళిపోయాడు. గదిలో అప్సర కూర్చుని వుంది.

"అంతమందిలో మీతో మాట్లాడాలంటే నాకు

సిగ్గు—" అన్నదామె.

"అంతమంది వుండగా మనమిద్దరమూ ఏకాంతంగా ఇక్కడ వున్నామంటే సిగ్గుగా లేదా?" అన్నాడు సురేంద్ర.

"లేదు—" అంది అప్సర అదోలా నవ్వుతూ— "మీతో ఏకాంతమంటే నేను సర్వమూ మరిచిపోతాను. ఒక మగవాణ్ని ఇంతలా ప్రేమిస్తానని మిమ్మల్ని చూసే దాకా అనుకోలేదు—"

సురేంద్ర ముఖంలో గర్వం తొంగిచూసింది-"బయట అమ్మ కూర్చుని వుంది. అందుకని నాకు కాస్త సిగ్గుగానే వుంది—"

"మీకంత సిగ్గుగా వుంటే వాళ్ళకు కనిపించేలా గదిగుమ్మం దగ్గర కూర్చుందాం-" అంది అప్సర. సురేంద్రకది సబబనిపించింది. ఇద్దరూ గది గుమ్మందగ్గర కూర్చుని కబుర్లారంభించారు.

సురేంద్ర తల్లి సులోచన ఆశ్చర్యంగా ఆ జంటనే చూస్తోంది. అప్సర వ్యవహారం ఆమెకు నచ్చలేదు. పెళ్ళి కాకుండా పరాయి మగాడితో ఏకాంతాన్నభిలషిస్తున్న అప్సరా, ఈ విషయాన్ని పూర్తిగా సమర్థిస్తున్న అప్సర తల్లి మహాలక్ష్మి ఆమెకు చాలా విచిత్రంగా తోచారు. అసలారోజు మధ్యాహ్నంనుంచీ ఆమెకు తెలిసిన వివరాలన్నీ ఆశ్చర్యజనకంగానే వున్నాయి.

వాసుదేవరావు మహాలక్ష్మికి అక్క కొడుకు. పిన్ని బాబాయిలంటే అతను ప్రాణం ఇస్తాడు. ఎలాపడ్డాడో సురేంద్ర అప్సర ప్రేమలోపడ్డాడు. సంగతి తెలిసిన వాసుదేవరావు వీళ్ళ ప్రేమ ఫలింపచేయడంకోసం తను కట్నం లేకుండా దేవీబాలను పెళ్ళిచేసుకోవాలను

కున్నాడు. ఈ మాటలు మాట్లాడ్డానికే మహాలక్ష్మి తన్ను వచ్చి పిల్చికెళ్ళింది. మహాలక్ష్మి భర్త — తన భర్తను పిల్చుకురావడానికి బ్యాంకుకు వెళ్ళాడట. మనిషింకా తిరిగిరాలేదు కానీ కబురు వచ్చింది. సుబ్బారావు తను వచ్చేసరికి కాస్త ఆలస్యమైనా యెదురుచూస్తూ అందర్నీ ఇక్కడే వుండమన్నాడట.

సాయంత్రం ఏడుగంటలైనా భర్త రాలేదు. సురేంద్రను పంపి కబురు తెలుసుకోమందామా అంటే— అతడికి కదిలే మూడ్ వున్నట్లు లేదు. అప్సరతో కబుర్లు చెబుతూ అక్కణ్నించి కదలడానికేమాత్రమూ సుముఖంగా లేడు. సాయంత్రమైనప్పట్నించీ — సులోచనకు ముళ్ళమీద కూర్చున్నట్లుంది. టైము ఎనిమిదిన్నరయ్యేక ఆమె మహాలక్ష్మితో—"చూడండి—మరీ ఆలస్యమైపోతోంది—ఎందువల్లనో ఆయనింకా రాలేదు. నేను మళ్ళీ మరోసారి వస్తాను—" అని లేచింది.

మహాలక్ష్మి కూడా పెద్దగా అభ్యంతర పెట్టలేదు— "సరేలెండి వదినగారూ — మీకిష్టమైతే మా యిల్లు చిన్నదేంకాదు. మీకు పక్కలూ అవీ ఏర్పాటుచేసేస్తాను. మీకు వెళ్ళిపోవాలంటే మాత్రం నాకేమీ అభ్యంతరం లేదు—"

సురేంద్ర కూడా అయిష్టంగానే అక్కణ్నించి కదిలాడు. దేవీబాల తల్లినీ, అన్ననూ అనుసరించింది.

## 7

సుబ్బారావు ఆశ్చర్యంగా చూశాడు. ఆయనకు నమ్మ శక్యంకాలేదు—"ఎక్కణ్నించి వస్తున్నారు?" అనడిగాడు కుటుంబాన్ని.

సుమారు పావుగంట వ్యవధిలో ఆ రోజు జరిగిన

వివరాలన్నీ తెలిశాయాయనకు. తన భార్యాబిడ్డలు వాళ్ళకు తెలియకుండానే ఇంతవరకూ నిర్బంధంలో వున్నారని గ్రహించడాని కాయనకెంతోసేపు పట్టలేదు.

"అయితే తప్పకుండా ఆ యింటికోసారి వెళ్ళి రావాలి—" అన్నాడు సురేంద్రవంక చూస్తూ ఆయన. ఆ యింటికి మరోసారి వెళ్ళాలని సురేంద్ర మనసులో కూడా వుంది. అతను వెంటనే అంగీకార సూచనగా తలాడించాడు.

"కాస్త ఎబ్బెట్టుగా తోచినా—వాళ్ళు మంచివాళ్ళే అనుకుంటానండీ. మర్యాదలు బాగానే చేశారు—" అంది సులోచన భర్త వెళ్ళడానికి అంగీకారాన్ని సూచిస్తూ.

సురేంద్ర, సుబ్బారావు కలిసి మళ్ళీ ఆ యింటికి వెళ్ళారు. సుబ్బారావు కాస్త వెనుకగా నిలబడివుండగా సురేంద్ర వెళ్ళి కాలింగ్ బెల్ నొక్కాడు. మరుక్షణం లోనే తలుపు తెరుచుకుంది. సురేంద్రను చూసి—"మీరు మళ్ళీ నాకోసం వస్తారని అనిపించింది. మనది జన్మజన్మల అనుబంధమనుకుంటాను—" అంది తలుపు తెర్చిన అప్సర.

"మా నాన్నగారు కూడా వచ్చారు—" అన్నాడు సురేంద్ర మనసులో మాత్రం అప్సర దర్శనం త్వరగానే అయినందుకు సంతోషపడుతూ.

అప్సర ముఖంలో వెలుగు కనబడింది—"మా నాన్నగారుకూడా ఇప్పుడే వచ్చారు. లోపలకు రండి—" అంది. ముందు సురేంద్ర, వెనుక సుబ్బారావూ ఆ ఇంట్లో ప్రవేశించారు.

క్షణాలమీద ఆ యింటి సభ్యులతో సుబ్బారావుకు పరిచయమైంది. వాసుదేవరావాయనకు నమస్కరించి—

"ఇదివరలో కట్నం గురించి నొక్కించి మీ మనసు నొప్పించాను. మీరు నన్ను క్షమించాలి—" అన్నాడు.

సుబ్బారావు ఆశ్చర్యంలో వున్నాడు. ఆయనూహించిన ప్రకారం—మహాలక్ష్మి భర్త—నాగు అయుండాలి. కానీ ఆయన అంచనా తప్పయింది. మహాలక్ష్మి భర్త పేరు సూర్యనారాయణ. ఆయనకూ నాగుకూ ఎక్కడా పోలికలు లేవు. మనిషి చూస్తే చాలా అమాయకుడిలా గున్నాడు. ఆ యింట్లో పదినిమిషాలు గడిపితే—యింటి వ్యవహారాలన్నీ భర్త జోక్యం లేకుండా మహాలక్ష్మి తనే చూసుకుంటుందని అర్థమైపోతుంది. సుబ్బారావుగారు పదినిమిషాలేం కర్మ — సుమారు అరగంటసేపక్కడ గడిపాడు.

అప్సర తన కథ ఆయనకు వివరంగా చెప్పేసింది. తనూ, సురేంద్రా ప్రేమించుకున్నారు. పెళ్ళి ప్రసక్తి ఎత్తేసరికి తన తలిదండ్రులకు కట్నం పట్టింపు బాగా వున్నదని సురేంద్ర చెప్పేశాడు. ముఖ్యంగా చెల్లె పెళ్ళి కోసం కట్నం చాలా అవసరపడిందని అతడు చెప్పి—కట్నం లేకనే—వాసుదేవరావుతో పెళ్ళి ఆగిపోయిన ఉదంతం చెప్పాడు. వాసుదేవరావు వివరాలు విన్న మీదట—అతడు తన పెద్దమ్మ కొడుకేనని అప్సర గ్రహించింది. వాసుదేవరావు చదువంతా మహాలక్ష్మి ఇంట్లోనే అయింది. వాళ్ళ అనుబంధం చెప్పనలవిగాదు. వెంటనే ఆమె తల్లికి అన్ని వివరాలూ చెప్పింది. వాసుదేవరావుకు కబురు వెళ్ళింది. అతను వచ్చాడు.

ఈ కథలన్నీ వింటూంటే—నాగుకీ వీళ్ళకీ సంబంధముండి వుండవచ్చునని సుబ్బారావుకు అనిపించడంలేదు. అలా అని అంతా కాకతాళీయంగా జరిగిందన్నా నమ్మ

బుద్ధి కావడంలేదు.

"మీ అభిప్రాయం చెప్పండన్నగారూ—" అంది మహాలక్ష్మి.

సుబ్బారావు సాలోచనగా — "మా ఆవిడా నేనూ ఉండగా మాటలు జరిగిపోయుంటే బాగుండేది. నేను రోజల్లా బ్యాంకులో నే వున్నాను. కబురు పంపాల్సింది" అన్నాడు.

"ఎదురింటి కుర్రాడిని కబురు పంపాం. అతడు మీతో కబురు చెప్పాననే అన్నాడు. అందుకే మీ గురించి చాలా సేపు ఎదురుచూశాం. ఆయనేమో ఊళ్ళో లేరు. ఆ విషయం వదినగారికి చెప్పలేదు. మొగుడు లేకుండానే వ్యవహారాలు చక్కబెట్టేస్తోంది అని అనుకుంటారని భయపడి — ఆయనే బ్యాంకుకు వెళ్లారని వదినగారికి చెప్పాను. వాసుదేవరావు రేపు వెళ్ళిపోవాలి. అందుకని తొందరపడ్డాను. అదృష్టం బాగుంది. ఆయనా వచ్చారు. మీరూ వచ్చారు—" అంది మహాలక్ష్మి.

విషయం నిజంగానైనా జరిగుండాలి—లేదా మహాలక్ష్మికి అబద్ధాలాడ్డంలో చాలా నేర్పుండి వుండాలని అనుకున్నాడు సుబ్బారావు.

ఎవరో చాలా పెద్ద నాటకం ఆడుతున్నారు. ఈ నాటకానికి చివరి అంకం రేపు వస్తుంది. అప్పుడేదో జరుగుతుంది. దాని ఫలితంగా తన బ్యాంకు కొన్ని లక్షలు నష్టపోతుంది.

రేపు ఏం జరగబోతోంది?

"అన్నయ్యగారు మాట్లాడడంలేదు—" అన్నది మహాలక్ష్మి.

బ్యాంకుకు సంబంధించి పెద్ద చిక్కులో పడ్డాను. అ

సమస్య తేలేవరకూ కుటుంబ వ్యవహారాల గురించి ఆలో చించే పరిస్థితిలో లేను. మీకు సంబంధించినంతవరకూ అభ్యంతరం చెప్పడానికి కారణమేమీ కనబడ్డం లేదు. అయినా నేను వెంటనే ఏ మాటా చెప్పకపోవడానికి కారణం ఒక్కటే—ఒక్కసారి నేను మాటిచ్చానంటే మరి తిరుగుండదు!" అన్నాడు సుబ్బారావు.

"సరేలెండి — మీ యిబ్బందులేవో మీకుంటాయి. మీకు వీలుకాగానే చెప్పండి. అటు అమ్మాయీ ఇటు అబ్బాయీ ఇష్టపడ్డ సంబంధమొకటి. ఒకసారి అనుకున్నదే అయిన సంబంధమింకోటి—ఈ రెండూ సెటిలైపోవడానికింక మీరు ఊఁ అనడం మాత్రమే అడ్డు—" అన్నాడు సూర్యనారాయణ.

"సూర్యనారాయణగారూ — మీ ఎదురింటి కుర్రాడి నోసారి కనుక్కొని — నాకెందుకు కబురు చెప్పలేదో, చెప్పినని ఎందుకబద్ధమాడాడో అడిగి తెలుసుకోండి. ఆ సమాచారం నాకు చాలా అవసరం—" అన్నాడు సుబ్బారావు.

"ఆఁ ఎందుకులెండి వృధాశ్రమ — తను చెప్పలేదని ఆ కుర్రాడొప్పుకుంటాడేమిటీ?" అంది మహాలక్ష్మి.

సుబ్బారావు మరి నొక్కించకుండా — "సరేలెండి, మళ్ళీ వస్తాను—"అని లేచి వెళ్ళిపోయాడు. సురేంద్ర ఆయన్ననుసరిస్తూన్నప్పుడు—ఎవరూ చూడకుండా అప్సర ఒకసారి అతడి చేయి నొక్కి వదిలింది.

## 8

"హలో—సుబ్బారావుగారేనా మాట్లాడుతూంట—"

"అవును—ఎవరది?

"నాగు చెప్పే వుంటాడు. నా పేరు రంగనాథ్—"

సుబ్బారావుకు క్షణం మాటరాలేదు—"చెప్పాడు—" అన్నాడు క్షణం ఆగి.

"అన్నీ గుర్తున్నాయి కదా-ఏమీ మర్చిపోరు కదా-"

"నేను బాధ్యతగల ఉద్యోగిని. నా బాధ్యతలు నే నెప్పుడూ మరిచిపోను—" అన్నాడు సుబ్బారావు గంభీరంగా.

"మంచిది. కానీ మనిషి ఉద్యోగం చేసేది బ్రతకడం కోసమేనని వేరే నేను చెప్పక్కర్లేదు. జీవితంపట్లకూడా మీకు చాలా బాధ్యతలున్నాయి. అవీ మీరు మరిచిపో కూడదు. గోటితోనూ, తల వెంట్రుకతోనూ పోయే విషయాన్ని తలకాయదాకా లాగకండి—నాకు హెచ్చ రికలన్నీ గుర్తుంచుకోండి—"

కంఠం కాస్త కటువుగా ధ్వనించగా సుబ్బారావు ఉలిక్కిపడ్డాడు. ఆయనకు పిల్లలు, భార్య-వీళ్ళే జీవితం. వాళ్ళకు ఊహాలో ఆపద కలిగినా భరించలేడు.

"సుబ్బారావుగారూ—మీ సంగతి నాకు పూర్తిగా తెలుసును. మీమీద గౌరవంతో, పూర్తి నమ్మకంతో— మీ భార్యాబిడ్డలు ముందుగానే మీ యింటికి చేరే ఏర్పాటు చేశాను. రేపు నేను ఫెయిలయ్యానంటే—మీ కుటుంబం ఏమైపోతుందో నాకే తెలియదు. ఎందుకంటే కోపంలో నేనేం చేస్తానో నాకు తెలియదు—"

"బెదిరింపా?"

"కాదు — సమాచారం! ముందుగానే ఈ సంగతి తెలిసుంటే జాగ్రత్తపడేవాడినని తర్వాత మీరు విచా రించకుండా—ఈ సమాచారాన్నందిస్తున్నాను. మనం ఒకపని చేయబోయేముందు పూర్వాపరాలాలోచించాలి

గదా—అలా ఆలోచించడానికి సమాచారం రావాలి గదా—అదే నేను మీకు చెప్పాను—"

"సరే—థాంక్స్—"

"నో మెన్షన్! మీరేమీ కంగారు పడకండి—ఎట్టాచ్చీ రేపు కూడా మీ పనులన్నీ ఎప్పటిలాగే చేసుకోండి. పోలీసుల గురించిన ఆలోచన బుర్రలోకి రానీయకండి. పోలీసులు హంతకుల్ని పట్టుకోగలరుకానీ హత్యల్ని ఆపలేరు. మీ ధ్యేయం హత్యలు జరుగకూడదనే కదా."

"సరే—రేపు నేను చేయవలసినదంటూ స్పెషల్‌గా ఏమీ లేదుగదా—"

"ఏమీ లేదు. నాను చెప్పినట్లు చేస్తే చాలు. మిగతావన్నీ నేను చూసుకుంటాను—"

"మీ కబుర్లూ, చేతలూ చూస్తూంటే ఆరితేరినవారిలా గున్నారు—నా సహాయం అవసరం లేకుండానే మీ పనులు మీరు ముగించుకోగలరేమో—ఎందుకీ రిస్కు తీసుకుంటున్నారు?"

"ఆ రిస్కుకంటె—ఈ రిస్కే మంచిది. మా గురించి తెలియని వాళ్ళకి మేమంటే అంత భయముండదు. తెలిసినవాళ్ళలో ఏ ఇబ్బందీ ఉండదు. అందుకే...."

"అయ్‌సీ...." అని—"మరి నేను సెలవు తీసుకోవచ్చా?" అన్నాడు సుబ్బారావు.

"అలాగే—మీరు సాయపడ్డందుకు మీ ఋణముంచుకోములెండి. మీ యింట త్వరలోనే వైభవంగా కల్యాణాలు జరుగుతాయి—"

అవతలవైపు క్లిక్‌మంది. సుబ్బారావుకూడా ఫోన్ పెట్టేశాడు.

# 9

ఉదయం లేస్తూనే సుబ్బారావు భార్యను పిలిచాడు. ఆయనకు రకరకాల ఆలోచనలలో రాత్రి తెల్లవార్లూ నిద్రపట్టలేదు.

సులోచన హడావుడిగా వచ్చి-"మెలకువొచ్చిందా?" అంటూ పలకరించింది.

"వచ్చింది కానీ అందరూ త్వరగా తెమలండి. ఈ రోజు మీరందరూ నాతోపాటే బయల్దేరాలి—" అన్నాడు సుబ్బారావు.

"అదేమిటండీ—" అంది సులోచన ఆశ్చర్యంగా.

"కారణం ఇది అని చెప్పలేను కానీ — ఏదైనా ప్రమాదం జరుగవచ్చునని నాకు భయంగా వుంది. ఈ రోజు మీరెవ్వరూ ఇంట్లో వుండిపోవద్దు. అమ్మాయేమో కాలేజీలో రోజుల్లా ఫ్రెండ్సుతోనే గడపాలి. యెవరు వచ్చి పిల్చినా వెళ్ళకూడదు. అలాగే అబ్బాయి ఆఫీసులో తనతోటి ఉద్యోగస్థులతో గడుపుతాడు. నువ్వు ఇన్స్పెక్టర్ మధుమూర్తి యింట్లో కాలక్షేపం చేద్దువుగాని. బాగా ఆలోచించే నేనీ నిర్ణయానికి వచ్చాను. ఎందుకని అడగొద్దు. ఇంకేమీ చెప్పొద్దు—" అన్నాడు సుబ్బారావు.

సులోచన ఆశ్చర్యంగా భర్తవంక చూసింది. వేళాకోళంగా ఏదో అనబోయి ఆయన ముఖం గంభీరంగా వుండడం చూసి ఇంకేమీ మాట్లాడలేదు. పదికి లోపుగానే అందరూ బయల్దేరాల్సిన అవసరముండడం వల్ల పనులన్నీ తొందరగా చేయడంకోసం లోపలకు పరుగెత్తింది.

అయితే టైము సుమారు పావు తక్కువ తొమ్మిది

అవుతున్న సమయంలో ఎవరో వీధి తలుపులు తట్టారు. సుబ్బారావే స్వయంగా వెళ్ళి తలుపులు తీశాడు.

"నమస్కారం — అన్నయ్యగారూ—" అంటూ మహాలక్ష్మి, ఆమె వెనుకే అప్సర లోపలకు ప్రవేశించారు.

"రండి—రండి—" అన్నాడు సుబ్బారావు ఏమనాలో తెలియక.

"నిన్న జాతకాల విషయం మరిచిపోయాను. నాకు జాతకాల పట్టింపు బాగా వుంది. అమ్మాయికీ అబ్బాయికీ జాతకాలు సరిపోయిందీ లేనిదీ చూసుకోకుండా—మనం మాటలు జరుపుకుని ఏం లాభం?" అంది మహాలక్ష్మి.

"దీనికి మీరు పనిగట్టుకుని రావాలా? ఎవరిచేతనైనా కబురు పంపితే — మీ ఇంటికి నేనే పంపి ఉండే వాణ్ణిగా—" అన్నాడు సుబ్బారావు మనసులో చిరాకును బయటపడనీయకుండా జాగ్రత్తపడుతూ.

"వాసు పొద్దున్నే బయల్దేరి ఊరెళ్ళిపోయాడు. ఆయనకు పెందరాళే ఆఫీసు. మళ్ళీ రాత్రిదాకా రారు. నాకేమో అనుకున్న పని వెంటనే అయిపోతే కానీ నిమ్మళంగా వుండదు. పోనీ ఏ ఎదురింటి కుర్రాడినైనా పంపిద్దామా అంటే — నిన్నటి అనుభవంతో బాగా బుద్ధొచ్చింది. అందుకే అమ్మాయిని తీసుకుని బయల్దేరి వచ్చాను—" అంది మహాలక్ష్మి.

ఈలోగా సులోచన అక్కడకు వచ్చి మహాలక్ష్మిని చూసి తెల్లబోయింది.

"గుర్తుపట్టేరా—అప్పుడే మరిచిపోయారా—" అంది మహాలక్ష్మి.

"ఎంతమాట?" అంది సులోచన నొచ్చుకుంటున్నట్లు.

"అబ్బాయి జాతకాలకోసం వచ్చారు. పాపం

పొద్దున్నే బయల్దేరి వచ్చారు. త్వరగా వెళ్ళిపోవాలో ఏమిటో—" అన్నాడు సుబ్బారావు అసహనంగా.

"అయ్యో—అంత తొందరేం లేదండీ—పొద్దున్నే మీ కాఫీనూ అదీ హడావుడిగా వుంటుందని నాకు తెలుసుగదా—మేమేమీ కాళ్ళలో చెప్పులు పట్టుకుని రాలేదు. కాసేపుండే వెడతాం. ఇవన్నీ ఆలోచించి—మా పురోహితుడిక్కూడా ఈ యింటి అడ్రసిచ్చాను. పదకొండు గంటల ప్రాంతంలో ఆయనిక్కడికి వచ్చి—జాతకాలు పరీక్షిస్తాడు—" అంది మహాలక్ష్మి.

"అంత సేపు మీరుండే పక్షంలో ఏకంగా భోంచేసి వెడితే బాగుంటుంది. కానీ కతికితే అతకదంటారు...." అన్నాడు సుబ్బారావు నీళ్ళు నములుతూ.

"శాస్త్రాలంటే మీకంటే నాకే ఎక్కువ పట్టింపండోయ్—మా అమ్మాయి చేతిలోని బ్యాగు మీరు చూడలేదు. దాంట్లో స్వయంపాకముంది. ఇంత ఉడకేసుకుని ఇక్కడే తినివెడతాం—అనుకున్నపని అయ్యేదాకా నేను చాలా పట్టుదలగా వుంటాను—" అంది మహాలక్ష్మి.

"కానీ...." అని సుబ్బారావేదో అనబోతూంటే సులోచన వారించి — "బయటకు వెడదామనుకున్నాం లెండి. అంత ముఖ్యమైన పనేం కాదు. ఈవేళ కాకపోతే రేపైనా వెళ్ళవచ్చు—" అన్నది.

సుబ్బారావుకు మనసులో బెంగగా వున్నది. మహాలక్ష్మి అసాధ్యురాలనీ నాగు వ్యూహంలో ఆమె భాగస్థురాలనీ ఆయనకు బాగా అనుమానంగా వున్నది. తను ఇల్లు కదలగానే వీళ్ళు ఏంచేస్తారోనని ఆయనకు భయంగా వుంది.

కానీ ఇప్పుడు—ఈ పరిస్థితుల్లో సులోచనను బయట

మరో ఇంట్లో వుంచడం కూడా అంత శ్రేయస్కరంకాదని ఆయనకు అనిపించింది. మహాలక్ష్మి శత్రువుల మనిష యుంటే—ఆమె అనుసరించి సులోచన ఉనికి తెలుసుకుంటుంది. శత్రువుల మనిషి కాని పక్షంలో ఆమె ఇంట్లో ఉండడం సులోచనకు అధిక రక్షణ అవుతుంది. ఏది ఏమైనా సులోచనను ఇల్లు కదపడం మంచిదికాదని ఆయనకు తోచింది. అయితే ఆమెకు రక్షణ అవసరం.

ఆయన కొడుకు సురేంద్రను పిలిచి — "ఈ రోజు నువ్వు ఆఫీసుకు సెలవుపెట్టేస్తే మంచిది...." అన్నాడు. అంతకంటే యెక్కువ ఆయన వివరించనవసరంలేక పోయింది.

ఆయన మాటలు వింటూనే సురేంద్ర—"ఎలాగూ నేను సెలవు పెట్టేద్దామనుకుంటున్నాను. యెందుకో హఠాత్తుగా తల బద్దలైపోయేటంత నొప్పిగా వుంది—" అన్నాడు.

సుబ్బారావు కంగారుగా కొడుకువంక చూసి— "ఏమయింది? ఈ తల నొప్పి రాత్రినుంచీ వున్నదా— ఉదయమే ప్రారంభమయిందా — ఏదైనా తిన్నాక మొదలయిందా.... వెంటనే ఓసారి డాక్టర్ని కలుసుకుంటే...." అని ఇంకా ఏదో అనబోతూంటే సురేంద్ర కంగారుపడ్డాడు. అప్సరకోసం తనేదో వంక పెట్టి ఇంట్లో వుండిపోదామనుకుంటూంటే తన తల నొప్పి నిజమే అనుకుని తండ్రి కంగారుపడిపోతున్నాడు.

"అబ్బే—మరీ అంత కంగారు అవసరం లేదులెండి— ఇప్పుడిప్పుడే కాస్త నెమ్మదిస్తోంది. రాత్రి సరిగ్గా నిద్ర పట్టక అలాగుందనుకుంటాను. ఈ రోజుకు విశ్రాంతి తీసుకుంటే అన్నీ అవే సర్దుకుంటాయి—" అన్నాడతను.

కూతుర్ని కూడా ఇంట్లో వుండిపొమ్మని సలహాయిస్తే- దేవీబాల వినలేదు. ఆ రోజు చాలా ముఖ్యమైన క్లాసులున్నాయనీ — మిస్సు కావడానికి వీల్లేదనీ నొక్కి చెప్పింది. అయితే యెక్కడికీ వెళ్ళవద్దనీ, కేవలం తనకు తెలిసిన స్నేహితురాండ్రతోనే గడపాలనీ—సాయంత్రం తిన్నగా ఇంటికొచ్చేయమనీ మరీ మరీ చెప్పాడు సుబ్బారావు. తండ్రి ఆ రోజు మరీ అంతలా యెందుకు చెబుతున్నాడో అర్థంకాకపోయినా—దేవీబాల అంగీకార సూచకంగా తలూపింది.

## 10

"వదినగారూ—పురోహితుడు రావడానికింకా చాలా టయిముంది. కాస్త కత్తిపీటిలా పారేయండి. కూర తరుక్కుంటాను—" అంది మహాలక్ష్మి.

"ఏం కూర తెచ్చుకొచ్చారేమిటి?" అంది నవ్వుతూ సులోచన.

"వంకాయలు. ఎలా వండుకున్నా బాగుండే కూర అదొక్కటేకదా...." అని నవ్వింది మహాలక్ష్మి. సులోచన కత్తిపీట తెచ్చి ఆవిడకిచ్చి ముచ్చటగా ఆవిడనే చూస్తూ కూర్చుంది.

బ్యాంగులోంచి మూడు సీటొంకాయలు తీసింది మహాలక్ష్మి. వాటిని తరుగుతూ కబుర్లు మొదలెట్టింది—"నాకు రుచి మహాపట్టింపులెండి—ఉల్లికారం కూర చాలా ఇష్టం నాకు. యెలాగూ బ్యాగు తెస్తున్నాంకదా అని కాసిని ధనియాలు, నాలుగుల్లిపాయలూ వగైరాలన్నీ మూట కట్టుకొని వచ్చాను. కూర కూడా నేను చాలా బాగా చేస్తాను. వాసన చూస్తేనే నోరూరిపోతుంది. అలాగని తొందరపడి మీరు మాత్రం రుచి చూడకండి. వతికితే

అతకదంటారుకదా—"

మహాలక్ష్మి అతి చనువు ఇబ్బందిగానే వున్నా—అరమరికలు లేని ఆవిడ మన స్తత్వమూ — ఆవిడ చెప్పే సరదా కబుర్లూ సులోచనను బాగా ఆకర్షించాయి. ఈవిడ వియ్యపురాలయితే బాగానే వుంటుందని ఆమెకూ తోచింది. ఆమెతో అవీ యివీ కబుర్లు చెబుతూనే మహాలక్ష్మి ఘుమఘుమలాడే వంకాయ కూర చేసింది. తనకూ కూతురికీ మటుక్కి అన్నం వండింది. కూడా తెచ్చుకున్న క్యారియర్లోని కొంత పెరుగుతీసి మెంతి మజ్జిగ పెట్టింది. సంజుకుందుకు చిన్న సీసాలో ఊరగాయ కూడా తెచ్చుకొచ్చిందావిడ.

సుమారు పదకొండు గంటల ప్రాంతంలో పురోహితుడు వచ్చాడు. ఆయనెంతో సేపుండలేదు. సురేంద్ర, అప్సరల జాతకాలు పరీక్షించి—అద్భుతంగా సరిపోయాయన్నాడాయన. ఆ జాతకాలు చూసేక కాబోయే వధూవరులను చూడాలన్న కోరిక కూడా ఆయనకు కలిగింది. వేరే గదిలో కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్న అప్సర, సురేంద్ర ఆయన కోరిక మేరకు వచ్చి దర్శనమిచ్చారు.

"జాతకాలనుబట్టే అనుకున్నాను. ఇది అద్భుతమైన జంట—" అన్నాడు పురోహితుడు. ఈలోగా బాత్రూమ్ వివరాలడిగి తెలుసుకుని—అప్సర అక్కడికి వెళ్ళివచ్చింది. ఆమె తిరిగి వచ్చేసరికి పురోహితుడు సెలవు తీసుకుంటున్నాడు. అప్సరను చూస్తూనే మహాలక్ష్మి-"అమ్మాయ్ నీ చేతికున్న ఆ గాజు ఆయనకు మొదటి బహుమతిగా ఇచ్చేయమ్మా—" అన్నది.

అప్సర ఎడమ చేతికి ఒక లావుపాటి వెండిగాజు వున్నది. తల్లి మాట వింటూనే ఆమె గాజుతీసి తల్లికిచ్చేసి — "నీ చేత్తో నువ్వే ఇయ్యమ్మా—" అన్నది. మహాలక్ష్మి ఇవ్వగా—"మహా ప్రసాదం—" అని అందిపుచ్చుకుని పురోహితుడక్కణ్నించి వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయే ముందు త్వరలోనే కళ్యాణం జరగాలని అప్సరను ఆశీర్వదించి మరీ వెళ్లాడు.

పురోహితుడు కనుమరుగు కాగానే మహాలక్ష్మికి ఎక్కడలేని ఆకలి పుట్టుకొచ్చింది. భోజనానికి రమ్మంటే అప్సర మాటలు భోంచేస్తున్న సురేంద్రకు ఆకలే లేకుండా పోయింది. అప్సర తనకూ ఆకలి లేదన్నది. ఆ కారణంగా మహాలక్ష్మికి తోడుగా సులోచన కూడా భోజనం చేసేసింది. భోజనాలు పూర్తికాగానే సురేంద్రను పిలిచింది సులోచన. ఈసారి సురేంద్రకూ, అప్సరకూ కూడా ఆకలి వేసింది.

కొడుక్కి త్వరగా పెళ్ళి చేసేయాలని మనసులో అనుకున్నది సులోచన. లేకపోతే ఆడవాళ్ళంటే ఎంతో మొహమాటపడే సురేంద్ర అప్సర వంక ఆవురావురుమంటూ చూడడమేకాక ఆమెతో ఏకాంతం కోసం తెగ తంటాలు పడిపోతున్నాడు. ఇంట్లో తల్లి కూడా వుందన్న విషయమే అతడి దృష్టిలో వుండడంలేదు.

సురేంద్ర, అప్సర భోజనాలు చేస్తూండగా ఇంట్లో టెలిఫోన్ మ్రోగింది. సులోచన రిసీవర్ ఎత్తింది.

అవతలనుంచి సుబ్బారావు మాట్లాడుతున్నాడు. అంతా క్షేమంగా వున్నారనీ చెప్పుకోదగ్గ విషయాలేమీ జరుగలేదనీ విని ఆయన సంతృప్తిగా ఫోన్ పెట్టేశాడు.

# 11

సుబ్బారావు అసహనంగా వాచీ చూసుకున్నాడు. పనులన్నీ చూసుకుంటూనే వున్నా ఆయన మనసు మనసులో లేదు. రంగనాథ్ యెప్పుడు వస్తాడూ, యెలా వస్తాడూ—వచ్చి ఏం చేస్తాడూ అన్న ఆలోచనలనుంచి ఆయన తప్పించుకోలేక పోతున్నాడు.

ఈ విషయం ఆయనింతవరకూ పోలీసులకు చెప్పలేదు. తన భార్యాబిడ్డలకేదైనా అపకారం జరుగుతుందేమోనన్న భయం ఆయనలో ఓ మూల వుంది. పరిస్థితులనుబట్టి తనే అన్యాయాన్నెదుర్కోగలనన్న నమ్మకం కాస్త వుంది.

ఏది ఏమైనప్పటికీ ఆ రోజు మాత్రం ఆయన కాస్త టెన్షన్‌లో వున్నాడు. మధ్య మధ్యలో ఇంటికి ఓసారి ఫోన్ చేస్తున్నాడు. సులోచన కంఠం విన్నప్పుడల్లా ఆయనకు ధైర్యం కలిగి తను—అనవసరంగా కంగారు పడుతున్నానేమోనని అనుకోసాగాడు.

టైము ఒంటిగంటం పావయింది.

"హలో—సుబ్బారావుగారూ—కులాసానా—"

అన్నారెవరో.

సుబ్బారావులిక్కిపడి చూశాడు. అతను...కాదు కాదు ఆయన....తనకు బాగా తెలుసును....ఆయన పేరు రంగనాథ్! ఆయనకు తన బ్యాంకులో అకౌంట్సున్నాయి. టర్నోవర్ లక్షల్లో వుంటుంది.

సుబ్బారావు బుర్ర పనిచేయడం మానేసింది. నాగు చెప్పిన ప్రకారం ఈ రోజు బ్యాంకుకు రంగనాథ్ అనే అతను రావాలి. ఆ రంగనాథ్ ఆరితేరిన గజదొంగ అని తను భావిస్తున్నాడు. ఇప్పుడు రంగనాథ్ నిజంగానే వచ్చాడు. అయితే ఈ రంగనాథ్ తనకు బాగా

తెలుసు. నగరంలో పేరుమోసిన వ్యాపారస్థుడీయన.

"రండి__కూర్చోండి__" అన్నాడు సుబ్బారావు.

రంగనాథ్ కూర్చుని__"ఏమిటలా చూస్తున్నారు?" అన్నాడు.

"ఏమీ లేదు __ మీకు నాగు తెలుసా?" అడిగాడు సుబ్బారావు.

"నాగా__అంటే ఎవరు?" అన్నాడు రంగనాథ్ ప్రశ్నార్థకంగా.

"అతడి పూర్తి పేరు నాగరాజారావు. యెరిగున్న వాళ్ళంతా అతన్ని నాగు__అని పిలుస్తారట__"

రంగనాథ్‌కు గుర్తు వచ్చినట్లుంది__గలగలా నవ్వి__ "అతనా__నాకు బాగా తెలుసు. చాలా ఫన్నీ ఫెలో- టీ కప్పుల్లో తుఫాను సృష్టించడం అతని హాబీ__" అన్నాడు.

"అంటే?" అన్నాడు సుబ్బారావు.

"ఎవరో ఒక వ్యక్తికిని ఎన్నుకుంటాడు. వాళ్ళింట్లో జరగబోయే కొన్ని సంఘటనలు ముందుగానే తెలుసుకుని వాటికి విపరీతార్థంతో చే పరిస్థితులు కల్పిస్తాడు. ఆ మనిషి సందిగ్ధంలో తల మునకలవుతుంటే తను ఆనందిస్తాడు. ఒకసారేమయిందంటే...." క్షణం ఆగాడు రంగనాథ్.

"చెప్పండి__" అన్నాడు సుబ్బారావు.

"అతను నాకు ఫోన్ చేసి__ఈ రోజు రాత్రి నీ ఇల్లు దోస్తాను. ఆ దోపిడీ ఆపడం నీ తరం కాదు. నువ్వూహించలేని రూపంలో వస్తున్నాను__" అన్నాడు. ఫోన్ చేసిందెవరో నాకు తెలియదు. ఆ తర్వాత నేనింటికి ఫోన్ చేసి కనుక్కుంటే యెవరో అపరిచితుడు పెళ్ళి సంబంధం గురించి వివరాలకోసం వచ్చినట్లు మా ఇంటికి

వచ్చాడని తెలిసింది. అతన్ని వెయ్యి కళ్ళతో కనిపెట్ట వలసిందనీ, చాలా జాగ్రత్తగా వుండమనీ ఫోన్ చేశాను.

ఆ రోజు సాయంత్రం మా యింటికి నాగు కూడా వచ్చాడు. మేమూ—అపరిచితుడితో మా ప్రవర్తన చూసి అతడు చాలా వినోదించాడు. రాత్రి మా ఇంట్లోనే పడుకుని — మరి రెండు అనుమానాస్పద సంఘటనలు కూడా సృష్టించి—మమ్మల్ని మరికాస్త కలవరపరిచాడు. మర్నాటికే విశేషమూ జరక్కపోయేసరికి నా అనుమానం నాగుమీదకు మళ్ళి క్రమంగా బలపడింది. నిలదీస్తే ఒప్పుకున్నాడు నాగు...”

సుబ్బారావు క్షణం ఆలోచించి—“మీరు బ్యాంకుకు వస్తున్నట్లు నాగుకు తెలుసా?” అన్నాడు.

“తెలియకేం — రెండ్రోజుల క్రితమే తెలుసును. అతడికి సంబంధించిన పనిమీదనే నేనీరోజు బ్యాంకుకు వచ్చాను. ఓ యాభై వేలు విత్ డ్రా చేయాలి—” అన్నాడు రంగనాథ్.

సుబ్బారావు విచిత్రావస్థలో వున్నాడు. రంగనాథ్ తనకు బాగా తెలుసు. ఆయనిప్పుడేదో తమాషా చేస్తాడని ఆయననుకోవడంలేదు. కానీ నాగు మాటలు కేవలం నాటకమంటే ఆయన నమ్మలేకపోతున్నాడు. నిజంగా అవి నాటకమే అయితే—నాగు కృతకృత్యుడయ్యాడనే చెప్పుకోవాలి. ఎందుకంటే ఒకటి రెండ్రోజులపాటు తను పడ్డ మానసికావస్థ సామాన్యమైనది కాదు.

## 12

“అమ్మా—బిచ్చం తల్లీ!” ముష్టివాడా ఇంటిముందు నిలబడి గట్టిగా కేక పెట్టాడు.

చెయ్యూర్యారుకో లేదనబోయింది సులోచన. మహాలక్ష్మి

ఆమెను వారించి—"తెచ్చుకున్నవాటిలో కాసిని బియ్యం మిగిలిపోయాయి. అవి వాడికిచ్చేస్తే సరిపోతుంది—" అని లేచి వీధిలోకి వెళ్ళి —"ఏరా — డబ్బాతో సహా కాసిని బియ్యమున్నాయి—పట్టుకెడతావా?" అంది.

"ఏం డబ్బా అమ్మా — ఇంట్లో బియ్యముంచుకునే పెద్ద డబ్బానా—లేక పిల్లల పాలపొడుందే—గ్లాక్సో డబ్బానా?" అన్నాడు బిచ్చగాడు.

"ఏదైతే నీకెందుకు? ఇచ్చింది తీసికెళ్ళు—" అంటూ వాడికో అరకేజీ గ్లాక్సో డబ్బా దానంచేసింది మహాలక్ష్మి. డబ్బా పెద్దదే కానీ బియ్యం మాత్రం అందులో నాలుగో వంతుకూడా లేవు.

బిచ్చగాడికి దానం చెయ్యడమయ్యేక-మళ్ళీ సులోచన, మహాలక్ష్మి కబుర్లలో పడ్డారు. సులోచనకు కాస్త విసుగ్గా వుంది. ఈవిడ వాటంచూస్తే ఇప్పట్లో కదిలేటట్లు లేదు. అప్పుడే ఒంటిగంట దాటింది.

సులోచనకైతే కాసేపు మేను వాల్చాలనుంది. అది సూచిస్తూ ఆమె ఆవలించింది. మహాలక్ష్మి ఆమెవంక పరిశీలనగా చూసి—"మధ్యాహ్నం మీకూ నాకులాగే కాసేపు మేనువాల్చడం అలవాటనుకుంటాను. కాసేపు పడుకునే వెడతాలెండి — ఇప్పుడింటికి వెళ్ళి మాత్రం చేసేదేముంది కనుక—ఎలాగూ భోజనాలైపోయాయి." అంది.

సులోచన సురేంద్రను కేకపెట్టి పిలిచింది. అతను వచ్చి ఇద్దరికీ చెరో మడత మంచం వేశాడు. ఈలోగా అప్సర కాబోయే అత్తగారికీ, తల్లికీ మంచినీళ్ళిచ్చింది. "మరి నాకో?"—అన్నట్లు చూశాడు సురేంద్ర. అతడికీ ఓ గ్లాసు మంచినీళ్ళిచ్చిందామె.

మహాలక్ష్మి మంచంమీద ఇటూ అటూ దొర్లుతోంది కానీ సులోచన కదలడంలేదు. వాళ్ళు నిద్రపోవడం కళ్ళారా చూసి కదలాలన్న సురేంద్రవు కనులు మూత పడుతున్నాయి. అతను అప్సరవు సైగ చేసి—తన గదిలోకి వెళ్ళిపోయి—ఆమె వచ్చేలోగానే నిద్రవు పడ్డాడు. అప్సర వెళ్ళి నిద్రపోతున్న అతన్ని కదిపిచూసింది. యెక్కడా చలనంలేదు.

ఇంతలో టెలిఫోన్ మ్రోగింది. అప్సర పరుగున వెళ్ళి రిసీవర్ తీసింది.

"హలో — సులోచ నేనా మాట్లాడుతూంట—" అంది సుబ్బారావు కంఠం.

"నేను—అప్సరని మామయ్యగారూ—అత్తయ్యగారిప్పుడే నిద్రవు పడ్డారు. లేపమంటావా?"

"అవసరం లేదులే అమ్మా—" అవతల ఫోన్ క్లిక్ మంది.

అప్సర చిన్నగా నిట్టూర్చి అక్కణ్నించి నెమ్మదిగా తల్లి వద్దవు వెళ్ళి—చిన్నగా—"అమ్మా!" అంది.

మహాలక్ష్మి చటుక్కున లేచి కూర్చుని—"సురేంద్ర నిద్రపోయాడా?" అన్నది.

"ఆహా—ఒళ్ళు తెలియకుండా నిద్రపోతున్నాడు."

"ఫోన్ ఎవరిదగ్గర్నుంచి—సుబ్బారావుగారా?"

"అవును—అత్తయ్యగారిని పిలిచారు—"

"ఆయనగానీ వస్తాడేమో—" అంది మహాలక్ష్మి.

"అవకాశాలున్నాయి...." అంది అప్సర.

మహాలక్ష్మి ఆలోచనలో పడింది — "ఇంకా ఇద్దరు రావాలి. వస్తే మనం వెళ్ళిపోవచ్చు—"

"నాలుగుదాకా అనుకున్నాంగదా—అంతవరకూ ఆగ

వలసిందే—"

"నాలుగు వరకూ రాకపోతే—మళ్ళీ ఇలాంటవకాశం దొరకదూ—?"

ఇంతలో కాలింగ్ బెల్ మ్రోగింది.

"సుబ్బారావుగారేమో?" అంది మహాలక్ష్మి మంచం మీద వాలిపోతూ.

"నేను వెళ్ళి చూస్తాను. నువ్వు నిద్ర నటించు—" అంటూ తన బ్యాగులోంచి ఓ తెలుగు పత్రిక తీసి గుమ్మం వద్దకు వెళ్ళి తలుపు తీసింది.

వచ్చినది సుబ్బారావు కాదు. ఒక నడివయస్కురాలు.

"మీ అమ్మగారున్నారమ్మా?" అనడిగిందావిడ.

"మా అమ్మగారంటే?" ప్రశ్నించింది అప్సర.

"మీ అమ్మగారంటే మీ అమ్మగారే—దానికి వేరే అర్థాలేవు—" అందా నడివయస్కురాలు.

"నిజమే—కానీ ఇది మా యిల్లుకాదు. ఈ యింటికి చుట్టపు చూపుగా వచ్చాం మేము. ఈ ఇంటావిడ మా అమ్మకాదు—" అంది అప్సర.

ఆ నడివయస్కురాలు గతుక్కుమన్నట్లు కనబడింది-"ఇంటావిడెవరైతే నాకేమమ్మా — పక్కింట్లో దిగి రెండ్రోజులైంది. కాస్త కాఫీపొడి కావాలి. ఉందం టారో లేదంటారోనని గిన్నె తెచ్చుకోలేదు. కాస్త ఏ డబ్బాలోనైనా వేసి ఇస్తే — తర్వాత మీ డబ్బా మీ కిచ్చేస్తాను—" అందావిడ.

మహాలక్ష్మి చటుక్కున లేచి కూర్చుని — "పెద్ద డబ్బానా, చిన్న డబ్బానా?" అన్నది.

"డబ్బా పెద్దదైతేనేం—చిన్నదైతేనేం—నాకు కావలసిందో కప్పుడు కాఫీ పొడుం—అంతేగా—" అని-

"అసలే మా ఇంట్లో డబ్బాలు లేవు. మీరే గ్లాస్కో డబ్బాలోనైనా వేసిచ్చారంటే సంతోషిస్తాను—...."
అన్నది.

అప్సర సందేహించకుండా తమ సంచీలోంచి ఒక అరకేజీ గ్లాస్కో డబ్బాతీసి ఆవిడకిచ్చింది.

"వస్తానమ్మా — మీ కేమీ అనుకోనంటే డబ్బా వుంచేసుకుంటాను" అంటూ అక్కణ్నించి వెళ్ళిపోయిం దావిడ. అప్సర ఆవిడ వెనకాలే వెళ్ళి తలుపులు వేసింది.

"అమ్మయ్య—" అంది మహాలక్ష్మి—"ఇంక ఒక్కరే రావాల్సింది—"

## 13

టైము సుమారు పావు తక్కువ రెండయ్యేసరికి రంగ నాథ్ వెళ్ళిపోయాడు. సుబ్బారావు భారంగా నిట్టూ ర్చాడు. ఇంతవరకూ ఏమీ జరుగలేదు. ఇంకా జరుగు తుందన్న అనుమానం కూడా ఆయనకు లేదు. మరోసారి యింటికి ఫోన్ చేసి పరిస్థితి తెలుసుకుందామనుకున్నా డాయన. ఆ ప్రయత్నంలో ఆయన నంబరు డయల్ చేయబోతూండగా—

"మీరు తిన్నగా వున్నంతకాలం మీవాళ్ళకే ఇబ్బందీ రాదు. ఫోన్ చేయడం అనవసరం—...." అన్న మాటలు వినబడి అప్రయత్నంగా రిసీవర్ హుక్ చేసి వచ్చిన మనిషిని చూశాడు సుబ్బారావు.

"చాలా సేపటి క్రితమే రావాల్సింది నేను. కానీ మీతో యెవరో ఉన్నారు. అందుకని వేచివుండాల్సి వచ్చింది—" అన్నాడతను.

"ఎవరు మీరు?" అన్నాడు సుబ్బారావు.

"రంగనాథ్-" అన్నాడతను. సుబ్బారావులిక్కిపడి

కంగారుగా ఆయనవంక చూశాడు—"నేను వస్తానన్న సంగతి మీకు తెలుసునని నాకు తెలుసు. నేనిప్పుడు వచ్చినది—సరిగ్గా అయిదంటే అయిదే లక్షలకోసం...."

"అన్ని పేపర్స్నా తీసుకొచ్చారా?"

రంగనాథ్ నవ్వి — "పేపర్సెందుకు?" అన్నాడు.

"లోన్ శాంక్షన్ కి—"

"నేను డబ్బు తీసుకు వెళ్ళడానికి రాలేదు. దాచ డానికి వచ్చాను. అయితే అయిదు లక్షలు దాచాలి...."

"ఎక్కడ—ఎలా?"

"ఒక బ్యాంక్ ఏజంట్ గా మీరీ ప్రశ్న అడగడం బాగోలేదు. మీకు లాకరుందికదా-అందులో దాస్తాను.." అన్నాడు రంగనాథ్.

సుబ్బారావాశ్చర్యంగా — "నా బ్యాంకులో నా లాకర్లో అయిదు లక్షలు దాస్తారా? మీకంత నమ్మక ముంటే నాదేమీ అభ్యంతరంలేదు—" అన్నాడు.

"మనుషుల్ని నమ్మకంగా వుంచడం వెన్నతో పెట్టిన విద్య నాకు. ఆ విషయంలో మీరేమీ భయపడనవసరం లేదు—" అన్నాడు రంగనాథ్ గంభీరంగా.

"భయం నాకెందుకూ-మీకుండాలిగానీ-" అన్నాడు సుబ్బారావు.

"నాతో పరిచయం కత్తిమీద సాములాంటిది. అది కొనసాగినంత కాలమూ యెవరైనా భయపడవలసిందే! అయితే నాకు నేనై యెవరి జోలికీ వెళ్ళను ..."

"అది నిజంకాదు. మీకు మీరై నాతో పరిచయం కలిగించుకున్నారు—"

"పరిచయం కావాలనే చేసుకున్నాను. కానీ దాన్ని జోలికిరావడం అనను. జోలికి రావడం అంటే నా విష

యంలో తెలిసినవారెవ్వరూ ఇప్పుడు బ్రతికిలేరు—"

"అలాగా—ఉదాహరణలేమైనా ఉన్నాయా?"

రంగనాథ్ నవ్వాడు—"ఉదాహరణకు మీరిప్పుడు సహకరించలేదనుకోండి. సాయంత్రం ఇంటికి వెళ్ళేసరికి మీకు భార్యా వియోగమూ, కడుపుశోకమూ కలుగుతుంది—"

సుబ్బారావు ముఖంలో కలవరపాటు స్పష్టంగా కనపడింది—"మీరనవసరంగా కాలయాపన చేస్తున్నారు. నాకింకా చూసుకోవాల్సిన పనులు చాలా వున్నాయి. లాకర్లో డబ్బు దాచుకోదల్చుకుంటే ఆ పని త్వరగా చేసి వెళ్ళండి—" అన్నాడాయన.

"గుడ్—పదండి—" అంటూ రంగనాథ్ లేచాడు. సుబ్బారావెవర్నో పిలిచాడు. అతడికేదో చెప్పాడు. మరుక్షణంలో అతను సుబ్బారావుకు పెద్దసైజు తాళాలున్న గుత్తి ఒకటిచ్చాడు.

అందుకుని—"రండి—" అన్నాడు సుబ్బారావు. ఏం జరుగుతుందోనని ఆయన గుండె దడదడలాడుతున్నది.

రంగనాథ్ లేచి నిలబడి ఉత్త చేతుల్తోనే ఆయన్ననుసరించాడు.

"ఉత్త చేతుల్తోనే వస్తున్నారు.." అన్నాడు సుబ్బారావు అనుమానంగా.

"అయిదులక్షలంటే క్యాషనుకున్నారేమిటి? వజ్రాలు-అంత విలువచేసే వజ్రాలు—జేబులో వున్నాయి పదండి" అన్నాడతను.

వజ్రాలనగానే సుబ్బారావు ముఖంలో ఏదో మార్పు వచ్చింది. అయినా ఆయన తొట్రుపడకుండా—ముందుకు నడిచాడు. ఇద్దరూ లాకరున్న గదిలోకి వెళ్ళారు. సుబ్బా

రావు ముందు పెద్ద తలుపు తీశాడు. లోపల చాలా అరలున్నాయి. ప్రతి అరకూ మూడేసి కీ హోల్సున్నాయి. మాస్టర్ కీతో లాకర్ నంబరు పదకొండు తెరిచాక సుబ్బారావు తన జేబులోకి చేయి పోనిచ్చి స్వంత తాళాల గుత్తి తీశాడు. అందులోని ఒక తాళం లాకర్ రెండో కీ హోల్లో పెట్టి తిప్పేక లాకర్ తలుపు తెరుచుకుంది.

జేబులోకి చేయి పోనిచ్చి ఒక చిన్న భరిణను బైటకు తీశాడు రంగనాథ్. నెమ్మదిగా దాన్ని లాకర్లోకి తోసే ముందు చేతో లోపల తడిమాడు. ఏమీ తగల్లేదు. లాకరు ఖాళీగా వుంది. రంగనాథ్ ముఖంలో కొద్దిగా నిరుత్సాహం కనిపించింది. అతను భరిణను లాకర్లో వదిలి సుబ్బారావు వంక తీక్షంగా చూసి - "మీ కింకో లాకర్ వుందిగదా - నా రెండో భరిణను అందులో వుంచుతాను" అన్నాడు.

సుబ్బారావు తాపీగా - "లాకర్లో చాలా ఖాళీవుంది" అన్నాడు.

"సుబ్బారావుగారూ నిర్ణయాలు నావే కానీ మీవి కాదు. చెప్పినట్లు చేయడమే మీ కర్తవ్యం. రెండున్నర కల్లా నేను వెళ్ళి మీ యిల్లు చేరకపోతే__మీరు చాలా దుర్వార్తలు వినాల్సి వుంటుంది. కాబట్టి క్విక్ ...."

సుబ్బారావు ఆలస్యం చేయకుండా రెండో లాకర్ కూడా తెరిచాడు. ఆయన ముఖంలో కొద్దిగా దిగులు కనబడింది.

"నంబర్ ఇరవై ఏడుకదా - అది నా లక్కీ నెంబర్" అన్నాడు రంగనాథ్. అతను జేబులోంచి ఇంకో చిన్న భరిణనుతీసి - ఆ లాకర్లో ఉంచుతూ చేత్తో తడిమాడు.

వున్నట్లుండి అతడి ముఖం వెలిగింది. బయటకు చిన్న భరిణతీసి - పరీక్షగా చూడసాగాడు.

"అది మీ భరిణ కాదు-" అన్నాడు సుబ్బారావు.

"కాదని ఎలా అనగలరు? దీనిమీద రంగనాథ్ అని పేరుంది చూడండి—" అంటూ అతను జేబులోంచి భూతద్దంతీసి భరిణకు పైగా వుంచాడు. అంతవరకూ చుక్కలుగా కనబడుతున్నవి - రంగనాథ్ అన్న అక్షరాలుగా మారాయి.

సుబ్బారావు తెల్లబోయాడు-"అవన్నీ మీకనవసరం. అది నా లాకర్లోది-"

"ఆ వస్తువుమీద నా పేరుంది!"

"అసలు మీ పేరు రంగనాథ్ అన్న గ్యారంటీ ఏమిటి?"

"ఏమిటా? దీన్ని చూడకముందే నా పేరు రంగనాథ్ అని మీకు చెప్పాను. దీనిమీద నా పేరుందన్న విషయంకూడా మీకు నేనే చెప్పిచూపించాను. ఇంకా చాలా వివరాలు తెలుదునుగానీ సమయం చాలదు. నేను త్వరగా వెళ్ళి మీ భార్యాబిడ్డల్ని రక్షించాలి. కాబట్టి ఆ రెండు లాకర్ల తాళాలు ఇలాగివ్వండి. వెంటనే వెళ్ళి పోతాను-..."

"నేనివ్వను-" అన్నాడు సుబ్బారావు.

"సుబ్బారావుగారూ — మీరు చిన్నపిల్లలుకారు. ఆ తాళాలు నాకు చాలా అవసరం. వెంటనే ఇచ్చేయండి" అన్నాడు రంగనాథ్.

"ఎందుకీ తాళాలు?" అన్నాడు సుబ్బారావు.

"రెండు ప్రయోజనాలు. ఒకటి నా వస్తువుల్ని నేను రక్షించుకోవడం. రెండు - ఇప్పుడు మీరు వెంటనే పోలీ

సుల్ని రప్పించి నన్ను పట్టించకుండా వుండడం. నన్ను పోలీసులు పట్టుకున్నారా - ఈ రెండు తాళాలూ పోలీసుల కిచ్చి మీ లాకర్లు చెక్ చేయమంటాను. వాటిలోకి దొంగ వస్తువులెలా వచ్చాయో చెప్పమంటాను. ఏ పరిస్థితుల్లో నేను వాటిని మీ లాకర్లో పెట్టానో-మీరు చెప్పలేరు. చెప్పుకున్నా యెవరూ నమ్మరు. ఎందుకంటే అందులో వుంచిన భరిణల మూతల్ని భూతద్దంలో చూస్తే— సుబ్బారావు అన్న పేరు కనబడుతుంది ఒకటి రెండ్రోజుల్లో లాకర్ల తాళాలు భద్రంగా మీకు అందుతాయి. ప్రస్తుతానికి నేను వెడుతున్నాను. అవతల మూడు ప్రాణాలు ప్రమాదంలో వున్నాయి...” అని సుబ్బారావు దగ్గర తాళాలు తీసుకుని - అక్కణ్ణించి కదిలాడు రంగ నాథ్.

సుబ్బారావు నిశ్చేష్టుడై చూస్తూండిపోయాడు.

## 14

“ఎవరో తలుపు తడుతున్నారు. వెళ్ళిచూడు-” అంది మహాలక్ష్మి. ఆమె మంచంమీద నిద్ర నటిస్తూంటే— చేతిలో పుస్తకంతో వెళ్ళి తలుపు తీసింది అప్సర. ఎదురుగా నిలబడ్డ పోలీస్ కానిస్టేబుల్ని చూసి ఉలిక్కి పడిందామె.

“మన్నించాలి-” అన్నాడు కానిస్టేబుల్ — “ఇలా ఈ యింట్లోకి ఎవరైనా మనిషి వచ్చాడా?”

“లేదు-” అంది అప్సర.

“చేతిలో గ్లాక్సో డబ్బా వుంటుంది-” అన్నాడు కానిస్టేబుల్ ఆమె మాటలు పట్టించుకోకుండా. గ్లాక్సో డబ్బా మాట వింటూనే ఉలిక్కిపడి లేచింది మహాలక్ష్మి.

“ఇలా రా నాయనా!” అన్నదామె. అతడు

లోపలకు నడిచాడు.

"ఏ మనిషీ ఈ ఇంట్లోకి రాలేదుకానీ - నా దగ్గర చాలా గ్లాక్సో డబ్బాలున్నాయి. కావాలంటే ఒకటిస్తాను. పట్టుకుపో-" అంది మహాలక్ష్మి.

"అరకేజీదేనా?" అనడిగాడు కానిస్టేబుల్.

"అవును-" అంటూ ఆమె అప్సరకు కనుసైగ చేసింది. అప్సర తమ సంచీలోంచి ఓ గ్లాక్సో డబ్బాతీసి పోలీసు కానిస్టేబుల్ కిచ్చింది. అతడు ధన్యవాదాలు చెప్పుకుని వెళ్ళిపోయాడు.

"మన పనైపోయింది-" అంది మహాలక్ష్మి.

"అయితే నేను సురేంద్రను లేపుతాను. నువ్వు అత్తయ్యగారిని లేపు-" అంది అప్సర. ఆమె వెళ్ళి నాలుగైదుసార్లు కుదిపేసరికి సురేంద్ర కళ్ళు నలుముకుంటూ లేచి - ఎదురుగా అప్సరను చూసి-"మీరు పక్కనుండగానే ఇంత మొద్దునిద్రపోయానా?" అన్నాడు.

"అమ్మ గురించీ నేనూ ఇంతసేపూ వుండిపోవలసి వచ్చింది. ఇప్పుడే అమ్మ లేచింది. వెళ్ళిపోదామంటోంది. వెళ్ళేముందు మీకు చెప్పిపోదామని... "

"చాలా మంచి సమయం వృథా అయిపోయింది-" సురేంద్ర బాధగా అన్నాడు.

"పోనీలెండి-ముందు రోజులన్నీ మనవేగదా-" అంది అప్సర అనునయంగా.

సులోచన సురేంద్రకోసం కేకపెట్టింది. అతను అక్కణ్ణించి కదిలాడు. అతన్ని చూస్తూనే రిక్షా పిల్చుకుని రమ్మని చెప్పింది సులోచన. సురేంద్ర కదిలేలోగా టెలిఫోన్ మ్రోగింది. సురేంద్ర వెళ్ళి ఫోన్ తీశాడు.

ఎవరైనా కొత్తవాళ్ళు మనింటికొచ్చారా - అంతా

ఏం చేస్తున్నారు-అని ప్రశ్నించాడు సుబ్బారావు. సురేంద్ర ఇంట్లోని పరిస్థితి వివరించి ఫోన్ పెట్టేసే సమయానికి ఎవరో వీధి తలుపు తట్టారు. అతనే వెళ్ళి తలుపుతీసి ఎదురుగా కనబడ్డ మనిషిని చూసి ఉలిక్కిపడి రెండడుగులు వెనక్కివేశాడు.

ఆ వ్యక్తి పోలీస్ డ్రస్సులో వున్నాడు.

“ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావుని. చిన్న పని మీద మిమ్మల్ని డిస్టర్బ్ చెయ్యాల్సొచ్చింది—” అన్నాడా వ్యక్తి—“కొద్ది క్షణాలక్రితం—ఈ వీధిలోనే సందు చివర యాక్సిడెంటయింది. యాక్సిడెంటుకు గురైన వ్యక్తి పోలీస్ డ్రస్సులో వున్నాడు. అతడి చేతిలో ఒక అర కేజీ గ్లాక్సోడబ్బా వున్నది. పోలీసు మనిషివద్ద గ్లాక్సో డబ్బా - అందులోనూ రోడ్డు మీద యూనిఫాంలో తిరిగే సమయంలో ఉండడం మాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది. విచారించినమీదట—ఆ కానిస్టేబుల్ మీ యింట్లోకి వచ్చాడనీ—తన చేతిలోని గ్లాక్సో డబ్బాను మీ యింట్లోంచే తీసుకువచ్చాడనీ తెలిసింది—” ఈశ్వర్రావు క్షణం ఆగి — “మీ ఇంట్లో ఎవరో అతడికా గ్లాక్సో డబ్బాని అందజేశారు....” అన్నాడు.

“మీరు పొరబడ్డారనుకుంటాను—....” అన్నాడు సురేంద్ర.

“ఇందులో నా పొరపాటేమీ లేదు—” అన్నాడు ఈశ్వర్రావు కఠినంగా—“అందుకు ఖచ్చితమైన సాక్ష్యముంది. మీ ఎదురింటాబ్బాయీరోజే జ్వరం తగ్గి పథ్యం తిన్నాడట. నిద్రపోకూడదన్నారని వాళ్ళింటి కిటికీ దగ్గర కూర్చుని వీధివైపే చూస్తూ కాలక్షేపం చేశాడట. అతను చెప్పిన ప్రకారం ఈ రోజు మీ యింటినుంచి

ముగ్గురికి గ్లాకోస్ డబ్బాలు అందాయి. ఒకటి ముష్టి వాడికి....”

ఈశ్వర్రావింకా ఏదో చెప్పబోతూండగా — “సరే నను కోండి. గ్లాకోస్ డబ్బాలు ఇవ్వడంలో తప్పేముంది?” అంది సులోచన.

ఈశ్వర్రావు జవాబిచ్చేలోగా—“ముందు మేమిక్క ణ్నుంచి బయటపడే ఏర్పాటు చేయండి వదినగారూ— తర్వాత ఈయన సంగతి చూద్దురుగాని—” అంది మహా లక్ష్మి.

“మన్నించాలి. నా ప్రశ్నలకు జవాబు దొరికేవరకూ ఈ ఇంట్లోంచి ఎవ్వరూ కదలడానికి వీల్లేదు. ఇది చాలా సీరియస్ విషయం. ఆ గ్లాకోస్ డబ్బాలు వజ్రాల స్మగ్లింగ్ కుపయోగించబడుతున్నాయి...” అన్నాడు ఈశ్వర్రావు.

సురేంద్ర దెబ్బతిన్నట్లు — “ఏమిటన్నారూ—కాస్త వివరంగా చెప్పండి” అన్నాడు.

“డబ్బాకు అడుగున కొన్ని లక్షలు విలువచేసే వజ్రా లుంటాయి. దానికిపైన చిన్న సీసారేకు మూత వుంటుంది. ఆపైన డబ్బాలో మామూలు నిత్యావసర వస్తువులుం టాయి. పోలీస్ కాన్‌స్టేబుల్ వద్దనున్న డబ్బాలో పంచ దార వుంది. అడుగున వజ్రాలున్నాయి. వాటి విలువ నాలుగు లక్షలు....” అన్నాడు ఈశ్వర్రావు.

## 15

మధ్యాహ్నం నిద్రపోకూడదని కిటికీ దగ్గర కూర్చున్న ఒక కుర్రవాడు — అనుకోకుండా జరిగిన యాక్సిడెంటు పోలీసులకు ఒక పెద్ద స్మగ్లింగ్ ముఠాని పట్టిచ్చాయి.

యాక్సిడెంట్‌కు గురైన కాన్‌స్టేబులు పోలీసు డిపార్టు మెంటుకు సంబంధించినవాడు కాదని తేలిపోయింది. అతడి దగ్గరున్న డబ్బాలో వజ్రాలు దొరికాయి. మహాలక్ష్మి, అప్సరలనను దబాయించగా మరికొందరు వ్యక్తులు బయటపడ్డారు.

మహాలక్ష్మి, అప్సర ముఠా వ్యక్తులు కారు. తామేం చేస్తున్నదీ వాళ్ళకు తెలియదు. ప్రతిఫలాపేక్షతో ఆ కుటుంబ వ్యక్తులందుకు సిద్ధపడ్డారు.

కాన్‌స్టేబులు వేషధారికి ప్రాణ ప్రమాదం జరుగలేదు. అయిదారురోజుల్లో అతను కోలుకున్నాక—మరికొందరు వ్యక్తుల పేర్లు తెలిశాయి.

కేసు నెలరోజులకు పైగా నడిచేక—నగరంలోని పెద్ద వ్యాపారస్థులలో ఒకడైన రంగనాథ్‌కు ఈ స్మగ్లింగ్‌తో సంబంధముందనీ—అతడి స్నేహితుడు నాగరాజారావు ఈ విషయంలో అతనికి కుడి భుజంగా ఉంటున్నాడనీ కూడా బయటపడింది.

పటిష్టమైన పథకంతో కుటుంబపరంగా వ్యవహారం నడిపించడంవల్ల పోలీసులకు ఆచూకీలు దొరకడంలేదు. అదృష్టమే నేరస్థులను పోలీసులకు పట్టిచ్చింది.

అదృష్టం సుబ్బారావును వరించిందనాలి. ఆయన వద్ద నుంచి లాకర్ తాళాలు తీసుకుపోయిన వ్యక్తి మర్నాడే ఆయనకు పోస్టులో అవి పంపించేశాడు. తన లాకర్లో ఉంచబడిన భరిణల్లో వున్నవి గాజాపూసలని తెలుసుకుందుకు సుబ్బారావుకు ఎన్నో రోజులు పట్టలేదు. అనుకోకుండా తనకు దొరికిన వజ్రాలు—అలాగే పోయినా—ఈ కేసులో తను ఇరుక్కోనందుకు ఆయన సంతోషించాడు.

ఇటు సుబ్బారావునుంచి వజ్రాల భరిణను సంపాదించడమూ — అటు తన స్మగ్లింగ్ కొనసాగించడమూ— రెండూ నెరవేరడంకోసం - ఒకప్పుడు కట్నం గురించి పెళ్ళి చెడిపోయిన వాసుదేవరావు బంధువులను పట్టాడు నాగరాజారావు. అతడి పథకం తెలివైనదే—కానీ విధి వక్రించింది!

ఏ ఉద్దేశ్యంతోనైతే నేం-నాగు-వాసుదేవరావు, దేవీబాలలను ఒకటి చేద్దామనుకున్నాడు. అసలు ఉద్దేశ్యం నెరవేరినా - సురేంద్ర, అప్సర - దేవీబాల, వాసుదేవ రావులకు కొన్ని నెలల తర్వాత వైభవంగా వివాహాలు జరిగాయి.

పాపం - కటకాల వెనకనున్న నాగరాజారావుకు తన పథకం సగభాగం నెరవేరిందని తెలియదు.

—:ఐ పో యి ం ది:—

# ఏడు రోజుల మజిలీ!

బి. రాజేశ్వరి

కెమెరా భుజాన తగిలించుకుని, మంచి ఏంగిల్ కోసం ఏట వాలుగా వున్న కొండ దిగువకు దిగుతున్నాడు తిలక్.

"ఇంకా కిందికి దిగకండి, జారిపోతారు!" హెచ్చరించింది లలిత.

"ఏం ఫరవాలేదు. నిన్ను ఎవరూ తియ్యని తియ్యలేని విధంగా ఫోటో తీస్తాను. నువ్వే సర్టిఫికేట్ యిచ్చావు కదా, స్టూడియో పెట్టుకుంటే వేలకు వేలు సంపాదించగలనని! మరి పేరు నిలబెట్టుకోవాలి కదా!" అన్నాడు నవ్వుతూ.

"ఏమో బాబూ, కింద అంతా లోయలు, బండరాళ్ళు! ఏమాత్రం కాలుజారినా యింక చెప్పేదేముంది? పోతే పోనివ్వండి పాడు ఫోటోలు. పైకి వచ్చెయ్యండి!"

"ఉహుఁ! నేననుకున్నది సాధించకుండా రాను."

"ఇంకా యెక్కడికి దిగిపోతున్నారు? ఓ పక్క లైటింగ్ ఫేడయిపోతోంది. సూర్యుడు అస్తమించ

బోతున్నాడు."

"ఇదే మంచి టైము. చూస్తుండు అస్తమించే సూర్య కిరణాల బంగారు వర్ణం నీ వంటి రంగుతో పోటీపడి ఈ కలర్ ఫిల్ముమీద ఎంత బాగా ముద్రింపబడుతోందో!" తిలక్ బండరాయికి చేరగిలబడి ఏంగిల్ సరిచేసుకుని క్లిక్ మనిపించాడు.

"ఇక చాల్లే వచ్చెయ్యండి. గెస్టు హౌస్ కి పోదాం."

"ఉహూ! మరో రెండు స్నాప్స్ తియ్యనివ్వు!" అంటూ వెనక్కి జరుగుతున్న తిలక్ ని లలిత వారిస్తూనే వుంది. కానీ అప్పటికే ఆలస్యమయిపోయింది. వెనక బండరాయి ఉన్నదనే ధీమాతో వెనక్కి చేరబడపోయిన తిలక్ చటుక్కున తూలి, పక్కకుతిరిగి చూడబోయాడు. ఏ ఆధారమూ లేకపోవటంతో జర్రున వెనక్కి వేగంగా జారిపోసాగాడు.

పైనుంచి లలిత కేకలు పెడుతోంది. తిలక్ ఏటవాలుగా జారిపోతూనే ఉన్నాడు.

లలిత చటుక్కున తనూ ఏటవాలుగా ఉన్న కొండ కంగారుగా దిగి భర్తను పట్టుకోవాలనుకుంది. కాని అతను అప్పటికే జారిపడిపోయాడు.

లలిత కెవ్వున కేక వేసింది. పట్టుకోవటానికి ఎలాంటి ఆధారమూ లేదు. అయినా అలాగే కాలు నిలదొక్కుకుంటూ ఏటవాలుగా ఉన్న కొండ దిగింది.

కింద లోయ మరీ ప్రమాదకరంగా లేదు. అక్కడ బండరాళ్ళుగాని, మొనతేలిన రాళ్ళుగాని లేవు మైదానంలాగా యిసక పర్ర వుంది.

లలిత కళ్ళు తిలక్ కోసం వేగంగా వెతుకుతున్నాయి. అతను కిందికి జారిపడటం స్వయంగా చూసింది. కాని

అతను ఆ చుట్టుపక్కల ఎక్కడా లేడు.'

లలితకు గుండె దడదడ కొట్టుకుంటోంది. అక్కడ జనసంచారంలేదు. బితుకు బితుకుమంటూ వుంది. ఓ పక్క చీకటి అలుముకుంటోంది.

"ఏమండీ" అంటూ నాలుగైసార్లు పిలిచింది. కాని సమాధానంలేదు.

"తిలక్, తిలక్" అంటూ పేరుపెట్టి పిలిచింది. అయినా తిలక్ జాడలేదు.

ఆమెకు ఏడుపొచ్చినంత పనయింది. తన కళ్ళముందు జారిపడిన భర్త యింతలో ఏమయినట్టు? కొండచుట్టూ పరీక్షగా చూసింది. చుట్టూ జీడిమామిడిచెట్లు గుబురుగా కిందికి వాలి పెరిగి వున్నాయి. ఎండుటాకులమీద ఏదో నడుస్తున్న చప్పుడు!

ఆమె చెవులు రిక్కించి విన్నది. ఆమె గుండె చప్పుడు ఆమెకే వినిపిస్తోంది.

ఓ ముంగిస అటునుంచి యిటు పరుగెత్తింది.

మళ్ళీ ఎండుటాకులమీద చప్పుడు. ఏదో జరజర పాకిన సవ్వడి! ఆమె వెన్నున చలిపుట్టింది.

ఓ పక్క చీకటి బాగా ముసురుకుంటోంది.

తిలక్ జాడ ఎక్కడా లేదు.

లలిత అడుగులో అడుగువేసుకుంటూ కొండ చుట్టూ మళ్ళీ పరికించి చూసింది.

సరిగ్గా అప్పుడే ఏదో భయంకర ఆకారం ఆమె ముందుకొచ్చి నిల్చుంది.

ఒక్కసారిగా కెవ్వుమంటూ అరిచి నేలమీద పడిపోయింది. ఆమెకు స్పృహ తప్పిపోయింది.

# 2

లలితకు మెలకువ వచ్చేసరికి పక్కమీద పడుకుని వున్నది. చెగ్గున లేచింది.

అంతవరకు ఆమె ముఖంలోకే ఆత్రుతగా చూస్తున్న తిలక్ కనిపించాడామెకు.

చుట్టూ పరికించింది. గెస్టు హౌస్‌లోని తాము బస చేసిన గదే అది! తనిక్కడికెలా వచ్చింది?

ఆమె ఒంటినిండా చెమట్లు! జాకెట్టు పూర్తిగా తడిసి పోయింది. పెట్టుకున్న కుంకుమ కరిగి ముక్కుమీదకు పాకిపోయింది. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు చాలా వేగంగా బరువుగా వున్నాయి.

"లల్లీ, నేను... తిలక్‌ని! ఎలా వుంది?" అంటున్నాడు తిలక్ భార్యను కుదుపుతూ.

"ఏమండీ, మీరు మీరేనా....?" అన్నది లలిత తడబడుతూ....ఆమె పెదాలు ఒణుకుతున్నాయి.

తిలక్ జగ్ నుంచి నీళ్ళు వంచి గ్లాసు తెచ్చి ఆమె నోటికందించాడు. గటగట తాగేసింది. మరో గ్లాసు నీళ్ళు వంచి ఆమెకిచ్చాడు. ఆ గ్లాసు నీళ్లు తాగి, గ్లాసు పక్కన పెట్టింది. భర్తవంక పిచ్చిగా చూస్తోంది.

"లల్లీ, ఏమిటా చూపు? ఎందుకంత గాభరాపడి పోయావు? ఏం జరిగింది?" అన్నాడు తిలక్.

ఆమె జరిగిపోయిన సంఘటనను గుర్తుచేసుకుని భయంలో వణికిపోయింది.

"మీరేమైపోయారు? నన్నిక్కడికెవరు తీసుకొచ్చారు?" అన్నది గొంతు పెకల్చుకుని.

"నేను ఆ పక్కనే బండ వెనక దాక్కుని నిన్ను ఆట పట్టిద్దామని చూస్తున్నాను. నువ్వు కొండ దిగి

రావటం చూశాను. నన్ను వెతుక్కోవటం చూసి నవ్వుకున్నాను. నన్ను పేరుపెట్టి పిలుస్తూ నువ్వు కొండకి అవతల పక్కగా నడుస్తున్నావు. నేను నీ వెనకనే వద్దామనుకుని బండ వెనకనుంచి లేచాను. కాని అంతలోనే నువ్వు పెద్దగా కేక పెట్టావు. నేను పరుగున వచ్చేసరికి నువ్వు స్పృహతప్పి పడిపోయావు. నాకు భయం వేసింది. నిన్ను భుజాన వేసుకుని కొండని చుట్టి ఆ పక్కగా తిరిగి గెస్టు హౌస్‌కి తీసుకొచ్చాను" అన్నాడు తిలక్.

లలిత యింకా విభ్రాంతినుంచి తేరుకోలేదు.

"మీ గురించి వెతుకుతూ కొండకి ఆవలపక్కకు వెళ్ళాను. అదే సమయానికి ఓ భయంకరమైన వ్యక్తి— నల్లగా పొడవుగా వున్నాడు. దుబ్బుగా పెరిగిపోయిన గడ్డం, ఎర్రటి కనుగుడ్లు సూటిగా నా వంకనే చూస్తూ వంకరగా నవ్వుతూ కనిపించాడు. నన్ను చూసి మీదికొచ్చాడు - అంతే, భయంతో ఒక్క కేక వేసి పడిపోయాను. అంతే తెలుసు నాకు!"

"ఛ, ఏదో భ్రమపడివుంటావు. నేను వెంటనే పరుగెత్తుకొచ్చాను కదా, నాకు అక్కడెవరూ కనిపించలేదు!"

"అబ్బా, నేను స్వయంగా నా కళ్ళతో చూశాను. అతను మనిషిలా కనిపించలేదు. ఏదో ఆటవికుడిలాగా, ఆదిమానవుడిలాగా కనిపించాడు. ఒంటిమీద షర్టు లేదు. నల్లటి పాంటు అతని ఒంటి రంగులో కలిసిపోయి వికృతంగా కనిపించింది. మనము సినిమాల్లో చూసే చింపాంజీలా వున్నాడు. అబ్బ....తలుచుకుంటేనే ఒళ్ళు కంపరమెత్తిపోతోంది. గుర్తొస్తేనే చాలు, వణుకు పుట్టుకొస్తోంది" లలిత నిజంగానే వణికిపోతోంది.

"ఒంటరితనం వల్ల జడుసుకుని వుంటావు అంతే! పడుకుని బాగా విశ్రాంతి తీసుకో!" అన్నాడు తిలక్. భార్య మాటలకి నవ్వొస్తోంది. కాని పైకి నవ్వితే ఆమె ఉడుక్కుంటుందని నవ్వును అణచుకున్నాడు.

టేబిల్ మీద కేరియర్‌లో భోజనం అలాగే వుంది. తిలక్ దాన్ని విప్పిన జాడలేదు!

"మీరు భోంచెయ్యలేదా?" అన్నదామె.

"ఉహుం! నువ్వు లేచాక చెయ్యవచ్చునని యెదురు చూస్తున్నాను. నువ్వు చాలా సేపు తెలివితప్పి పడిపోయావు! గెస్టు హౌస్‌లో ఓ డాక్టరు దిగటం మన అదృష్టం! వాచ్‌మన్ ఆయన్ని పట్టుకొచ్చాడు. ఆయన ఇంజక్షన్ చేసి వెళ్ళాక నే నువ్వు 'మేలుకున్నావు" అంటుండగానే ఓ నడివయసాయన లోపలికి తొంగిచూశాడు.

"హౌ యీజ్ షి?" అన్నాడు తిలక్‌తో.

తిలక్ భార్యవైపు సైగ చేసి, "షి యీజ్ ఆల్ రైట్ సార్!" అన్నాడు. ఆయన చిన్నగా నవ్వి "ఓ. కే! సీ యూ!" అంటూ బయటినుంచే వెళ్ళిపోయాడు.

ఆయనే డాక్టరని లలిత గ్రహించింది.

"ఇప్పుడు టైమెంతయింది?" అన్నదామె మంచం మీదనుంచి దిగుతూ.

"పదకొండు దాటింది!"

"బాప్ రే, నాలుగ్గంటలకి పైగానే తెలివి తప్పిపోయానన్నమాట!" అంటూ మొహం కడుక్కుని వచ్చి కేరియర్ విప్పి యిద్దరికీ వడ్డించింది.

"ఇదుగో, చెప్తున్నాను! ఉదయమే రూం ఖాళీచేసి వెళ్ళిపోదాం. నాకు ఒక్క క్షణం కూడా ఇక్కడ వుండాలనిపించటంలేదు" అన్నది లలిత.

ముద్ద పాలమారినట్టు దగ్గి, "అదేమిటి? వారం రోజులకి ప్రోగ్రాం వేసిందీ నువ్వే! ఒక్క రోజులో సరదా తీరిపోయిందా?" అన్నాడు.

"ఏదో ముందు తెలీక, సరదాగా గడపాలని వచ్చాం. కాని యిక్కడి వాతావరణం నాకు చాలా భయంకరంగా కనిపిస్తోంది. పైగా ఊరికి చాలా దూరంగా కొండలు చెట్లు పుట్టల మధ్య ఈ గెస్టు హౌస్ ఒక్కటి విసిరేసినట్టుంది. నాకు ఉండబుద్ది కావటంలేదు బాబూ!"

"దూరంగా వుండబట్టే ప్రశాంతంగా హాయిగా వుంది. లేనిపోని అనుమానాలు, భయాలు పెట్టుకోకు! నాకీ స్పాట్ చాలా బాగా నచ్చింది. ప్రకృతి సౌందర్యమంతా యిక్కడే పోగుపడినట్టుంది!" అన్నాడు తిలక్.

లలిత కోపంగా, ఉక్రోషంగా చూసింది భర్తవంక.

లలిత శ్రీమంతుల బిడ్డ. ఓ విధంగా పెద్దల నెదిరించి తిలక్‌ని ప్రేమించి పెళ్ళాడింది. తిలక్ ఓ సామాన్య కుటుంబంలోనుంచి వచ్చినవాడు. చదువుకునే రోజుల్లోనే లలిత అతన్ని అభిమానించి ఆరాధించేది. తిలక్ చాలా బ్రిలియంట్! అతని తెలివితేటలే అతని ఆసిగా అన్నిటా ఫస్టునవచ్చి యింజనీరింగ్‌లో యూనివర్శిటీ గోల్డు మెడల్ సంపాదించాడు.

లలిత అతని చదువు పూర్తయ్యేవరకు ఓపిగ్గా కాచుకుని వున్నది. అతని గమ్యానికి అడ్డురాకుండా అతను యింజనీరుగా ఉద్యోగం సంపాదించేవరకు ఎదురుచూస్తూ కన్యగానే మిగిలిపోయింది. తండ్రి ఎంతచెప్పినా మేనబావను చేసుకోవటానికి తిరస్కరించింది.

తిలక్ ఆమెతో పెళ్ళికి మొదట్లో అంగీకరించలేదు. అంతస్తుల తారతమ్యాన్ని దృష్టిలో పెట్టుకునే అతను

తనకి దూరంగా జరుగుతున్నాడని ఆమెకు తెలుసు. ఆస్తి, అంతస్తు వదులుకుని అతన్ని చేసుకోవటానికి సిద్ధపడింది.

తిలక్ — ఆమె తనను తననుగా గుర్తించి తనకోసం తండ్రిని, ఆస్తిని, వదులుకోవటానికి సిద్ధపడిన లలితను ఆనందంగా తనదాన్ని చేసుకున్నాడు. లలిత తండ్రికి దూరమైంది.

పెళ్ళయి మూడేళ్ళయింది. లలితకు స్త్రీ సహజమైన మాతృత్వ కోరిక తీరనేలేదు. అయినా అది వెలితిగా ఆమె యెన్నడూ ఫీలవలేదు. రోజురోజుకీ భర్తమీద ఆమె ప్రేమ, ఆరాధన రెట్టింపవుతూనే వచ్చాయి. వీలున్నప్పుడల్లా పిక్నిక్కులు, విహారయాత్రలు చేయిస్తూనే వుంటుంది.

ఆ విహార యాత్రలో ఓ భాగమే హిల్స్ మీద యీ గెస్టు హౌస్ లో నివాసం! లలితని సంతోష పెట్టడానికి తనకి వీలున్నప్పుడల్లా భార్య వేసిన యిలాంటి చిన్నచిన్న ప్రోగ్రాంలను ఆనందంగా ఒప్పుకుని ఆమెతో అందమైన సాయంత్రాలు గడపటం తిలక్ కి సరదా!

ఆ రోజే గెస్టు హౌస్ కొచ్చారిద్దరు.

## 3

మర్నాడుదయం నిజంగానే సూట్ కేసులు సర్దేస్తున్న భార్యని చూసి ఆశ్చర్యంగా అడిగాడు తిలక్!

“వాట్ డార్లింగ్ నిజంగానే వెళ్ళిపోవాలా?” అన్నాడు.

సర్దుతున్న లలిత అతని వంక తలెత్తి చూడకుండానే సీరియస్ గా తన పని చేసుకుపోతోంది.

“ఇంత దూరం వచ్చాం....కనీసం నాలుగురోజులైనా వుండి వెళ్దాము” అన్నాడు మళ్ళీ తనే.

చటుక్కున పెట్టెమూసి మూత బిగించి అతనివైపు చూసింది. అతను నవ్వేశాడు.

"నేను వెళ్ళిపోదామంటే మీరుంటాననటంలో మీ ఉద్దేశ్యమేమిటి?"

"ఇక్కడి ప్రశాంతమైన వాతావరణం, ఈ అందమైన ప్రకృతి నాకు చాలా నచ్చాయి లల్లీ!"

లలిత భర్త ముక్కు-పట్టి అల్లరిగా ఆడించి, "సరే! శ్రీవారు అంతగా ముచ్చటపడుతున్నారు కాబట్టి నాలుగు రోజులకి మాత్రం అంగీకరిస్తున్నారు దేవివారు. అయితే ఓ కండిషన్!" అన్నది.

"ఏమిటది, చెప్పెయ్యి వెంటనే!"

"మీరు ఫోటోలు తీస్తానని కొండలవెంట బండల వెంట పూరేగరాదు. అసలు యీ గది వదిలి బయటికే పోకూడదు."

"అదేమిటోయ్, మరీ అంత పెద్ద శిక్ష. గదిలో వుండి ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించేదెలా?"

"గదికి కిటికీలున్నాయి. ఇక్కడ్నుంచి ప్రకృతి చక్కగా కనపడుతోంది. మీకెక్కడలసినంత సేపు చూసి ఆనందించండి."

"అబ్బే, అదెలా కుదురుతుంది? దేవిగారితో వనవిహారం చెయ్యాలి. ప్రేమ పక్షుల్లా యీ ప్రకృతి ఒడిలో పరవశించాలి!"

"మీరొక్కరు విహరించండి. నేను మాత్రం రాను. కన్ను మూసినా తెరిచినా నిన్నటి దృశ్యమే నా కళ్ళ ముందు మెదుల్తోంది. నా ఒళ్ళు చల్లబడిపోతోంది."

"పూర్ లల్లీ! ఏదో చూసి ఏదో అనుకుని భయపడి పోయావంతే! ఇక్కడ అలాంటి భయంకర వ్యక్తులెవరూ

లేరు. అలా అయితే యిన్ని వందలమంది రోజూ వచ్చి ఆనందించి వెళ్తారా? ఒక్కొక్కరయితే నెలల తరబడి వుండిపోతారు. మనం వేసుకున్న ఏడు రోజుల మజిలీ నాలుగు రోజులకు తగ్గిపోయింది. ఈ నాలుగు రోజులు కూడా ఏవీ చూడకపోతే ఎట్లా?"

లలిత మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తూ అలాగే కూచుండిపోయింది.

"హల్లో, మే ఐ కమిన్!" అంటూ డాక్టరు గుమ్మం దగ్గర నించుని నవ్వుతూ అన్నాడు.

"రండి సార్! నేనే మీ దగ్గరికొద్దామనుకుంటు న్నాను" అన్నాడు తిలక్.

డాక్టరుని చూసి లేచి నించుంది లలిత.

"మీవారు నీకోసం నిన్న రాత్రి పడ్డ ఆందోళన యింతా అంతా కాదమ్మా! నన్ను కంగారుపెట్టేసి తను కంగారుపడిపోయి ఎంత హడావిడి చేశాడనుకున్నావు?" అన్నాడాయన అదే నవ్వుతో.

లలిత సిగ్గుగా, ప్రేమగా చూసుకుంది భర్తని. తనంటే భర్తకు ప్రాణమని ఆమెకు తెలుసు. తనకైతే భర్తే ఊపిరి! ఆ సంగతి అతనికీ తెలుసు. ఆ ఆత్మీయతే ఆ మధురానుబంధమే ఆమె మనసులో కోటి కాంతులు విరజిమ్ముతుంది. తనంత అదృష్టవంతురాలు లేదని పొంగి పోతుంది.

తిలక్ డాక్టరుతో లలిత భయపడ్డ విషయం చెపుదా మనుకుని మళ్ళీ అంతలోనే విరమించుకున్నాడు. చిన్న విషయానికి ప్రాధాన్యతనిచ్చి లలిత మనోగత స్థితిని మరింత బలహీనపరచటమే అవుతుందని అభిప్రాయ

పడ్డాడు.

అయిదు నిమిషాలు కూచుని డాక్టరు వెళ్ళిపోయాడు.

## 4

"హల్లో, లలితా? వాట్ ఏ సర్‌ప్రయిజ్?" అంటున్న వ్యక్తివంక విస్మయంగా చూసింది లలిత. అతనెవరో వెంటనే గుర్తురాలేదు. అతను చిన్నబుచ్చుకున్నాడు.

లలితకి గుర్తొచ్చింది. అతను మహేష్. ఆమె క్లాస్‌మేటు.

"ఓ, మహేష్ నువ్వా?" అన్నదామె. "బాగా లావయ్యావు. అందుకే వెంటనే గుర్తుపట్టలేకపోయాను."

"నిన్ను గుర్తుపట్టాను. చదువుకునే రోజులకన్న చాలా అందంగా, అద్భుతంగా ఉన్నావు!" అన్నాడు మహేష్.

లలితకి అతనలా మాట్లాడటం కోపం తెప్పించింది. పక్కన తిలక్ వున్నాడు. బెరుగ్గా చూసింది భర్తవంక. అతనా విషయాన్ని పట్టించుకున్నట్టే లేదు.

"వీరు మావారు, ఇంజనీర్!" అన్నది లలిత తిలక్‌ని పరిచయం చేస్తూ.

"ఓహో, పెళ్ళిచేసుకున్నావన్నమాట!" అన్నాడు మహేష్ పొడిపొడిగా. ఒకే కాలేజిలో చదువుకున్న కారణంగా మహేష్ గుర్తున్నాడు తిలక్‌కి. ఇంటర్ వరకు కలిసే చదువుకున్నారంతా. తర్వాత తను యింజనీరింగ్ కోర్సుకి వెళ్ళిపోయాడు. ఇతను డిగ్రీ చదివి నట్టున్నాడు లలితతోబాటు.

"నేను యీ పక్కనే కాలేజిలోనే దిగాను. ఒంటరి వాణ్ని! పెళ్ళి చేసుకోవాలనిపించలేదు" మహేష్ నవ్వుతూ లలితవంక అదోలా చూశాడు.

లలితకి అతని ప్రవర్తన జుగుప్సాకరంగా వుంది.

పక్కన భర్త వుండగా అతన్ని అలా కల్సుకొన్నందుకు ఆమెకి బాగా అనిపించలేదు.

"వస్తాం!" అంటూ సంభాషణ తుంచేసి భర్తతో వెళ్ళిపోయింది లలిత.

మహేష్ వున్నచోటనే నుంచుని తమ వంక పరీక్షగా చూస్తూ వుండిపోవటం తిలక్ దృష్టినుంచి దాటిపోలేదు.

## 5

"ఈ రోజైనా కొండ దిగకుండా యిక్కడ్నుంచే ఏవో రెండు స్నాప్స్ తీసెయ్యండి మహానుభావా!" అన్నది లలిత. తిలక్ కెమెరా పొజిషన్ చూసుకుంటున్నాడు.

లలిత ఎత్తుగా వున్న బండరాయిమీద కూచుంది. తిలక్ ఏటవాలుగా ఉన్న ప్రదేశానికి యివతలగా నించుని చూస్తున్నాడు కెమెరా లెన్స్‌లోనుంచి.

భర్త భుజాలమీదుగా వెనక్కి చూసిన లలిత ఉలిక్కిపడింది. చెమట్లు పోశాయి. సన్నగా వణుకు ప్రారంభమయింది. వెన్నున జరజర ఏదో పాకినట్టయింది.

అతను ....అతను....చింపాంజీ ముఖం, నల్లని రూపం, బవిరి గడ్డం!....సందేహంలేదు నిన్న సాయంత్రం కొండ దిగువన చూసిన వ్యక్తే! తన వంకనే పరీక్షగా చూస్తున్నాడు. నవ్వుతున్నాడు. అదే నవ్వు, గుండెల్ని పీల్చేసే నవ్వు.

లలిత కెమెరావంక చూడటంలేదని గమనించిన తిలక్ ఆమెను హెచ్చరించాడు.

లలిత మాట్లాడలేదు! బవిరిగడ్డంవాడు జేబునుండి రివాల్వర్ తీశాడు. సరిగ్గా తిలక్‌కి గురిపెట్టాడు. లలిత కెవ్వున అరిచింది. చటుక్కున రాతిమీదినుంచి లేచి

భర్త దగ్గరకు పరుగెత్తింది.

"ఏమిటి లల్లీ, ఏమయింది?" తనని వాటేసుకున్న లలితను పొదివి పట్టుకున్నాడు తిలక్ — కళ్ళతోనే పక్కకు చూపించింది లలిత.

తిలక్ వెనక్కు చూశాడు.

అక్కడ ఏమీ కనిపించలేదు!

"ఏమిటి లల్లీ, ఎందుకంతగా భయపడిపోతున్నావు! ఏమయింది?" అన్నాడు ఆమె వెన్ను నిమురుతూ.

లలిత భర్త భుజాలమీదినుంచి చూసింది.

బవిరిగడ్డంవాడు లేడు! తిలక్‌ని వదిలిపెట్టి గబగబ అటు యిటు కళ్ళతో వెతికింది. అతను లేడు!

"ఏమిటి లల్లీ, ఏమిటి వెతుకుతున్నావు?"

"నిన్న చెప్పానే, చింపాంజీ ముఖంవాడు - మీకు రివాల్వర్ గురిపెట్టి మీ వెనకనే నించున్నాడింతసేపు. నేను అరిచి మీ దగ్గరకు పరుగెత్తుకు రాగానే ఎటో మాయమయిపోయాడు."

"ఏమిటి, నాకు రివాల్వర్ గురిపెట్టాడా?"

"అవునండీ! అది చూసి నా నోట మాటరాలేదు. మీకు చెప్పాలనుకున్నానుగాని ఏమిటో అంతా అయోమయమైపోయింది. అందుకే పరుగెత్తుకొచ్చి మిమ్మల్ని పట్టుకున్నాను."

"మరివాడు కాల్చలేదేం?"

"అదే నాకూ విచిత్రంగా వుంది. వాడు నిజంగా కాల్చాలనుకుంటే ఒక్క క్షణం చాలు! నేను మిమ్మల్ని అడుకునేలోపల తన పని పూర్తిచేసుందేవాడు. మరెందుకు పారిపోయాడో అర్థంకాలేదు."

తిలక్ ఆమెవంక జాలిగా చూశాడు.

"లలీ, నీ మనసెందుకు నిన్నటినుంచి పాడయింది. ఏం చూసినా, యెవర్ని చూసినా నీ మనసులో అదే భయంకరరూపం పాతుకుని పోయింది. అసలు యీ చుట్టుపక్కల మనిషన్నవాడే లేడు!"

"అయితే నాది ఉత్త భ్రమేనంటారా?" ఉక్రోషం ధ్వనించింది లలిత కంఠంలో.

తిలక్ వెంటనే మాట్లాడలేదు. లలిత కళ్ళలో నీళ్ళు తిరిగాయి. తుడుచుకునే ప్రయత్నం చెయ్యకుండా ఎటో శూన్యంలోకి చూస్తోంది.

## 6

రూంకి తిరిగొచ్చేసరికి తాళంపెట్టి తిప్పే రంధ్రంలో గుచ్చి ఏదో చీటీ వుంది.

తీసి చదివాడు తిలక్.

"లలితా! రెండు సార్లు వచ్చి వెళ్ళాను. మీరింకా తిరిగి రాలేదనుకుంటాను. కాసేపు సరదాగా కబుర్లు చెప్పుకోవచ్చనుకున్న నా ఆశ నిరాశయింది. —మహేష్!" అని

వున్నది అందులో.

లలిత చీటీ చదివింది. ఆమె ముఖం కందగడ్డలా అయింది. మహేష్ అతి చొరవకు ఒళ్ళు మండుకొచ్చింది.

తిలక్ ఆ విషయాన్ని పట్టించుకున్నట్టులేదు!

ఆమె మంచంమీద కూచోబోతూ ఎందుకో చటుక్కున కిటికీవైపు చూసింది. అంతే, ఆమె చూపులు కిటికీకే అతుక్కుపోయాయి.

అక్కడ బవిరిగడ్డంవాడు నించుని ఆమె వంకనే చూస్తున్నాడు. అదే నవ్వు.

"ఏమండీ, అదుగో వాడే!" అన్నది లలిత వెంటనే కిటికీవైపు చూపించి.

తిలక్ చటుక్కున కిటికీవైపు చూశాడు. కిటికీలో నించి చూస్తున్న మహేష్ కనిపించాడు.

"ఓ, మహేషా?" అన్నాడు తిలక్.

లలిత ఉలిక్కిపడి చూసింది. అక్కడెవరూ లేరు!

"మహేష్ అంటారేమిటి?" అన్నది మెల్లగా.

"కిటికీలో నుంచి మహేష్ చూస్తున్నాడుగా!" అన్నాడు తిలక్ కంఠంలో ఎలాంటి భావమూ ప్రకటితం కాకుండా.

"అబ్బె, మహేష్ కాదు - నేను చెప్పిన బవిరిగడ్డం వాడు కిటికీలోంచి చూస్తూ కనిపించాడు."

తిలక్ కిటికీవైపు చూశాడు. మహేష్ లేడీసారి. ఎవరూ లేరక్కడ!

"లల్లీ, నీకెందుకో బాగా భయం పట్టుకున్నది! ఎవర్ని చూసినా ఏం చూసినా నీకు ఆ భయంలో నువ్వూహించుకుంటున్న రూపమే కనిపిస్తోంది. అవునా?"

నిస్సహాయంగా చూసింది లలిత.

"అయితే మీరు నన్ను నమ్మటంలేదా?"

"నిన్ను నమ్ముతున్నాను, ఎప్పటికీ నమ్ముతాను. కాని నీ నమ్మకాలమీదే నమ్మకం కుదరటంలేదు!"

"ఏమిటో మీ మాటల గారడీ నాకర్థం కావటం లేదు. నా కంతా అయోమయంగా వుంది. పిచ్చెత్తినట్టుంది!" ఆమె తల రెండు చేతుల్లోనూ పట్టుకుని కణతలు నొక్కుకుంటోంది.

"భోంచేశారా?" అంటున్న మాటలతో యిద్దరు చటుక్కున గుమ్మంవైపు చూశారు. డాక్టరు!

"రండి సార్! ఇంకా చెయ్యలేదు. ఇప్పటివరకు బయట తిరిగొచ్చాం" అన్నాడు తిలక్.

డాక్టరు వెనక్కి వెళ్ళిపోయాడు.

"ఫరవాలేదు, రండి! అప్పుడే ఆకలి కావటంలేదు" అన్నాడు తిలక్.

డాక్టరు వచ్చి ఫేం కుర్చీలో కూచున్నాడు.

తిలక్ ఆయనతో లలిత విషయం ప్రస్తావించనా వద్దా అని ఆలోచిస్తున్నాడు. లలిత మనసులో బాధ పెట్టుకుంటుందేమోనని సంకోచిస్తున్నాడు.

"మీరు ఒక్కరే వచ్చారా సార్ హిల్స్ కి!" అన్నాడు తిలక్ డాక్టరుతో.

"అవునండీ! నాకు వెనకముందు ఎవరూ లేరు."

"అదేమిటి సార్ .... భార్య, పిల్లలు ..."

"ఒక ఏక్సిడెంట్ లో నా భార్య యిద్దరు పిల్లలు పోయారు. అప్పట్నుంచీ ఒంటరివాడినై పోయాను. మళ్ళీ సంసార జీవితమంటే నే విరక్తి పుట్టిపోయింది. అందుకే నేనొక్కడినే అప్పుడప్పుడు యీ హిల్స్ కి, యింకా దేశంలోని విహారస్థలాలకి పోయి వస్తూంటాను."

"అరరె.... ఎంత పని జరిగింది?"

"విచిత్రమేమిటంటే నా భార్యా పిల్లలు పోయినది యెక్కడో కాదు - యీ హిల్స్ మీదే!"

వింటున్న యిద్దరు ఉలిక్కిపడి చూశారు.

"ఈ హిల్స్ మీదా? అదెలా?"

"ఓసారి ఇలాగే సరదాగా పిక్నిక్ వేసుకుని నాలుగు రోజులుండి వెళ్ళిపోతున్నాం కారులో. ఘాట్ రోడ్ మలుపు దగ్గర కారు స్లిప్ అయింది. అంతే, కిందనున్న లోయలోకి పడిపోయింది కారు. నా భార్యాబిడ్డలు

స్పాట్ లోనే పోయారు. నన్ను హాస్పిటల్లో చేర్చారు. నా కాళ్ళు రెండూ ఫ్రాక్చరయ్యాయి. ఇదిగో చూడండి!" లుంగీ మోకాళ్ళదాకా లాక్కొని చూపించాడు డాక్టరు.

ఆపరేషను గాయాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"అందుకే వారానికోసారైనా యీ హిల్స్ కి వచ్చి పోతుంటాను. ఇక్కడ తిరుగుతుంటే నా వాళ్ళు యీ పరిసరాల్లో నాతో తిరుగుతున్నట్టే అనుభూతి కలుగుతుంది! వాళ్ళ ఆత్మలు యిక్కడే సంచరిస్తూ వుండొచ్చునని నా గాఢ నమ్మకం!"

"మీరు డాక్టరై వుండి సెంటిమెంట్సు నమ్ముతారా?"

"సెంటిమెంట్సుని తీసిపారెయ్యకండి. ఆత్మకు చావు లేదు. అది మరో కొత్త శరీరాన్ని అలా వెతుక్కుంటూనే వుంటుంది. గీతలో భగవానుడేం చెప్పాడు? ఆత్మను శస్త్రం ఛేధింపలేదు, నీరు తడపలేదు, అగ్ని కాల్చలేదు- అని కదూ! ఈ సైంటిఫిక్ యుగంలో కూడా అది నిజమని రుజువయింది. ఆత్మలతో మాట్లాడే ప్రక్రియ కూడా పరిశోధనలవల్ల సంభవమని నిర్ధారణ చేశారు."

తిలక్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. లలిత మానసిక పరివర్తనకు కారణం డాక్టరు చెప్తున్న ఆత్మ - అదే స్పిరిట్ - ప్రభావం కాదుగదా! ఆ బవిరిగడ్డం వ్యక్తి యిదివరలో యీ ప్రాంతాల అకస్మాత్తుగా చనిపోయి స్పిరిటుగా తిరుగుతున్నాడేమో!

"ఏమిటి వున్నట్టుండి పరధ్యానంగా అయిపోయారు?"

"అబ్బె, మీరంటున్న సంగతులే ఆలోచిస్తున్నాను."

"ఇంకో చిత్రం చెప్పనా? ఏదోక రాత్రి సమయంలో నేను పడుకున్న గదిలో నా భార్య కనిపించి యేవో ఆడుగుతుంది. నే నేదో చెప్తాను. స్పష్టత వుండదుకాని

మొత్తానికి నా భార్య తప్పనిసరిగా కనిపించితీరుతుంది!"

"కల్లోనా?"

"నో, నో! అది కల, వాస్తవం కాని ద్వంద్వప్రకృతి. నేను మెలకువలోనే వున్నట్టు అనిపిస్తుంది నాకు! కాని ఆ కాసేపు ట్రాన్స్‌లో వున్నట్టుంటాను. నా మెదడు యెవరి ఆజ్ఞలకో బద్ధమై నడుస్తుంది. నేను నిద్రలో నడుస్తున్నట్టు గదిలో అటు యిటు తిరుగుతుంటాను. కాసేపటి తర్వాత యేమీ కనిపించదు. నేను పూర్తిగా మెలకువలోకి వచ్చేస్తాను. మరి యిదంతా ఏమిటి? సెంటిమెంటని తీసిపారెయ్యమంటారా?"

లలిత కళ్ళు పెద్దవి చేసుకుని వింటోంది.

నిజంగానే మన చుట్టూ చనిపోయినవారి ఆత్మలు తిరుగాడుతుంటాయా?....ఏమో

"సరే రాత్రి బాగా పొద్దుపోయింది. భోంచెయ్యండి" అంటూ డాక్టరు లేచాడు. లలితవంక తిరిగి "ఏమ్మా, ఖులాసాయే కదా!" అన్నాడు.

"ఖులాసానే డాక్టరుగారూ!" అన్నది.

డాక్టరు ఆమెవంక నవ్వుతూ చూసి, "మీ యిద్దరికీ ఓ శుభవార్త చెపుతాను. అయితే యిప్పుడు కాదు. నేను యిక్కడ్నుంచి తిరిగి హైదరాబాదు వెళ్ళిపోయే ముందు చెప్తాను. అంతదాకా సస్పెన్స్!" అన్నాడు.

ధంపతులిద్దరు ఆశ్చర్యంగా చూశారు.

"ఏమిటి సార్ అది? ఇప్పుడే చెప్పెయ్యరాదూ!?" అన్నాడు తిలక్. అతనప్పుడే అదేమైవుంటుందా అని మెదడుకు పని చెపుతున్నాడు.

"నేనింకో రెండు రోజులుంటాను హిల్స్‌మీద!

రెండు రోజుల తర్వాత చెప్తాను! తప్పక చెప్పేవెళ్తాను" అంటూ గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయాడు డాక్టరు.

## 7

కొద్దిక్షణాలు గదిలో నిశ్శబ్దం రాజ్యమేలింది.

బాయ్‌కి బిల్సు చెప్పటానికి గుమ్మందాకా వచ్చాడు తిలక్. సరిగ్గా అదే సమయంలో పక్కగదిలోని అమ్మాయి తలుపు తెరుచుకుని బయిటికొచ్చింది.

తిలక్‌ని చూడగానే "హాయ్, బావా!" అన్నది గట్టిగా అరుస్తున్నట్టు.

తిలక్ ఉలిక్కిపడి చూశాడు. తన మామయ్య కూతురు నళిని!

"ఓ నువ్వా? యేమిటిలా వచ్చావు? ఒక్కతెవే వచ్చావా, మీ ఆయనతో వచ్చావా?"

నళిని ఫక్కున నవ్వింది. తెల్లటి దానిమ్మగింజల్లాంటి పలువరస తళుక్కుమన్నది.

"మా ఆయన పిచ్చిమాలోకం! ఇలాంటి పిక్నిక్‌లన్నా జాలీ ట్రిప్స్ అన్నా అతనికి నచ్చవు. ఎంతసేపూ వ్యాపారం, డబ్బు సంపాదన-అదే లోకం! నేనొక్కతినే వచ్చాను సరదాగా నాలుగురోజులుండి పోదామని! నువ్వు ఒక్కడివే వచ్చావా?"

ఈ లోపల లలిత గుమ్మం దగ్గరకొచ్చింది.

తిలక్ వెంటనే నళినితో, "నా భార్య లలిత!" అంటూ పరిచయం చేశాడు. నళిని కళ్ళలో అసూయ స్పష్టంగా తొంగిచూసింది.

"నమస్కారమండీ! మా బావవంటి మంచి బాలుడ్ని భర్తగా పొందగలిగిన మీరు అదృష్టవంతులు!" అన్నది నళిని నఖశిఖపర్యంతం లలితను పరీక్షగా చూస్తూ.

లలిత నవ్వి వూరుకుంది.

"కాస్త కంపెనీ యివ్వకూడదా బావా బోర్ కొట్టి చచ్చిపోతున్నాను!" అన్నది నళిని తిలక్ కళ్ళలోకి చూసి నవ్వుతూ. లలితకి ఆ నవ్వు చూస్తే ఒంటికి కారం రాసుకున్నట్టుంది.

"అదెలా? మరి యిద్దరం వున్నాం కదా!"

"నిన్నొక్కడ్ని కాదయ్యా మహానుభావా, యిద్దర్నీ కలిసే కంపెనీ యిమ్మంటున్నాను!"

తిలక్ వెర్రి నవ్వు నవ్వేసి, "ఓ, అలాగే! రేపుదయం నించి అందరం కలిసి తిరుగుదాం యీ హిల్స్ అంతా!" అన్నాడు.

"ఓ.కే! గుడ్ నైట్! నా పక్కనే మీరు దిగిన సంగతి యిప్పటిదాకా తెలీదు."

"నువ్వు మా పక్కన దిగినట్టు మాకూ యీ క్షణం దాకా తెలీదు."

"నాలుగు రోజులుంటారా?"

"ఉందామనే వచ్చాం!"

"తప్పకుండా ఉండండి, నేనూ వుంటున్నాను."

ఈలోపల బాయ్ కేరియర్‌తో వచ్చాడు.

తలుపులు మూసి బోల్టుపెట్టి ఆనక భర్తతో జగడం వేసుకుంది లలిత.

"ఏమిటీ, మీరొక్కరూ వచ్చివుంటే మీ మరదలు పిల్లకి మంచి కంపెనీ యిచ్చి వుండేవారా? యెంత ధైర్యం!" అంటూ విరుచుకు పడిపోయింది.

"అ, అహా, నా ఉద్దేశం అదికాదు లల్లీ! ఏదో తప్పించుకోవటానికి తొందర్లో ఏదో అనేశాను. ఒంటరిగా వుంటే మాత్రం పెళ్ళయిన అమ్మాయికి కంపెనీ

యిస్తానా?"

"పెళ్లి కాని అమ్మాయిలకి యిస్తున్నారా?"

"ఛ! ఛ! బొత్తిగా అపార్థం చేసేసుకుంటున్నావు లల్లీ! నా సంగతి నీకు తెలియదూ?"

"ఎందుకు తెలీదూ? ఇలాంటి పైలాపచ్చీసులాగా తిరిగే మరదలు మీకుందని నాకెప్పుడూ చెప్పలేదేం!?"

"సందర్భం రాలేదు, చెప్పలేదు, అంతే! మరేం లేదు."

"రేపట్నుంచి ఆమెగారితో యీ కొండలమీద విహారయాత్ర చేస్తారా? మీకెన్ని గుండెలు?"

"నే నొక్కడ్నీ కాదు లల్లీ! నీతో కలిసి – ముగ్గురం తిరగొచ్చని నా అభిప్రాయం. అడిగిందని ఏదో మర్యాదకి అలా అన్నాను, మరేం లేదు."

"అంతే, మరేం లేదు!" ధర్రని అనుకరిస్తూ అని పొట్టలో చూపుడు వేలుతో పొడిచింది.

"అమ్మో, యిదేమిటి?" అన్నాడు భయం నటిస్తూ తిలక్.

"జాగ్రత్త! నన్ను కాదని మరో ఆడదానివైపు కన్నెత్తిచూసినా నేనూరుకోను! మిమ్మల్ని ఏంచెయ్యను-దాన్ని పీకపిసికి చంపేస్తాను."

"అదేమిటి అన్యాయం? అదేం చేసింది."

"మీకేసి చూడటమే దాని నేరం! అదెవరైనా కానీండి, సాక్షాత్తు మీ మరదలే కానివ్వండి - నా రూలు రూలే!"

"ఇదెక్కడి రూలురా బాబూ! నువ్వు 'లా' చదవాల్సింది తప్పి జారి సైన్సు చదివావు. ఇప్పుడైనా ఫర్లేదు, ప్రయివేటుగా లా చదవొచ్చు."

"ఏమిటా కేకాకోకాలు? మీ మగాళ్ళ మనసులు

చదవటానికి 'లా'తో పనిలేదు. ఏ మాత్రం కామన్ సెన్సున్నా చాలు, అర్థం చేసుకోవచ్చు! మీరు తిన్నగా వుంటానంటేనే యిక్కడ వుండేది! లేకుంటే తెల్లవార గానే హైదరాబాద్ రిటన్ జర్నీ?"

"నన్ను ఘోరంగా అనుమానించి అవమానించకు లలీ! నేను గంగిగోవులాంటివాణ్ని!"

"అదేమిటి కూరలో పెరుగు వేసేసుకుంటున్నారు?"

"ఆఁ, అవా, కంగారులో కూర అన్నం తినేశాననుకున్నాను, మరేం లేదు!"

లలిత పడిపడి నవ్వింది. తిలక్ శ్రుతి కలిపాడు.

# 8

ఉదయం స్నానాదికాలు అయాక తిలక్ అన్నాడు.

"ఈ రోజు కొండ చివరనున్న వేలీకి బస్ వెళ్తోంది. మనం కూడా వెళదామా?" అని.

"అబ్బ, అక్కడినుంచి కాఫీ తోటలు, లోయలు చాలా అందంగా కనిపిస్తాయట కదూ!"

"ఆఁ, అందుకే వెళ్దామా అంటున్నాను. ఇంకా యీ పక్కన రెండు మూడు కొండలున్నాయి కదూ! అవన్నీ బస్ మీదినుంచి చూడటానికి చాలా అందంగా వుంటాయట! మనం యిదే మొదటిసారి కదా యిక్కడికి రావటం! అన్నీ చూద్దాం."

"అలాగే పదండి."

"ఉండు, టిక్కెట్లు ముందుగా రిజర్వు చేసుకోవాలిట. తీసుకుని వస్తాను" తిలక్ బయటికెళ్ళాడు.

లలిత తలుపులు దగ్గరగా మూసి వచ్చి ఫేం కుర్చీలో కూచున్నది.

తలుపులు తోసుకొని లోపలికొచ్చిన వ్యక్తిని చూడ

గా నే కన్నెన అరవబోయింది.

అతని చేతిలో కత్తి వుంది. "అరిచావంటే చంపే స్తాను, జాగ్రత్త!" అన్నాడు.

అతను అన్నంత పనీ చేసేలా వున్నాడు.

"ఎవరు నువ్వు? ఎందుకు నా వెంటపడి వేధించుకు తింటున్నావు? వెళ్ళిపో!" కళ్ళు మూసుకుని అరచేతుల్లో ముఖం దాచుకుంది లలిత.

బవిరిగడ్డం మనిషి వినపడకుండా వికృతంగా నవ్వాడు.

"నీకోసమే! నీ అందాన్ని చూసి పిచ్చివాడినై వెంట పడ్తున్నాను. ఒక్కసారి నువ్వు నాకు కావాలి. తర్వాత నా దారిన నేను పోతాను."

"ఛీ, పాపాత్ముడా! ఆ మాటనటానికి నీకెంత ధైర్యం? మావారు రానియ్యి, నిన్నేం చేయిస్తానో!"

"మీవారా?" అతను పడిపడి పొట్ట పట్టుకుని మరీ నవ్వాడు. "మీవారు శ్రీరామచంద్రుడనుకుంటున్నావు. గోపాలకృష్ణుడు! నువ్వెన్నో దానివో! పక్కనే ఓ అమ్మాయిని తెచ్చిపెట్టుకున్నాడు. రాత్రిళ్ళు నువ్వు నిద్రపోయాక ఆ పిల్లతో నే గడుపుతున్నాడు."

"అబద్ధం! నువ్వేదో కట్టుకథ చెప్తున్నావు. వెంటనే యిక్కడ్నించి వెళ్ళిపో! ఆయన గురించి నువ్వు కాదు గదా, ఆ భగవంతుడే దిగివచ్చి చెప్పినా నేను నమ్మను?"

"అంత అమాయకురాలివి కాబట్టే నిన్ను అంత తేలిగ్గా వంచన చెయ్యగలుగుతున్నాడు! అతని సరదాలు అతను తీర్చుకోగా లేనిది, నువ్వు నీ సరదాలు తీర్చుకో కూడదా?"

"ఛీ. నువ్వు వెంటనే పోతావా, పోవా?"

"నువ్వు నా కోరిక తీర్చావా సరే, లేకపోతే ఎంతో

అపురూపంగా చూసుకుంటున్న నీ భర్త యీ లోయల్లో శాశ్వతంగా నిద్రపోతాడు, జాగ్రత్త!" తలుపులు తెరుచుకుని చటుక్కున మాయమయ్యాడు గడ్డంవాడు.

లలిత ఒక్క పరుగున వెళ్ళి తలుపులకి బోల్టు వేసి వచ్చి మంచంమీద అడ్డంగా పడిపోయింది. ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. భయంతో నాలుక పొడారిపోయింది!

ఎవడీ గడ్డంవాడు? ఎందుకు తననిలా వేధిస్తున్నాడో? వాడి ముఖం చూస్తే మూడురోజులదాకా అన్నం సయించదు. తనకి వచ్చినప్పట్నుంచీ అన్నం తినాలనే అనిపించటంలేదు. వీడ్ని చూశాక మరీను!

వాడెంత దుర్మార్గుడు? అన్నెం పున్నెం ఎరగని తన భర్తమీద అభాండాలువేసి తన మనసు విరిచెయ్యాలని ప్రయత్నిస్తున్నాడు! ఇలాంటి వాళ్ళు కోటిమంది కలిసి తన చెవి దగ్గర హోరెత్తించినా దైవంకన్న మిన్నగా తను కొలిచే తిలక్‌ని అనుమానించగలదా? తన బొందిలో ప్రాణముండగా అది జరగదు!

తలుపు చప్పుడైంది. "ఎవరు?" అనడిగింది గుండె చిక్కబట్టుకుని.

తిలక్ కంఠం "నేనే లల్లీ!" అని వినిపించింది.

ఆమె లేచివెళ్ళి తలుపు తీసింది.

"ఈ రోజుకి సీట్లు లేవు. రేపటికి తీసుకున్నాను" అన్నాడు తిలక్ టిక్కెట్లు ఆమెచేతికందిస్తూ.

"ఏమండీ, మనం యీ రోజే హైదరాబాదు వెళ్ళిపోదాం!" అన్నది ఆకస్మాత్తుగా లలిత.

అతను విస్తుపోయి చూసి, "అదేమిటి? నాలుగు రోజులుందామనుకున్నాం కదా! .... ఓ, నీ అనుమానం

అరమయింది!" అన్నాడు యేదో గుర్తొచ్చినట్టు.

"ఏమిటి?"

"అదే, మా మరదలు పక్కన దిగిందని కదూ నీ అనుమానం!"

"ఛ, ఛ. అదేం కాదండి. నాకే ఎందుకో ఇక్కడ వుండాలనిపించటంలేదు. వెళ్ళిపోదామండీ!"

"రేపు ఆ పేలీస్ చూసి వెళ్ళిపోదాంలే!"

"వద్దు, యీ రోజే వెళ్ళిపోదాం!"

తిలక్ భార్యవంక దీక్షగా చూసి, "ఇంత సడన్ గా ప్రోగ్రాం మార్చేశావేం? అయినా హైదరాబాదుపోయే బస్సు ఉదయం ఏడుగంటలకే వెళ్ళిపోతుంది. ఇప్పుడు ఎనిమిదిన్నరయింది. ఇక రేపే" అన్నాడు.

లలిత నిస్సహాయంగా చూసిందతనివంక.

"ఏమిటి లల్లీ, ఇక్కడికి వచ్చినప్పట్నించీ అదోకలా వున్నావు. సరదాగా నాలుగురోజులు ఎంజాయ్ చేద్దామని వచ్చి ఇలా నిస్సారంగా నీరసంగా అయిపోయావేమిటి?"

లలిత యిక ఆపుకోలేక ఏడ్చేసింది.

"మళ్ళీ ఆ బవిరిగడ్డంవాడు కనిపించాడండీ! ఇక్కడికొచ్చి బెదిరించాడు. మిమ్మల్ని చంపుతానని కూడా ఏదేదో వాగిపోయాడు!"

తిలక్ విస్తుపోయి చూశాడు.

తను యిన్నిసార్లు బయట తిరిగివస్తున్నాడు. కాని ఒక్కసారికూడా లలిత చెప్పినటువంటి వ్యక్తులుగాని, కనీసం గూండాల లిస్టులోకి వచ్చే లక్షణాలున్నవాళ్ళుగాని ఎక్కడా తారసపడలేదు. మరి లలితకు మాత్రమే కనిపించటమేమిటి? లలితకు డాక్టరు చెప్పినటువంటి స్పిరిట్ ఏదైనా....తన ఆలోచనకి తనే ఉలిక్కిపడ్డాడు.

నో, అలాంటిదేం కాదు. లలిత మరీ అంత చిన్నపిల్ల కాదు - అలాంటి స్పిరిట్ చిన్నవాళ్ళని. బలహీన మన స్తత్వం వున్నవాళ్ళని తేలిగ్గా ఆవహిస్తాయంటారు. లలిత బలహీనురాలు కూడా కాదు!

"సరే, ఉదయమే వెళ్ళిపోదాం!" అన్నాడు ఓ నిర్ణయానికి వచ్చినట్టు. లలిత ముఖంలో కళ వచ్చింది.

"ఈ సాయంత్రం బయట యెక్కడా తిరగొద్దు. ఉదయం తెల్లవార్తూనే యిట్నుంచి యిటే యీంనించి వెళ్ళిపోదాం" అన్నదామె. తిలక్ తలూపాడు.

## 9

గుమ్మం దగ్గర యేదో అలికిడి వినిపించింది. తిలక్ చప్పుడు చెయ్యకుండా తలుపు బోల్టుతీసి, భళ్ళున తలుపులు తెరిచాడు.

అప్పటిదాకా తలుపులకి చెవి ఆనించుని వింటున్న వ్యక్తి తెల్లబోయి చేష్టలుడిగి అలాగే వుండిపోయాడు. అతను మహేష్!

"అరె, నేను తలుపు తట్టబోతుండగా మీరే తెరిచారే! హల్లో లలితా హౌ ఆర్యూ?" అంటూ స్వతంత్రంగా గదిలోపలికి వచ్చేశాడు మహేష్.

తిలక్ అతనివంకే పరీక్షగా చూస్తున్నాడు. మరీ సంస్కార హీనంగా ప్రవర్తించే అలాంటి వ్యక్తులపట్ల ఏ మాత్రం సదభిప్రాయం లేదతనికి!

లలిత మొహం చిట్లించింది.

"సారీ లలితా, మిమ్మల్ని మంచి మూడ్‌లో చెడగొట్టి వుంటాను!" వెకిలిగా నవ్వాడతను.

"ఏమిటి, నాతో నువ్వు మాట్లాడవలసినది? మేమున్నపుడు వస్తే సరిపోతుందిగా, చీటీలు పెట్టిపోవటం దేని

అంత అర్జంటు పనులేమున్నాయి మాతో?" చిరాగ్గా చూస్తూ అన్నది లలిత.

తిలక్ గది బయటకు వెళ్ళబోతుంటే "ఏమండీ, మిమ్మల్నే" అంటూ వెనక్కి పిలిచింది.

తిలక్ వెనుతిరిగి ప్రశ్నార్థకంగా చూశాడు.

"మనం వేలీ దగ్గరకు నడిచి వెళ్దామన్నారు కదా, వుండండి నేనూ వస్తున్నాను" అంటూ చకచక లేచి తల సర్దుకుని టేబిల్ మీదున్న రూం కీ అందుకుంది.

"ఇదేమిటి, అతిథిని సత్కరించకుండా కనీసం నేననే వాణ్ని యిక్కడున్నానన్న సంగతే మరిచి మీరిద్దరు బయటకి వెళ్ళిపోవటం అన్యాయం, అక్రమం!" అన్నాడు మహేష్ మొహం మాడ్చుకుని.

"సారీ, మళ్ళీ ఎండెక్కిపోతే కష్టం. తీరిగ్గా కబుర్లు చెప్పుకునేటంత వ్యవధి లేదు!" అంటూ గది బయటికి వచ్చేసింది లలిత.

విసురుగా లేచి బయటికి వెళ్ళిపోయాడు మహేష్.

గదికి తాళం పెట్టి రోడ్ మీదికొచ్చాక, "అదేమిటి సడన్‌గా ఈ వేలీకి ప్రోగ్రాం పెట్టేశావేమిటి? అసలు బయటికే వెళ్ళొద్దన్నావు!?" అన్నాడు తిలక్ నవ్వుతూ భార్యవంక చూసి.

"లేకపోతే, జిడ్డులా వదలటంలేదా మనిషి! కనీసం సంస్కారమైనా లేని అలాంటి రోగ్‌తో మనకి కబుర్లేమిటి?" అన్నదామె.

"మనం ఏం మాట్లాడుకుంటున్నదీ తలుపు అవతల నిలబడి వింటున్నాడు! అందుకే అనుమానం వచ్చి తలుపు తీశాను. దొరికిపోయాడు."

"వాడిదివరలో కాలేజిలో ఒకటి రెండుసార్లు నన్ను

అల్లరి పెట్టబోయాడు. ఓసారి చెప్పుతో కొట్టాను."

"తర్వాత మళ్ళీ నీ వెంట పడలేదా?"

"నన్ను చూస్తేనే ఆమడదూరం పారిపోయేవాడు!"

"మరిప్పుడు ఏ మొహం పెట్టుకుని పలకరిస్తున్నాడు?"

"మీ ముందు తనకి నాతో ఎంతో పరిచయమున్నట్టు క్రియేట్ చేయటానికి తంటాలు పడుతున్నాడు!"

"గమనించాను. మరొకడైతే యిలాంటివాడి చర్యలకు భార్యని కూడా అనుమానించటానికి వెనుదియ్యడు. అలా వుంది వాడి ప్రవర్తన."

"అవును, అదే వాడి దురాశ కూడా!"

"క్వివిట్! ఎక్కడికి పోదాం?" అన్నాడు తిలక్.

"వాడినుంచి తప్పించుకోవటానికి సమయానుకూలంగా అలా అనేశాను. రూంకి వెళ్ళిపోదామా?"

"పదకొండు కావచ్చింది. ఓ గంట అలా అలా తిరిగి కాంటీన్‌లోనే భోంచేసి రూంకి పోదాం! చివరిగా ఓసారి యీ లోయల్ని, కొండల్ని, ప్రకృతి అందాల్ని చూసిపోదాం!" తిలక్ భావుకుడు. అతనికి ప్రకృతిపట్ల ఎంత అభిమానమో ఆమెకు తెలుసు. అందుకే వారించలేకపోయింది.

"అటు పోవద్దు. అసలు అక్కడే ఆ చింపాంజీగాడు మొదటిసారిగా నాకు కనిపించాడు. ఇటు వెళ్దాం. ఈ వైపు యిప్పటిదాకా పోలేదు కూడా" అన్నది లలిత.

ఆమె అనుక్షణం ఆ వ్యక్తి గురించే ఆలోచిస్తోంది. ఆమె అబద్ధం చెప్పటంలేదు. నిజంగానే అలాంటి వ్యక్తిని చూసి వుంటుంది. అయితే వాడు తను లేనప్పుడు, తన దృష్టి పడనప్పుడు ఆమెకు కనిపిస్తున్నాడు. భయపెడుతున్నాడు. ఎందుకు?

"హలో, ఎందాకా?" అన్న పిలుపు వినిపించి ఇద్దరు త్రుళ్ళిపడి చూశారు.

డాక్టరు నవ్వుతూ వాళ్ళవంకే చూస్తున్నాడు. బండరాయిమీద కూచుని వున్నాడు. అక్కడినుంచి లోయ అందాలు చూపరుల దృష్టి మరల్చనీయవిధంగా కన్పిస్తున్నాయి.

"ఊరకే అలా బయలేరాం! మీరింకా ఎన్నాళ్ళుంటున్నారు?" అడిగాడు తిలక్.

"ఇంకా రెండు రోజులు."

"మేము రేపుదయం వెళ్ళిపోతున్నాం."

"అదే, నాలుగు రోజులపాటు వుంటానన్నారుకదా!"

"లలితకు ఒంట్లో బావుండటంలేదు సార్!"

"సరే, అలాగే వుంటుంది. ఇలాంటి చోటనే ప్రశాంతత రిలీఫ్ దొరుకుతాయామెకు."

డాక్టరు మాటలు తిలక్‌కు యేం అర్థంకాక ఆయన వంక ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఊ, శుభవార్త చెపుతానన్నానుకదా, చెప్పెయ్యనా?"

"చెప్పండి. ఇంకా సస్పెన్సులోనే వుంచాలా?"

"మీరిద్దరు అమ్మా నాన్నా కాబోతున్నారు."

"డాక్టర్! నిజంగానా?" తిలక్ కళ్ళలో యెన్నో జ్యోతుల వెలుగు!

తిలక్ చూపుల్నుంచి లలిత చూపులు తప్పించుకుంది.

"అమ్మ దొంగా, యింత నాటకమాడతావా? నాకు చెప్పకుండా దాస్తావా?" గుసగుసగా అన్నాడు తిలక్.

మురిపెంగా చూసిందామె భర్తవంక.

"థాంక్యూ వెరీమచ్ డాక్టర్!" అన్నాడు తిలక్.

"ఇక పోదామా?" అన్నది లలిత తిలక్‌కి మాత్రమే వినిపించేలాగా.

"అదేమిటి? ఈసేపు కూచుందామన్నావు కదా, అబ్బబ్బ, నీ మనసు బొత్తిగా స్థిరత్వం కోలుపోతోంది."

"మీరిక్కడ యీయనతో సోది కొందలెడితే నేను గోళ్ళు గిల్లుకుంటూ కూచోవాలా?"

"సరే, పద!" అని డాక్టరువైపు తిరిగి "వెళ్ళొస్తాం డాక్టరుగారూ, ఎండ బాగా హెచ్చుగా వుంది!" అన్నాడు తిలక్.

"వెళ్ళిరండి. నేనిక్కడే సాయంత్రందాకా కూచుంటాను బాగా పొద్దుపోయి వస్తాను. తర్వాత కలుద్దాం, ఓ.కే!...."

# 10

ఎవరో తలుపు తట్టడంతో ఇద్దరు ఉలిక్కిపడి గుమ్మం వైపు చూశారు.

లలితకైతే ముందే భయం. మర్నాడు ఎప్పుడు తెల్లారుందా ఎప్పుడు హైదరాబాదు పోదామా అని ఆత్రుతగా వుందామెకు. అప్పుడు రాత్రి ఎనిమిది గంటలు దాటింది.

తిలక్ తలుపు తీయటానికి వెళుంటే, "జాగ్రత్త! యెవరో కనుక్కొని మరీ తియ్యండి!" అన్నది వెనుక నుంచి.

తిలక్ "ఎవరు?" అన్నాడు, తలుపు దగ్గర నిల్చొని.

"డాక్టరుగారి నుంచి కబురు తెచ్చాను. ఇక్కడ పనిచేసే బోయ్‌ని!" అన్నాడు బయటి వ్యక్తి.

తిలక్ తలుపులు తెరిచాడు.

ఎదురుగా ఓ యిరవయ్యేళ్ళ యువకుడు నిల్చుని వున్నాడు. "తిలక్ గారంటే మీరేనా?" అన్నాడు.

"అవును, నేనే, ఏం కావాలి? కబురంటూ వేమిటి?"

"డాక్టరుగారు కొండమీదనుంచి పక్కనున్న లోయ లోకి పడిపోయారు సార్! బాగా దెబ్బలు తగిలాయి. మీతో యేదో విషయం చెప్పాలని, అర్జంటుగా తీసుకు రమ్మని చెప్పారు!"

"ఎక్కడున్నారు?"

"ఆయన పడిపోయిన చోటికి దగ్గర్లో వున్న ఓ కాటేజిలో పడుకోబెట్టాం సార్."

"ఏమైనా ప్రమాదంగా వుందా?"

"చాలా ప్రమాదంగా వుంది సార్! మా గెస్టుహౌస్ డాక్టరుగారు ట్రీట్ మెంటిస్తున్నారు."

"సరే, పద!" అంటూ తిలక్ లలితవంక చూసి "నువ్వు తలుపులు వేసుకో! నే నిప్పుడే వచ్చేస్తాను" అన్నాడు.

"నేనూ వస్తానండీ, ఒక్కతెనూ వుండలేను!"

"బాగా చలిగా వుంది. పైగా ఆయన చావుబతుకుల మధ్య వున్నాడు. నువ్వు అలాంటి చోటికి రావటం మంచిదికాదు! షాక్ అవుతావు" అన్నాడు తిలక్.

"రండి సార్! అక్కడ ఆయన పరిస్థితి క్షణక్షణం ప్రమాదంగా వుంది" బోయ్ తొందర చేశాడు.

తిలక్ అతనితో బయటికి నడిచాడు.

లలిత వెంటనే తలుపులు వేసుకోబోతూ రోడ్ మీదికి చూసింది. కాటేజిలన్నిటినీ కలుపుతూ చిన్న చిన్న తారు రోడ్డులున్నాయి కొండమీద. కుడిపక్కనున్న రోడ్ నుంచి వస్తున్న వ్యక్తిని వెంటనే గుర్తుపట్టింది.

అతను మహేష్! భగవాన్, యింత రాత్రప్పుడు యెందుకు వస్తున్నట్టు? తన దగ్గరకే అయివుంటుంది. చటుక్కున తలుపులు వేసేసి లోనికొచ్చి మంచంమీద అనిమితంగా కూచుంది.

యే క్షణంలోనైనా తలుపు చప్పుడు కావచ్చునని ఊపిరి బిగబట్టి చెవులు రిక్కించి వింటున్నది. పదినిమిషా లైనా తలుపు చప్పుడు కాలేదు!

బయటనించుని యేంచేస్తున్నాడు మహేష్!

ఆమెలో ఉత్కంఠ హెచ్చింది. కాని తలుపు తియ్యటానికి ధైర్యం చాలటంలేదు.

తిలక్ యింకా రాలేదు. ఆమెలో పిరికితనం ప్రవేశించింది. ఈ రాత్రప్పుడు ఆ కొండ చివరనున్న కాటేజికి వెళ్ళిన భర్తమీద విసుక్కుంది. మళ్ళీ అంతలోనే తనని తను నిందించుకుంది. డాక్టరు చావు బతుకుల్లో వుండి కబురు పెడితే వెళ్ళాడుగాని లేకుంటే తనని వదిలి తిలక్ వెళ్ళడు!

ఆమె నిమిత్తంగా కూచోలేక లేచి కాసేపు పచార్లు చేసింది. భర్త యింకా రాలేదు.

టైం తొమ్మిదిగంటలు అయింది.

ఇక ఎంతోసేపు అలాగే వుండలేకపోయింది. తిలక్ వస్తున్నాడేమోనని చూడాలనుకుంది.

రెండుసార్లు తలుపువరకు వెళ్ళి తియ్యబోతూ సంకోచించి వెనక్కి వచ్చేసింది.

ఏమో, యింకా మహేష్ గుమ్మం దగ్గరే కాచుకుని వున్నాడేమో! అయినా, అతను యిక్కడికే వచ్చాడో రోడ్డున యెటయినా పోతున్నాడో! అంతా తన అనుమానం!

ధైర్యంగా తలుపు తీసింది. కాటేజీల్లో లైట్లు ప్రకాశవంతంగా వెలుగుతున్నాయి. రోడ్ స్పష్టంగా కనిపిస్తోంది.

కాని తిలక్ వస్తూన్న జాడలేదు. తలుపులు మూసెయ్యబోతూ ఆగింది. పక్కన యెక్కడో మహేష్ మాట వినిపించింది. ఆమె ఉలిక్కిపడి చూసింది. ఆ మాటలు తమ పక్క కాటేజినుంచని గ్రహించటానికెంతో సేపు పట్టలేదు.

"....నేను నిన్ను ఎందుకు చేరదీశానో తెలుసు కదా! ఇప్పటిదాకా బావని నా వైపు తిప్పుకోలేకపోయాను. నువ్వు ప్లాన్ వేశానని ఉత్తుత్తి కబుర్లు చెప్పి పబ్బం గడుపుకుంటున్నావు!" అది తిలక్ మరదలు నళిని గొంతు.

విసుపోయి వింటూ నిల్చుండిపోయింది లలిత.

మహేష్ గొంతువిని మరింతగా నిర్ఘాంతపోయింది.

"నేను వేసిన ప్లాన్ సామాన్యమైనది కాదు! తిలక్‌ని లలితనుండి విడదియ్యాలంటే అతనికి ముందు లలితమీద అనుమానం రావాలి! నేను ఒకటొకటిగా నా ప్లాన్‌లోని అంశాలు అమల్లో పెడుతున్నాను. రేపు అతను చూస్తూండగానే ఆమెని పట్టుకుని నా మీదికి లాక్కుంటాను. దాంతో అతను పిచ్చెత్తిపోయి అర్జంటుగా ఆమెను వదిలించుకోపోతే అడుగు. ఆ తర్వాత నువ్వు వల విసిరి అతన్ని వశపర్చుకో, ఓ.కే!"

లలిత పిడికిళ్ళు కోపంతోను, ఉద్రేకంతోను బిగుసుకున్నాయి.

నళిని మాటలు వినిపించాయి. "ఆఁ, అంత తేలికగా ఆమెను వదులుకోడు. వాళ్ళిద్దరు ప్రేమించి పెళ్ళి చేసుకున్నారు. ఆమె అంటే బావకు పిచ్చి ప్రేమ!"

"సరే, యింకో మాస్టర్ ప్లాన్ వేశాను. అది చివరి అస్త్రం! లలితను పాడు చేసేసి...."

"గుడ్! ఇప్పుడు బావుంది...."

లలిత ఒక్క అంగలో లోపలికొచ్చేసి తలుపుకి బోల్టు పెట్టేసింది. కాసేపటివరకు ఆమెకు గుండె దడ తగ్గనే లేదు!

భగవాన్, ఈ లోకం ఎంత చెడ్డది! భార్యాభర్తలు అన్యోన్యంగా జీవించటం యీ సమాజానికి కన్నెర్రగా వుంటుందేమో! తామేం తప్పుచేశామని తమిద్దరిమీదా వీళ్ళందరూ కక్ష కట్టారు? తిలక్‌ని వశపర్చుకోవాలని, అతని పెళ్ళయిన మరదలు తాపత్రయపడుతోంది. అందుకు లంచంగా తన స్త్రీత్వాన్ని మరో మగాడికి అర్పిస్తోంది! ఆమె ఒళ్ళు జుగుప్సతో జలదరించింది ఆ సంగతి తలుచుకోగానే.

ముందుగానే వాళ్ళ దురూహ తెలియటం తన అదృష్టం! ఎలాగూ రేపుదయమే వెళ్ళిపోతున్నారు కదా, వీళ్ళందరి బెడదా తీరిపోతుంది. డాక్టరుకి తప్ప రేపుదయం తాము వెళ్ళిపోతున్న విషయం ఎవరికీ తెలియదు!

లలితకు టెన్షన్‌తో తలబాధ పగలేస్తోంది. తిలక్ యింకా తిరిగిరాలేదు. డాక్టరు యెలా వున్నాడో.... బతికాడో లేక....

# 11

పదిన్నరయింది. తిలక్ రాలేదు. ఆమె మనసు కీడును శంకిస్తోంది. అతను వెళ్ళి యిప్పటికి రెండు గంటలు దాటింది.

ఆమెకు అకస్మాత్తుగా గుర్తొచ్చింది — తిలక్‌కోసం వచ్చిన యువకుడు యిక్కడ బోయిలాలేడు! అతన్ని ఈ

కాటేజెస్‌లో యెక్కడా చూసిన గుర్తు కూడా లేదు. గెస్టు హౌస్ బోయ్స్ ప్రత్యేకమైన తెల్ల షర్టు, ఆకుపచ్చ నిక్కర్లు వేసుకుంటారు. షర్టుకి గెస్టు హౌస్ పేరు ఆకుపచ్చ దారంతో కుట్టి వుంటుంది—పొడి యింగ్లీషు అక్షరాలు!

ఆ యువకుడు యూనిఫాంలో లేడు సరికదా, మంచి పోలిస్టర్ షర్టు పేంటు వేసుకుని వున్నాడు.

కొంపతీసి....యేదయినా మోసం జరగలేదు కదా! ఆమె గుండె ఓ క్షణం ఆగి కొట్టుకుంది.

భగవాన్, యేమిటీ పరీక్ష? ఆయన క్షేమంగా తొందరగా తిరిగొచ్చేలా చూడు—అనుకున్నది పదోసారి.

రోడ్‌వైపున్న కిటికీ తలుపులు తెరిచి చూసింది.

రోడ్ నిర్మానుష్యంగా వుంది. కాటేజీల్లో లైట్లు ఆర్పేయటంతో అంతటా చీకటి అలుముకుని వున్నది! వాచీ పదిగంటలు చూపిస్తోంది!

కిటికీ తలుపులు మూసి మళ్ళీ వచ్చి కూచుంది, లేచింది, అటు యిటు తిరిగింది. ఆమెకు దుఃఖం తన్నుకుని వచ్చేస్తోంది! పోనీ పక్కవాళ్ళ నెవరినైనా లేపుదామంటే—తనకు కుడిపక్క కాటేజిలో నళిని! యెడమ పక్క దాంట్లో డాక్టరు - ఆయన యెటూ కాటేజిలో లేడు. నళినిని పిలవటమంటే కోరి కొరివితో తల గోక్కోవటమే!

సరిగ్గా అదే క్షణంలో తలుపుమీద చప్పుడయింది.

లలిత గుండె ఒక్కక్షణం లయితప్పి కొట్టుకుంది.

"ఎవరు?" అన్నది గొంతు పెకల్చుకుని.

"నేను లల్లీ....!" తిలక్ గొంతు వినిపించింది. కిటికీ దగ్గరకు వెళ్ళి తలుపు తెరవబోయిన లలిత భర్త కంఠం

వినగానే ఉత్సాహంగా గుమ్మం దగ్గరకు పరుగెత్తి తలుపు తెరిచింది.

గుమ్మంలోని వ్యక్తిని చూస్తూనే ఆమె కెవ్వున కేక వేయబోయింది. అతను చటుక్కున ఆమెని పట్టుకుని నోరు నొక్కేశాడు.

లలితకి పిచ్చిధైర్యం వచ్చేసింది. అతనితో పెనుగులాడింది. గింజుకుంది. చేతుల్తో మోదింది.

అతను వినపడకుండా నవ్వుతున్నాడు. దుబ్బుగా పెరిగిపోయిన గడ్డం, నల్లటి పాంటు, ఎర్రటి కనుగుడ్లు- ఆ చింపాంజీలాంటి మనిషిని అంత దగ్గర్లో, పైగా అతని చేతుల్లోపడి-చూడటం ఆమె శక్యం కాలేదు.

గట్టిగా కళ్ళు మూసుకుంది.

అతనామెను గాలిలో లేపి పట్టుకున్నాడు.

అంతవరకే గుర్తుందామెకు!

## 12

చటుక్కున తెలివి తెచ్చుకుని చుట్టూ చూసింది. అది కూడా కాటేజిలోని గదినే పోలివుంది! ఆ కొండమీది గెస్టు హౌస్‌కి సంబంధించిన కాటేజేనని తేలిగ్గానే గుర్తుపట్టింది లలిత!

బెడ్ లైటు వెలుతురు డిమ్‌గా వుంది!

ఆ గుడ్డి వెలుతురులోనే అక్కడి పరిసితిని గమనించింది. గదిలో యెవరూ లేరు! ఆ బవిరిగడ్డం చింపాంజీ తనని ఎత్తిపట్టుకున్నాడు....తర్వాత యేమయింది?

తనవంక ఓసారి పరీక్షగా చూసుకుంది. అనుమానాస్పదమైన అవాంఛనీయ సంఘటన ఏదీ జరగలేదని తెలుస్తూనే వుంది! మరి ఆ చింపాంజీ యేమయ్యాడు? ఇది యెవరి గది? ఇక్కడికి తీసుకొచ్చి యెక్కడికి

పోయాడు?

ఆమె మంచం దిగింది. అటు యిటు పరీక్షగా చూసింది. గదికాక ఎటాచ్‌డ్ బాత్, లావెట్రీ, పక్కనే చిన్న వరండా....అంతా తమ కాటేజిలాగానే వున్నది! ఇది ఆ చింపాంజీ గదా? ఏమో, తెలీదు!

చకచక గుమ్మం దగ్గరికి నడిచింది. తలుపులు వేసుకుని బయటికి పారిపోవాలి!

బోల్టుమీద చెయ్యి వేసింది.

"ఆగక్కదే!" కర్కశంగా వినిపించిన స్వరం విని చటుక్కున ఆగిపోయింది.

తను అంతవరకు గమనించనేలేదు. వరండాలోనుంచి వస్తున్నాడతను!

చింపాంజీగాడు కాదు. పరీక్షగా చూసి తృళ్ళిపడింది.

"బావా! నువ్వా?" అన్నది విస్తుపోతూ.

"అవును, నేనే!" కర్కశంగా నవ్వాడు లలిత మేనబావ సోమశేఖర్.

"నన్నిక్కడికి తీసుకొచ్చిన గడ్డం మనిషి...."

"వాడ్ని నేనే కాంట్రాక్టుకు తీసుకున్నాను. నీ మొగుడ్ని తీసుకెళ్ళిన వ్రాడినీ నేనే నియోగించాను. చాలా, ఇంకా వివరాలు కావాలా?"

"అయితే డాక్టరుకి ప్రమాదం జరగటం, ప్రాణాపాయంలో వుండటం...."

"అదంతా నేనాడించిన నాటకం! నా మనిషి మీ దగ్గరకొచ్చిన సమయంలో డాక్టరు హాయిగా కేంటీన్‌లో భోజనం చేస్తున్నాడు!"

"అయితే మావారు...."

"ప్రస్తుతానికి క్షేమంగానే ఉన్నాడు. నువ్వు

మొండికేస్తే నిర్దాక్షిణ్యంగా మా చేతుల్లో చస్తాడు."

"ఛీ, ఇంత దుర్మార్గాని ఒడిగడతావా? నేను నీకు దక్కలేదని, నిన్ను చేసుకోవటానికి తిరస్కరించాననీ కక్ష తీర్చుకోదలిచావా?"

"మూడేళ్ళ తర్వాత ఇప్పుడెందుకు తీర్చుకుంటాను కక్ష? తీర్చుకోవాలంటే నీ పెళ్ళికిముందే తీర్చుకునేవాడిని!"

"ఈ పాడు శరీరంకోసమా ఇంత పాపానికి సిద్ధమయ్యావు! ఈ లోకం కుళ్ళిపోయింది! ఆడది ఆటవస్తువుగా భావించి ఆడుకునే శిఖండిగాళ్ళతో నిండిపోయింది."

"ఛ, నేను నిన్ను కోరి యిక్కడికి తెప్పించాననుకుంటున్నావా? కుక్క ముట్టిన విస్తట్లో భోంచేసేటంత దిగజారిపోలేదు నేను!"

"బావా!" అరిచింది లలిత.

"అరవకు! పాయింట్‌కొస్తున్నాను. ముందుగా ఓ దుర్వార్త. మీ నాన్న చచ్చిపోయాడు."

లలిత నిర్ఘాంతపోయి చూసింది. "ఎప్పుడు? నాన్నకే ఏ జబ్బూ లేదు. నన్నేడిపించటానికంటున్నావా?" అన్నది. ఆమె కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

"నీతో హాస్యాలాడటానికి, సరసాలాడటానికి నిన్ను రప్పించలేదు! ఇదిగో, యీ కాగితాలమీద సంతకం చెయ్యి!" దస్తావేజుల్ని ఆమెముందు పెట్టాడు.

"ఏమిటివి?"

"తెలియటంలేదా? వీలునామా. నీ ఆస్తి అంతా నా పేరున దాఖలు పరుస్తూ రాసిన శుభలేఖ. నీ సంతకం పడితేనేగాని దీనికి విలువలేదు, పెట్టు!"

"ఏమిటీ డొంక తిరుగుడు? నాకు ఆస్తి ఎక్కడిది?"

"మీ నాన్న నీ పేర్న ఆస్తంతా రాసేశాడు."

"ఆయన నన్ను యేనాడో వదిలేసుకున్నారు. ఆయన బతికుండగా గడప తొక్కనివ్వనన్నారు! నాకు ఆస్తిలో చిల్లిగవ్వకూడా యిచ్చేదిలేదన్నారు. అన్నిటికీ సిద్ధపడే తెలిసే చేసుకున్నాను."

"బతికుండగా గడప తొక్కొద్దన్నాడుకదా! ఇప్పుడు బతికిలేడు గదా, అంచేత ఆస్తి నిన్ను వెతుక్కుంటూ వచ్చింది."

తండ్రి పోయాడన్న నిజాన్ని ఆమె అంగీకరించలేక పోతోంది. ఆయన పిడుగులాంటి మనిషి! యెప్పుడూ చిర్రున చీది ఎరగడు! జ్వరం పడటం మొదలే లేదు! అలాంటి వ్యక్తి ఇంత అకస్మాత్తుగా ఎలా చనిపోతాడు? పైగా ఆస్తి తన పేర రాయటమేమిటి? ఇదంతా నిజమా? లేకుంటే యీ బావ అనబడే మనిషి తన సంతకం ఎందు కడుగుతాడు?

"నాన్నగారు చనిపోలేదు. నువ్వబద్ధం చెపుతున్నావు."

"నేనూ అలాగే అనుకున్నాను మొదట్లో! కాని నా మనుషులు తూట్లుకింద పొడిచేశారు పాపం, మీ నాన్నని. ఎంతోసేపు శవాన్ని చూడలేకపోయాననుకో!" అతను నవ్వుతున్నాడు.

లలితకు యీసారి నమ్మకం కుదిరింది. బావ నిష్కారణంగా తన తండ్రిని హత్య చేయించాడు ఆస్తికోసం!

ఆమెకు దుఃఖం కట్టలు తెంచుకుంది. కరువు తీరేవరకు తండ్రిని తలుచుకుని ఏడ్చింది. కాసేపటికి తేరుకుని బావ వంక చూసింది.

“ఆస్తికోసం ఇంత ఘోరం చేస్తావా? అసలు ఆయన ఆస్తి నా పేర యెందుకు రాశాడు? అలా రాసే తన ప్రాణంమీదికి తెచ్చుకున్నాడు....” ఆమె కంఠం మళ్ళీ రుద్ధమయింది.

“ఆస్తి నీ పేర రాశాడని తెలిస్తే మామయ్యచేత నే తిరగరాయించుకునేవాడిని. నువ్వు తప్పితే ఆయనకు నా అన్నవాళ్ళు లేరు! నువ్వు కూడా లేకపోతే ఆ ఆస్తి నాకే దక్కుతుంది — వారసుణ్ణి నేనే! కాని ఆస్తి నీ పేర రాసిపోయాడు మామయ్య! ఆ సంగతి ఆయన చచ్చాక తెలిసింది, అప్పటికే అంతా అయిపోయింది!”

“ఇంతకీ మా వారినేం చేశావు?”

“క్షేమంగానే వున్నాడని చెప్పాను కదా.”

“ఏమో? ఆయనకేమీ అపకారం చెయ్యననీ, చెయ్య లేదని యేమిటి నమ్మకం?”

“నీ మొగుడు మా గడ్డపోడి రక్షణలో ఇప్పటిదాకా హాయిగా వున్నాడు.”

“ఆయన్ని ఎందుకు మాయం చేశావు?”

“నువ్వు ఒంటరిగా దొరకాలి కదా?”

“ఆయన్ని మోసంచేసి తీసుకెళ్ళాక నేను ఒంటరి గానే వున్నాను కదా! అక్కడే యీ బాగోతం ఆడక పోయావా? ఆ గడ్డపోడిచేత యిక్కడికి రప్పించటం దేనికి?”

“దేనికైనా స్థానబలం కావాలి కదా! నిన్ను మీ రూంలో వుంచి అడిగితే నా మాట వింటావా? అరిచి అందర్నీ పిలుస్తావు. కథ రసాభాసవదూ?”

“అయితే అన్ని సంగతులూ బాగానే సేకరించావన్న మాట!”

"మరి అషామాషీగా వ్యవహరిస్తా ననుకున్నావా? అందులోనూ యిలాంటి విషయాల్లో....ఆc, ఊలాసాగా కబుర్లాడటానికాక్కాదని చెప్పానుగదా నిన్ను రప్పించింది! ఇదుగో కలం, సంతకం చెయ్యి!"

"చెయ్యకపోతే....?"

"నువ్విలా మొండికేస్తావని తెలిసే నీ ప్రాణంలో ప్రాణం, నీ సర్వస్వం, నీ లోకం నువ్వే తనూ అయిన నీ పతి దేవుడ్ని మా గుప్పెట్లో పెట్టుకున్నాం....నువ్వు సంతకం చెయ్యకపోతే నీచేత సంతకం ఎలా చేయించాలో మాకు తెలుసు! అక్కడ నీ మొగుడికి పై లోకంలో సీటు రిజర్వు చేసేస్తాం — ఇక్కడ నీచేత సంతకమూ చేయిస్తాం. సంతకం బుద్ధిగా చేసేసి నీ దేవుడ్ని కాపాడుకో!"

"సరే, ఆయన్ని ముందు క్షేమంగా నాకప్పగించు!"

"నా మాట మీద నమ్మకంలేదా?"

"ఎలా వుంటుంది? ఆస్తికోసం స్వంత మరదల్ని ఇలా హింసించి, చివరికి ఆమె అయిదోతనాన్ని కూడా చెరిపెయ్యాలనుకునే నిన్నెలా నమ్మేది? నీకు ఉచ్చం, నీచం వుంటే నా మీదికి ఆ చింపాంజీగాడ్ని ప్రయోగిస్తావా?"

"ఓ, అదా! వాడ్ని అసలు నిన్ను తీసుకురమ్మని మాత్రమే పంపాను. అయితే సమయం చిక్కక వాడు నీ వెంట వెంటపడి నిన్ను బెదరగొట్టేకాడు. వెధవ, నీ అసలు సంగతి ఒదిలేసి నీమీద మనసుపడి ఏవో వాగాడట. తర్వాత తిట్టి పంపించానులే. అందుకే ఈ రాత్రి నిన్నేమీ చెయ్యకుండా బుద్ధిగా, యిక్కడికి జాగ్రత్తగా తెచ్చి అప్పగించాడు!"

లలిత మాట్లాడలేదు.

"ఏమిటి, సంతకం పెట్టవా?"

"పెడతాను. వారిని చూడాలి."

"నీ మొండితనం మాత్రం ఏం మారలేదు. సరే, యిక్కడికి రప్పిస్తాను. అప్పుడైనా నమ్ముతావు కదూ! ఇద్దరు కలిసి యేమైనా వెధవ్వేషాలు వెయ్యొచ్చనను కుంటే మాత్రం యిద్దర్నీ యిక్కడే సమాధిచేసేస్తాం. అసలు నిన్ను చంపేసే అని యెలాగూ నాకే దక్కు తుంది. కాని పోలీసులకి అనుమానం వస్తే అంతా బెడిసి కొడుతుందని, యింతగా ప్రాధేయపడుతున్నాను సంతకం కోసం!" అతను తలుపు ఓరవాకిలిగా తీశాడు. గుమ్మం దగ్గర చింపాంజీ సిద్ధంగా వున్నాడు.

"వాడ్ని తీసుకురా?" అన్నాడతను.

చింపాంజీ వెళ్ళిపోయాడు.

అయిదు నిమిషాల్లో తిలక్‌ని తీసుకొచ్చాడు.

భర్తని చూడగానే ఆనందబాష్పాలు రాల్చింది లలిత. తిలక్ ఆమెవంక ఆర్తిగా, ఆత్రుతగా చూస్తు న్నాడు. అతని చేతులు వెనక్కి విరిచి కట్టేశాడు చింపాంజీ. నోట్లో గుడ్డలు కుక్కాడు.

మూగగా తనవంక చూస్తున్న భర్తనుచూసి కన్నీరు ఆగలేదామెకు.

"ఊఁ, యిప్పుడిక సంతకం పెట్టడానికి అభ్యంతరం లేదు కదూ!" కలం, దస్తావేజులు ఆమెముందు పెట్టాడు అతను.

తిలక్ తల అడ్డంగా తిప్పాడు పెట్టవద్దన్నట్టుగా. అతని భావం ఆమెకర్థంకాలేదు.

కలం తీసుకుంది.

మళ్ళీ తల అడ్డంగా తిప్పాడు తిలక్.

ఆమెకి బోధపడింది! తీరా సంతకం పెట్టాక బావ తమని ప్రాణాలతో వుంచుతాడని గ్యారంటీ యేమిటి? తమని వదిలేస్తే పోలీసులకి చెప్పి గొడవ చేస్తామని భయ పడటం సహజం! సంతకం చేయించుకుని తమిద్దర్నీ కొండమీదినుంచి లోయల్లోకి తోసి చంపేస్తే అడుకోగల దిక్కు లేదు!

"పెట్టు! ఓహో, నీ పతి దేవుడు వద్దని చెప్తున్నాడు కదూ! ఏరా, రాస్కెల్! బతకాలని లేదా?" అతను తిలక్ రెండు చెంపలు ఛెళ్ళు ఛెళ్ళున చరిచాడు.

తిలక్‌కి కళ్ళు తిరిగినట్టనిపించింది.

"జాగ్రత్త! నిలువునా కోసేసి ఉప్పు కారం పెట్ట గలను!" అన్నాడతను కళ్ళెర్రజేస్తూ.

"బావా, ఆపు! నీక్కావలసింది యీ సంతకమే కదూ, ఇదుగో పెడుతున్నాను...." అంటూ కలం తీసుకుని సంతకం పెట్టెయ్యటానికి సిద్ధపడింది.

"వద్దమ్మా, పెట్టకు!" అన్న మాటలు వినిపించి అందరు త్రుళ్ళిపడి గుమ్మంవైపు చూశారు.

తొందర్లో తలుపుకి బోల్టు పెట్టడం మరిచినందుకు నాలిక్కరుచుకున్నాడు చింపాంజీ.

గుమ్మంలో డాక్టర్ నిలబడి వున్నాడు. అతని చేతిలో రివాల్వర్ సూటిగా లలిత బావ గుండెలకు గురిపెట్టబడి వుంది!

లలిత బావ వేగంగా కదలబోయాడు.

డాక్టరు హెచ్చరించాడు. "మిస్టర్, పిచ్చి వేషాలు వెయ్యాలని ప్రయత్నించకు! నేను దయ చూపించను! కాల్చటానికి యేమాత్రం సంకోచించను. మీ ఫ్రెండుని

యిప్పుడే కట్టిపడేసి వస్తున్నా."

డ్రాయరు సొరుగులో వున్న రివాల్వర్ అందుకో వాలనుకున్న లలిత బావ ప్రయత్నం ఫలించలేదు.

అయితే డాక్టరు పక్కనుంచి వచ్చే ప్రమాదాన్ని చూసుకోలేదు. చింపాంజీ చేతిలోని కత్తి సూటిగా వచ్చి డాక్టరు చేతికి గుచ్చుకుంది.

రివాల్వర్ నేలమీద పడిపోయింది.

ఒక్క అంగలో యెగిరి అందుకున్నాడు రివాల్వర్ని లలిత బావ. మరుక్షణం డాక్టరుని నిర్దాక్షిణ్యంగా కాల్చేసేవాడే!

కాని లలిత ఒక్కసారిగా బావమీదపడి రివాల్వర్ ఎగరగొట్టేసింది. ఆమె అంత వేగంగా తనమీదకొచ్చి పడ్తుందని ఊహించని ఆమె బావ ఓ క్షణం బిత్తర పోయాడు.

రివాల్వర్ సరిగ్గా తిలక్ కాళ్ళ ముందుకొచ్చిపడింది.

చింపాంజీ వంగి అందుకోబోయాడు. కాని సరిగ్గా అదే క్షణంలో తిలక్ రివాల్వర్ని డాక్టరు దగ్గరకు తన్నేశాడు. వంగిన చింపాంజీని మరో కాలితో డొక్కలో తన్నాడు. చింపాంజీ ఎగిరి అంత దూరంలో పడ్డాడు. అతని తలపోయి గోడకు బలంగా కొట్టుకుంది.

డాక్టరు లలిత బావని, చింపాంజీని రివాల్వర్తో కవర్ చేస్తున్న సమయంలో లలిత ఒక్కపరుగున పోయి తిలక్ కట్లు విప్పేసింది. నోట్లో గుడ్డలు తీసేసింది.

డాక్టరు కుడి చేతినుంచి రక్తం ధారాపాతంగా కారి పోతోంది. ఎడమ చేతితోనే రివాల్వర్ పట్టుకుని నిశ్చలంగా నించున్నాడు. లలిత తన చీర చెంగు చింపి డాక్టరు చేతికి కట్టుకట్టింది, రక్తం స్రవించకుండా.

తర్వాత లలిత, తిలక్ లలిత బావని, చింపాంజీని తాళ్ళతో మంచం కోడుకి కట్టిపడేశారు! వాళ్ళు ఏదో కక్కబోయారు, కాని డాక్టరు చేతిలోని ఆయుధం వాళ్ళ నోరు నొక్కేసింది.

లలిత, తిలక్ డాక్టరువంక కృతజ్ఞతాపూర్వకంగా చూస్తూ చేతులు జోడించారు.

డాక్టరు చిన్నగా నవ్వి, “ఈ అమ్మాయిని గెడ్డపోడు ఎత్తుకురావటం చూశాను. ఫాలో అయ్యాను. సమయానికి రక్షించగలిగాను. థాంక్ గాడ్! మీరెళ్ళి గెస్టు హౌస్ యజమానికి తెలియజెయ్యండి. వీళ్ళ సంగతి వాళ్ళే చూసుకుంటారు. మీరొచ్చేవరకు వీళ్ళని అంగుళం కదలనివ్వను!” అన్నాడు.

లలిత బావ, చింపాంజీ బోనులోపడ్డ పులుల్లాగా గుర్రుగా చూశారు డాక్టరు వంక.

తిలక్, లలిత గెస్టు హౌస్ వైపు ఉత్సాహంగా అడుగులు వేశారు.

—: అయిపోయింది: —

# దేవత

టెంపోరావ్

మెర్సిడిస్ కారు వేగంగా ట్రంక్ రోడ్డమ్మట దూసుకు పోతోంది. వెనుక సీటుమీద రాజా, అనసూయ కూర్చుని వున్నారు.

యూనిఫాంలో వున్న డ్రయివర్ వెనక్కి చూడకుండా కారును పోనిస్తున్నాడు.

తన ముందున్న బటన్ నొక్కాడు రాజా. చటుక్కున ఒక తెర ఎడంవైపునుంచి కుడిపక్కకు పాకింది. ఇటు పైన వెనుక కూర్చున్న వాళ్ళు ముందున్న వాళ్ళకు కనిపించరు.

రాజా నవ్వుతూ పక్క కూర్చున్న అనసూయవైపు చూశాడు. అతడి హృదయం ఆనందంతో పొంగింది. వాళ్ళ పెళ్ళయి వారం రోజులు అయింది. అతడు తన భార్యను మద్రాసుకు కారులో తీసుకుపోతున్నాడు.

అనసూయ కళ్ళు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి. మనుషుల జీవితాలతో విధి ఆడే ఆటను గురించి ఆమె

ఆలోచిస్తోంది.

వారంరోజుల క్రితం ఆమె ఒక బీదపిల్ల. ఇప్పుడు మెర్సిడిస్ కారులో సుఖంగా ఆమె ప్రయాణం చేస్తోంది. ఖరీదైన పట్టుచీర ధరించింది. ఒంటినిండా నగలు. చేతికి ఆటోమేటిక్ సిటిజన్ వాచ్!

తన జీవితం పూర్తిగా మారిపోయింది. అనసూయ తండ్రి స్కూలు మాష్టరు. రిటైరయి మూడేళ్ళు దాటింది. పద్దెనిమిదేళ్ళు వచ్చినా ఆమెకు పెళ్ళిచేయలేక తండ్రి వూరుకున్నాడు. కొంతమంది విద్యార్థులకు ట్యూషన్లు చెప్పి వచ్చే ఆదాయంతో అతడు సంసారాన్ని సాగిస్తున్నాడు.

ఉమ పెళ్ళిలో తను వూహించని మిరకిల్ సంభవించింది. ఉమ తల్లి ప్రభావతి రాజా అక్క. తన మేనకోడలు పెళ్ళికి రాజా మద్రాసునుంచి కారులో వచ్చాడు.

ఆ పెళ్ళిలో రాజా చూపు అనసూయమీద పడింది. అటుపైన ఆమెమీదే నిల్చిపోయింది.

ఏదేనా కోరిక తనలో లేస్తే గోళ్ళు గిల్లుకుంటూ కూర్చునే మనిషి కాడతను. అక్క ప్రభావతితో మాట్లాడాడు.

“అక్కయ్యా, ఆ అమ్మాయి ఎవరు?” అడిగాడతను.

“వీర్రాజు మాష్టారి కూతురు. ఇంకా పెళ్ళి కాలేదు. పేద పిల్ల” అందామె.

“అమ్మాయి ఒప్పుకుంటే నేనామెను పెళ్ళాడ్తాను” అన్నాడతను.

ఆమె తమ్ముడివైపు ఆశ్చర్యంగా చూసింది. “ఏమిట్రా, నీకోసం ధనవంతుల కూతుళ్ళు ఎగబడ్తారు!”

“ఆ పిల్ల నాకు నచ్చింది. ఆమె తండ్రితో మాట్లాడు”

అన్నాడతను.

"అదెంత పనిరా! నిన్ను కళ్ళకద్దుకుని, నీ కాళ్ళు కడిగి ఆ పిల్లనిస్తారు. కాని ఆలోచించు! ఆ పిల్ల నీకు తగదు!"

"అక్కా ఆలోచించి నిశ్చయించుకున్నాను. వెంటనే మాట్లాడు. యిక్కడే పెళ్ళిచేసుకుని ఆమెను మద్రాసు తీసుకుపోతాను" అన్నాడతను.

వీర్రాజుతో అక్కయ్య మాట్లాడింది.

"అనసూయ అదృష్టవంతురాలు" అన్నాడతను.

మూడు రోజులు తిరిగేలోగా పెళ్ళయిపోయింది. బీద పిల్ల అనసూయ క్షణంలో ధనవంతురాలైపోయింది.

మెర్సిడిస్ కారు వేగంగా వెళ్తోంది. అనసూయను అతడు దగ్గరకు లాక్కుని పెదిమలమీద ముద్దు పెట్టుకున్నాడు.

ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"అనూ, ఏడుస్తున్నావా?"

ఆమె జవాబివ్వలేదు. అతడామె కన్నీళ్ళను రుమాల్తో తుడిచాడు.

"అనూ, నీకేమైంది?" అడిగాడతను మళ్ళా.

"అమ్మా, నాన్నా ఎలా వుంటారో ఆ పల్లెటూళ్లో! వాళ్ళకు దూరంగా పోతూంటే ఏడుపొస్తోంది" అందామె.

"వాళ్ళు హాయిగా వుంటారు. వాళ్ళకు ఏ లోటూ లేకుండా మనం చూద్దాం. ప్రతి నెల వాళ్ళకు నువ్వు డబ్బు పంపు. ఇటువైన ట్యూషన్లు మానేసి వాళ్ళు సుఖంగా బ్రతకొచ్చు."

ఆమె అతడిని కౌగలించుకుంది. అతడివైపు ఆప్యా

యంగా చూసింది.

"మీలాంటి భర్త దొరకడం నా అదృష్టం."

"నువ్వు నా భార్య అవడం గొప్ప అదృష్టంగా నేను భావిస్తున్నాను" అన్నాడతను.

ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది. అతడి వయస్సు ముప్ఫయిఐదు వుంటుంది. తనకంటే 17 ఏళ్లు పెద్దవాడు. అయినా ఆమె సంతోషించింది.

అతడి హృదయంలో ఆమెను పూర్తిగా వశపర్చుకుంది. అతడితో తన జీవితం హాయిగా సాగుతుంది. తన తల్లిదండ్రులు కూడా సుఖపడ్తారు. ఆమె అతడి ఒళ్ళో వాలిపోయింది. మెర్సిడిస్ కారు వేగంగా సాగిపోతోంది.

## 2

సంవత్సరం గడిచిపోయింది.

అనసూయ జీవితం హాయిగా సాగిపోతోంది. తన వ్యాపారం మూలంగా రాజా ఆమెతో ఎక్కువ కాలం గడపలేకపోయేవాడు.

ఆమెకొక కొత్త ఫియట్ కారు కొని అతడు ఇచ్చాడు. ఆమెకు డ్రయివింగ్ నేర్పాడు. అతడు లేనప్పుడు, ఏమీ తోచనప్పుడు ఆమె కారులో అటూ యిటూ తిరిగి బీచ్‌కి పోయి వచ్చేది.

మామూలుగా రాత్రి పన్నెండు తర్వాత అతడు యింటికి తిరిగొచ్చేవాడు. అతడు భోజనం చేస్తూంటే ఆమె పక్కనే కూర్చుని కబుర్లు చెప్పేది. ఆమెవైపు చూస్తూ, ఆనందంగా అతడు వినేవాడు.

ఒకనాటి రాత్రి యిద్దరూ పడుకుని వుండగా ఆమె అతడి దగ్గరగా జరిగింది.

"మీరు చేసే వ్యాపారం ఏమిటో నాకింతవరకూ అర్థంకాలేదు" అందామె.

అతడు నవ్వి ఆమెను ముద్దెట్టుకున్నాడు.

"అదంతా ఎందుకులే!" అని వూరుకున్నాడతను.

"నాకు తెలియడం మంచిదిగా, చెప్పండి" అందామె.

"హోటల్ హెవన్ నాదే. గార్మెంట్స్ ఫాక్టరీ కూడా వుంది. మేం గార్మెంట్సు తయారుచేసి విదేశాలకు ఎగుమతి చేస్తాం" అన్నాడతను.

"మీతో వచ్చి ఒకసారి మన హోటల్, ఫాక్టరీ చూడాలి" అందామె.

"అనూ, అదంతా నీకు వద్దు! నా వ్యాపారంలో తల దూరిస్తే అటుపైన నీకు మనశ్శాంతి వుండదు! ఆ పని నాది. నువ్వు హాయిగా యీ యింట్లో రాణిలా వుండు!"

"ఒంటరిగా ఇక్కడ వుంటే నాకు తోచడంలేదు."

"అనూ, మీ అమ్మనీ, నాన్ననీ వచ్చి యిక్కడ వుండమను. అప్పుడు నీకు తోస్తుంది."

"నిజంగా? వాళ్ళకు ఉత్తరం రాసి రమ్మంటాను."

"రమ్మను" అన్నాడతను.

పదిరోజులు తిరిగేలోపల వీర్రాజు, అతడి భార్య సత్యవతి మద్రాసు చేరుకున్నారు. ఆమె నివశించే పెద్ద మేడ చూసి వీర్రాజు ఆశ్చర్యపోయాడు.

"అమ్మాయి, ఇంద్రభవనంలో వచ్చిపడ్డావు!" అన్నాడు తండ్రి.

"ఇటుపైన మీరు యిక్కడే వుండాలి, నాన్నా" అందామె.

"సంతోషంగా వుంటామమ్మా" అంది తల్లి.

వీర్రాజు కూతురివైపు చూశాడు. అతడి భార్య కన్న

పిల్లలు బాల్యంలోనే మరణించారు. ఆఖరిపిల్ల అనసూయ మాత్రం బతికి, పెరిగి పెద్దదైంది.

"నువ్వుతప్ప మాకెవరున్నారమ్మా! నీతోనే వుంటాం" అన్నాడు తండ్రి.

టెలిఫోన్ మ్రోగింది. ఆమె వెళ్ళి రిసీవర్ని అందుకుంది.

"హలో" అంది.

"అనూ, వాళ్ళొచ్చారా?" అడిగాడు రాజా.

"వచ్చారు. నేనే స్టేషన్‌కి వెళ్ళి తీసుకువచ్చాను. వాళ్ళను చూశాక నాకు సంతోషంగా వుంది."

"నువ్వు యెప్పుడూ ఆనందంగా వుండాలి. నేను కోరేది అదే. నువ్వంటే నాకెంతో ప్రేమ."

"మీకెంత ప్రేమో తెలుసులెండి. పొద్దుట పోయి రాత్రి పన్నెండింటికి వస్తారు. మీరు ప్రేమించిన వ్యక్తితో మీరు గడిపే కాలం మూడుగంటలు కూడా వుండదు!" అందామె ఆక్షేపణగా.

"రోజంతా యింట్లోనే వుంటే వ్యాపారం దెబ్బతింటుంది. మనకు డబ్బు కావాలిగా! డబ్బుకోసం చాలా పాటుపడాలి!"

"డబ్బు కావాలి, నిజమే! కాని డబ్బుకోసమే మనం జీవించకూడదు!"

"ఇటువైన అప్పుడప్పుడు మధ్యాహ్నం లంచ్‌కి వస్తూంటాలే!"

"ఇవాళ వస్తారా?"

"ఇవాళ చాలాపనులున్నాయి, రాలేను. ఈ హోటల్లో భోజనం చాలా బాగుంటుంది. మరో రోజు వస్తాను."

"మీ టెలిఫోన్ నంబరెంత?"

"ఎందుకు?"

"ఎప్పుడేనా ఫోన్ చేయడానికి" అందామె.

"నేను చేస్తానుగా! నువ్వు ఫోన్ చేయడం దేనికి?"

ఆమె మౌనంగా వుండిపోయింది.

"అనూ, అక్కడ వున్నావా?"

"వుండక మరెక్కడికెళ్తాను?"

"అనూ, అలా అనకు! నీకో కారు కొనిచ్చాను. అందులో తీసుకు వెళ్ళి నీ తలిదండ్రులకు పట్నం చూపించు!"

"ఇవాళే వచ్చారుగా, చూపిస్తాను తర్వాత."

"ఆల్ రైట్ అనూ, వుంటాను. బై బై!"

ఆమె రిసీవర్ని పెట్టేసింది. ఆలోచిస్తూ మేడ మెట్లు ఎక్కింది. బాల్కనీలో నుంచుని నలువైపులా చూసింది. గేటు ముందు గూర్ఖా వున్నాడు. ఇద్దరు నౌకర్లు తోటలో పనిచేస్తున్నారు. వంటామె, మరో ఇద్దరు నౌకర్లు ఇంట్లో పనిచేస్తున్నారు. ఆ పెద్ద యింట్లో, నౌకర్ల మధ్య తానొక ఖైదీగా జీవిస్తున్నట్లు అనిపించిందామెకు.

## 3

తండ్రికి జ్వరంగా వుంది. అనసూయ టెంపరేచర్ చూసింది. 103 డిగ్రీలుంది. ఆమె వెంటనే డాక్టర్ రామ్మూర్తికి ఫోన్ చేసి యింటికి రమ్మంది.

తన తండ్రి జ్వరం గురించి భరత్తో చెప్పడం మంచిదని ఆమె టెలిఫోన్ డైరెక్టరీ పేజీలు తిప్పి హోటల్ హెవన్ నంబరు చూసి డయిల్ చేసింది.

"హలో హోటల్ హెవన్!" అందో స్త్రీ కంఠం అటువైపునుంచి.

"మీ యజమానితో మాట్లాడాలి" అంది అనసూయ.

"మా యజమాని తారాచంద్ గారు ఇంకా రాలేదు!"

అనసూయ క్షణంసేపు ఆలోచించింది. తన భర్త, తారాచంద్ భాగస్వాములా?

"రాజా గారు వున్నారా?"

"మీరెవరు?"

"అనసూయ" అందామె.

"రాజా గారెవరూ యిక్కడ లేరు" అని అటువైపున రిసీవర్ పెట్టేయబడింది.

అనసూయ రిసీవర్ పెట్టేసి కుర్చీలో ఆలోచిస్తూ కూర్చుండిపోయింది.

విచిత్రంగా వుంది. హోటల్ హెవన్ తనదని భర్త చెప్పాడు. అక్కడ తన భర్త ఎందుకులేడు? అతడు పొద్దుటే ఎక్కడికెళ్ళాడు?

భర్త తనతో అబద్ధం చెప్పాడా? ఎందుకలా చెప్పాడు?

టెలిఫోన్ మ్రోగింది. ఆమె రిసీవర్ ఎత్తి "హలో!" అంది.

"అనూ, నేను. ఎందుకు ఫోన్ చేశావు?"

"మీరు హోటల్ హెవన్‌లోనే వున్నారా?"

"వున్నాను. రాజా యిక్కడలేరని నేనే చెప్పమన్నాను."

"తారాచంద్ ఎవరు?" ప్రశ్నించిందామె.

రాజా నవ్వాడు.

"అనూ, తారాచంద్‌ను యజమానిగా వుంచి యీ హోటల్ నేను నడుపుతున్నాను. అన్నీ నా పేరులో వుంటే పన్నులు ఎక్కువగా వుంటాయి. అందుకని అనేక మనుషుల పేర్లతో నేను వ్యాపారం చేస్తూ వుంటాను."

"అలాగా!"

"నాతో ఏదైనా చెప్పాలా?"

"నాన్నకు హై ఫీవర్" అందామె.

"డాక్టర్ రామ్మూర్తి వచ్చాడా?"

"ఫోన్ చేశాను. వస్తానన్నారు."

"డోంట్ బాదర్! కొత్త ఊరుగా, అలా జ్వరాలు మొదట్లో వస్తూంటాయి. ఇంకా ఏమైనా చెప్పాలా?"

"లేదు."

"అనూ, నేను యిక్కడ చాలా బిజీగా వున్నాను. అత్యవసరం అయితేగాని నాకు ఫోన్ చేయకు. నువ్వు ఫోన్ చేసే నేను వెంటనే రాకపోవచ్చు. నీ పేరు చెప్పి రిసీవర్ పెట్టేయి. తర్వాత నేను నీకు ఫోను చేస్తాను" అన్నాడతనే.

"అలాగే" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

ఆమె మెట్లు దిగి కిందకు వెళ్ళింది. తండ్రి పడుకున్న గదిలోకి అడుగుపెట్టింది.

డాక్టర్ రామ్మూర్తి తండ్రిని పరీక్షిస్తున్నాడు. అతడు అనసూయవంక చూశాడు. ఒక కాగితంమీద కొన్ని మందులురాసి ఆమెకిచ్చాడు.

"రెండు రోజుల్లో తగ్గిపోతుంది. ఈ మందులు వెంటనే యివ్వండి" అన్నాడు డాక్టర్.

ఆమె డాక్టర్‌కు 25 రూపాయలు యిచ్చింది. అతడు బాగ్ తీసుకుని బయటకు వెళ్ళిపోయాడు. తండ్రిపక్కనే మంచంమీద సత్యవతి కూర్చుని వుంది. నౌఖరును పిల్చి, మందులు కొనమని చెప్పి, అనసూయ వందరూపాయల నోటు యిచ్చింది. నౌఖరు గోపాల్ బయటకు పరుగెత్తాడు.

వీర్రాజు కళ్ళు తెరిచి మూలుగుతూ కూతురివంక చూశాడు.

"మీ అందరికీ శ్రమ కల్గిస్తున్నానమ్మా!" అన్నాడతను.

"శ్రమ ఏముంది నాన్నా! మీకు జ్వరం వచ్చిందని అల్లుడిగారితో చెప్పాను. వీలైనంత తొందరగా వస్తానన్నారు" అంది అనసూయ.

"నా మూలంగా అతని పనులు పాడవకూడదు. ఎందుకమ్మా అతడికి ఫోన్ చేశావు?"

"ఫరవాలేదులే నాన్నా! ఆయనకు పనులు ఎప్పుడూ వుంటూనే వుంటాయి" అందామె.

వీర్రాజు కూతురివంక చూశాడు.

"అతడి వ్యాపారం యింకా వృద్ధి చెందాలమ్మా!" అన్నాడు వీర్రాజు.

## 4

ఆ రోజు అతడు మధ్యాహ్నం ఒంటిగంటకల్లా ఇంటికొచ్చేశాడు. బ్రీఫ్ కేసు బీరువాలో పెట్టి పరుపుమీద పడుకున్నాడు.

అనసూయ అతడివైపు నవ్వుతూ చూసింది. ఖరీదైన సూటులో, చక్కటి నెక్ టైతో అతడు పెద్ద ఉద్యోగిలా కనిపిస్తున్నాడు.

"ఒంట్లో బాగాలేదు" అన్నాడతను.

ఆమె పక్కన కూర్చుని అతడి నుదురు, మెడ ముట్టుకు చూసింది. జ్వరం లేదు. కాని అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

"మీరు విస్కీ ఎక్కువగా తాగుతున్నారు" అందామె.

అతడు నవ్వాడు. ఆమె అరచెయ్యిని తన బుగ్గకు

రాసుకున్నాను.

"అనూ, నా వ్యాపారం అటువంటిది. నన్ను చూడ్డానికి వచ్చిన వాళ్ళందరకూ విస్కీ యివ్వాలి. వాళ్ళతో నేనూ తాగాలి. వాళ్ళకు ఐస్ వాటర్ ఇస్తే మర్యాదగా వుండదు!" అన్నాడతను.

లేచి వెళ్ళి ఆమె లుంగీ తెచ్చింది. అతని కోటును, టైని తీసేసింది. పాంటు వదిలి అతను లుంగీ కట్టుకున్నాడు. షర్టుతీసి ఆమెకిచ్చాడు.

అన్నిటినీ బీరువాలో పెట్టి ఆమె వెళ్ళి అతడిపక్కనే కూర్చుంది. బనీను లోపలనుంచి చేయిని పోనిచ్చి అతడి ఛాతీమీద వేళ్ళతో రాస్తూ, కళ్ళలోకి చూసింది.

"డాక్టర్ రామ్మూర్తిని రమ్మన్నా?" అడిగిందామె.

"వద్దు—హోటల్ డాక్టర్ నన్ను చూశాడు. నాకు మందులు రాసిచ్చాడు. అవి నేను కొన్నాను."

"ఆ మాత్రలు వేసుకున్నారా?"

"వేసుకున్నాను. సాయంత్రందాకా రెస్టు తీసుకోమని డాక్టర్ చెప్పాడు."

"అయితే పడుకోండి" అందామె.

కాస్సేపట్లో అతను నిద్రపోయాడు. అనసూయ బీరువా వైపు నడిచింది. తలుపు తెరిచింది. అతడి బ్రీఫ్‌కేసువైపు చూసింది. అతడి బ్రీఫ్‌కేసులో యేముంది?

బటన్ నొక్కి బ్రీఫ్‌కేసు తెర్చి చూసింది. లోపల నిరోధ్ పాకెట్లు ఎన్నో వున్నాయి. ఒక ఆల్బమ్‌మీదకు ఆమె దృష్టి వెళ్ళింది.

ఆల్బమ్ తెర్చి ఆమె చూసింది. ఆల్బమ్‌లో అనేక మంది యువతుల ఫోటోలు వున్నాయి. ఆల్బమ్ పేజీలు తిప్పి అందరి యువతులవైపూ ఆమె చూసింది. ఎవరు

వీళ్ళు? హోటల్ హౌవస్‌తో వీళ్ళకు సంబంధం ఏమిటి?

ఆలోచిస్తూ ఆమె ఆల్బమ్‌ను మళ్ళా చూసింది. కొందరు యువతులు చాలా అందంగా వున్నారు. తన భర్త బ్రీఫ్‌కేసులో యీ ఆల్బమ్, నిరోధ్ పాకెట్లు ఎందుకున్నాయి?

రాజా పరుపు దగ్గరకు ఆమె వెళ్ళింది. కాని అతను గాఢ నిద్రలో వున్నాడు.

ఐదింటికి రాజా నిద్ర లేచాడు. పక్కనున్న ఆమెవైపు నవ్వుతూ చూశాడు.

"అనూ, ఐయామ్ ఆల్‌రైట్" అన్నాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది. ఆమె మొహంలో నవ్వులేదు.

"అనూ, ఏమిటి అలా చూస్తున్నావు?" అడిగాడతను.

"మీ బ్రీఫ్‌కేస్ తెర్చి చూశాను. అందులో నిరోధ్ పాకెట్లు చాలా వున్నాయి. ఎందుకవి?"

అతడు ఆమె చెయ్యి పట్టుకుని నిమిరాడు.

"అనూ, అవన్నీ ఎందుకు చూశావు?"

"చూడకూడదా?" అందామె.

"అలా నేను అనలేదు. అనూ, ప్రభుత్వంలో కుటుంబ నియంత్రణ విషయంలో మా హోటల్ సహకరిస్తోంది. మా హోటల్‌లో వుండే పెళ్ళయిన వాళ్ళకు మేము నిరోధ్ పాకెట్లు యిస్తూ వుంటాం. అవి నచ్చితే వాళ్ళు తర్వాత కొనుక్కుంటారు."

కాస్సేపు ఆమె మాట్లాడలేదు. అతడివైపు అనుమానంతో చూసింది.

"ఆ ఆల్బమ్ ఏమిటి? ఆల్బమ్‌లో ఎంతమంది యువతుల ఫోటోలో వున్నాయి" అందామె.

రాజా తీయగా నవ్వాడు.

"వాళ్ళందరూ మా మోడల్స్. హోటల్ హౌజస్ పబ్లిసిటీకి, గార్మెంట్స్ ఫాక్టరీ దుస్తులకు వాళ్ళను మోడల్స్‌గా మేము వుపయోగిస్తాం" అన్నాడతను.

ఆమె లోలోపల బాధపడింది. ఏదో అనుమానంతో అనేక ప్రశ్నలు ఆమె వేసింది. నవ్వుతూ అతడు జవాబు యిచ్చాడు.

"రాజా, నన్ను క్షమించు!" అందామె.

"ఎందుకు?" ప్రశ్నించాడతను.

"మీ బ్రీఫ్ కేసులో వున్నవాటిని చూసి నేను అనేక విధాల ఆలోచించసాగాను" అందామె.

అతడు ఆమెను ముద్దెట్టుకున్నాడు.

"అనూ, అందుకే నేను అంటాను, నా వ్యాపారంలో వేలు పెట్టొద్దని!"

"ఇటుపైన మీ వ్యాపారానికి దూరంగా వుంటాను" అందామె.

"అలా వుంటే నీకు ఏ సమస్యలూ రావు. నువ్వు హాయిగా వుంటావు" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

అతడామెను తన దగ్గరగా లాక్కున్నాడు. ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. ఆమె ఎర్రటి పెదిమలను ముద్దెట్టుకున్నాడు.

"అనూ, నువ్వు నా ప్రాణం! నీనుంచి ఏదీ నేను దాచను" అన్నాడతను.

# 5

అనసూయ మారువేషంలో హోటల్ హెవన్ రూమ్ నంబరు 20 లో సోఫాలో కూర్చుంది. ఆమె బెల్ నొక్కింది. నౌఖరు లోపలకు వచ్చాడు.

ఆమెవైపు చూశాడు. ఆమె పురుష వేషంలో వుంది. పైజామా, జుబ్బా, వెస్‌కోట్ ధరించింది. సన్నటి మీసాలు. గిరిజాల జుత్తు.

"సార్, మీరు పిల్చారా?" అన్నాడు బాయ్.

"స్కాచ్ ఓల్డు పార్ విస్కీ పట్రా! సోడా అండ్ ఐస్ కావాలి" అందామె.

హోటల్ బాయ్ వెళ్ళిపోయాడు. కాస్సేపట్లో అతడు గదిలోకి వెళ్ళి అన్నీ టేబుల్ మీద పెట్టాడు.

"ఇంకా ఏమైనా కావాలా?" అడిగాడు.

ఆమె నవ్వింది. హోటల్ రిజిస్టర్లో ఆమె పేరు మిష్టర్ సి.పి. సింగ్, జమీందార్ ఆఫ్ ఆరాగా రాయబడింది.

"కావాలి" అందామె.

"ఏం కావాలి సార్" అడిగాడు నౌఖరు.

"మంచి అందమైన పిల్ల" అందామె.

"అతడిని పంపిస్తాను మీ గదికి" అని హోటల్ నౌఖరు వెళ్ళిపోయాడు.

ఆమె సిగరెట్ వెలిగించింది. పొగ పీల్చకుండా బయటకు వదిలేస్తూ కూర్చుంది. నిమిషాలు గడిచిపోయాయి.

పావుగంట తర్వాత అతడు మెల్లిగా ఆమె గదిలోకి వెళ్ళాడు. అతడివైపు ఆమె ఆశ్చర్యంగా చూసింది.

"హోటల్ నౌఖరు మీకు మంచి అమ్మాయి కావాలన్నాడు. ఈ ఆల్బమ్ చూడండి! ఎందరో అందమైన

అమ్మాయిలు వున్నారు!" అన్నాడతను.

అతడివైపు చూస్తూ ఆమె ఉలిక్కిపడింది. అతడు మరెవరో కాదు, ఆమె భర్త రాజా!

తనలో చెలరేగే ఉద్రేకాన్ని అపుకుని ఆమె అతడివైపు నవ్వుతూ చూసింది. ఆల్బమ్‌ని తీసుకుని చూడసాగింది. ఒక ఫోటోవైపు చూపిస్తూ ఆమె అతడికేసి తిరిగింది.

"ఈమె నాకు కావాలి" అందామె.

"ఆమె రేటు వెయ్యి రూపాయలు. మీరు నాకు రెండుకందలు అదనంగా యివ్వాలి" అన్నాడతను.

"ఎంతేనా యిస్తాను" అందామె.

"ఆమె ఎప్పుడు కావాలి?" అడిగాడతను.

"నేను యివాళ కొలంబో వెళుతున్నాను. యెల్లుండి తిరిగివస్తాను. ఎల్లుండి రాత్రి ఆమె కావాలి."

"మీరు డబ్బు చెల్లిస్తే ఎల్లుండి రాత్రి ఆమె మీతో వుంటుంది" అన్నాడతను.

ఆమె బాగ్ తెర్చి పన్నెండు వందలు అతడికి యిచ్చింది.

"కొలంబోనుంచి నేను తిరిగొచ్చేసరికి ఆమె నా గదిలో రెడీగా వుండాలి" అందామె.

"వుంటుంది" అన్నాడతను.

"మీ పేరు ఏమిటి?"

"సంపత్" అన్నాడతను.

"అది మీరు పేరా?" అడిగిందామె.

"కాదు. అదే నా పేరు" అన్నాడతను.

అతడు ఆల్బమ్ తీసుకుని గుమ్మంవైపు వెళ్ళాడు. ఆమె అతడివైపు వడిచింది.

"మిస్టర్ సంపత్!" అందామె.

అతడు ఆమెవైపు చూశాడు.

"ఏదేనా చెప్పాలా?" అన్నాడతను.

"అంతా చెప్పేనుగా! ఆమెను నా గదికి పంపించు, ఎల్లుండి" అందామె అతడివైపు చూస్తూ.

"పంపిస్తాను" అన్నాడతను.

అతను బయటకు వెళ్ళిపోయాడు. ఆమె సోఫాలో బాధతో కూర్చుంది.

ఆమె భర్త సప్లయర్! ఆమె పొరబడి అతడిని పెళ్ళాడింది. అతడు ఏదో పెద్ద వ్యాపారం చేస్తున్నాడని ఆమె అనుకుంది. అంతా అబద్ధం! గది తలుపు మూసి అనసూయ పరుపుమీద ఏడుస్తూ పడిపోయింది.

# 6

ఆమె నిద్రపోతోంది. ఎవరో ఆమెను తట్టి లేపారు. ఆమె లేచి కళ్ళు నులుపుకుని అతడికేసి చూసింది.

"అనూ, ఏమిటప్పుడే పడుకున్నావు?" అన్నాడతను.

"ఎలాగో వుంది" అందామె.

ఆమె ఒళ్ళు ముట్టుకుని చూశాడతను.

"డాక్టర్ రామ్మూర్తికి ఫోన్ చేశావా?"

"రేపటికి తగ్గిపోతుంది. తగ్గకపోతే చూద్దాం" అందామె.

అతడు బట్టలు మార్చుకున్నాడు.

"నేను భోజనంచేసి వస్తాను. నువ్వు విశ్రాంతి తీసుకో" అని అతను ఆమెవైపు చూశాడు.

"భోంచేసి రండి. ఒకవేళ నేను నిద్రపోతే లేపకండి" అందామె.

నవ్వుతూ అతడు కిందకు వెళ్ళిపోయాడు. అరగంట

తర్వాత అతను గదిలోకి వచ్చాడు. ఆమె నిద్రపోలేదు. చూస్తూనే వుంది.

"నిద్రపోలేదా?" అడిగాడతను.

"నిద్ర రావడంలేదు" అందామె.

అతడామె పక్కనే పడుకున్నాడు. ఆమె కళ్ళలోకి చూశాడు.

"అనూ, నువ్వు సరిగ్గా భోజనం చెయ్యలేదని మీ అమ్మగారు అన్నారు."

"ఆకలి లేదు" అందామె క్లుప్తంగా.

ఆమె మీద అతడు చెయ్యి వేశాడు.

"ప్లీస్, నన్ను పడుకోనివ్వండి!" అందామె.

అతడు చెయ్యి తీసేశాడు.

"పడుకో! నేను నీ పక్కనే వుంటాను" అన్నాడతను.

ఆమె కళ్ళు మూసింది. భర్తను గురించే ఆమె ఆలోచిస్తోంది. అతడు ధనవంతుడనీ, ఏదో వ్యాపారం చేస్తున్నాడని భావించి తండ్రి తనను రాజాకిచ్చి పెళ్ళి చేశాడు.

తన అల్లుడు ఆడపిల్లలను తార్చి డబ్బు సంపాదిస్తున్నాడని తెలిస్తే ఆమె తండ్రి ఆత్మహత్య చేసుకుంటాడేమో!

తెలియకుండానే ఆమెకు నిద్రపట్టేసింది. ఆమె గాఢ నిద్రలో వుందని గ్రహించి అతడు లైట్‌ను తీసేసి జీరో వాట్ బల్బు స్విచ్‌ని నొక్కాడు.

పక్కకు తిరిగి అతడు పడుకున్నాడు. కాని నిద్ర రావడంలేదు. శారద అతడికి జ్ఞప్తికొస్తోంది. ఆమె

తనతో ఘోరంగా పోట్లాడింది. శారద!

జరిగినదంతా అతడి మెదడులో ఫిలిమ్ రీల్సులా తిరుగుతోంది.

శారద విజయవాడ పిల్ల. ఎవరో ఆమెను ఎత్తుకొచ్చి పదివేలకు తనకు అమ్మేశాడు.

రాజా ఆమె గదిలోకి వెళ్ళాడు. అతడిని చూసి ఆమె లేచి నిలబడింది. భయంతో అతడివైపు చూసింది.

దగ్గరగా వెళ్ళి ఆమె చెయ్యిని పట్టుకున్నాడతను. చెయ్యిని వెనక్కు లాక్కుని ఆమె దూరంగా జరిగింది.

"నేను చెప్పినట్లు చేస్తే నీకు ఏ ప్రమాదమూ రాదు!" అన్నాడతను.

"నీ చేతుల్లో పడ్డంకంటె పెద్ద ప్రమాదం ఏముంది?" అందామె వ్యంగ్యంగా.

అమాంతంగా అతడామెవైపు దూకాడు. పొడుగాటి ఆమె జడను పట్టుకున్నాడు. ఆమె అతడి చెయ్యిని కొరికింది. కోపంగా అతడామె చంపమీద కొట్టాడు. కాలితో అతడిని తన్ని, ఆమె గదిలో మరోవైపుకు పరుగెత్తింది.

కిందపడిన అతను లేచాడు. ఆమె తలుపును తెరవడానికి ప్రయత్నిస్తోంది. తను గంభీరంగా నవ్వాడు.

"లోపలనుంచి తాళం వేశాను. తలుపు తెర్చి నువ్వు బయటకు పోలేవు!" అర్చాడతను.

ఆమె అతడివైపు భయంతో చూసింది. "నన్నెందుకిలా చంపుకతింటావు! నన్ను పోనీ! నీకు అక్కాచెల్లెళ్ళు లేరూ?" అర్చిందామె.

"నిన్ను వదిలేయడానికి పదివేలు పోనివ్వలేదు" అన్నాడతను.

ఆమె అతడివైపు ఏడుస్తూ చూసింది.

"నాన్న బాగా డబ్బున్నవాడు. నీకు పదివేలకంటె ఎక్కువ నేను యిప్పిస్తాను. నా క్లాస్‌మేట్ చేసిన ద్రోహం మూలంగా నేను వాళ్ళకు చిక్కాను. నాకేదో మత్తు మందిచ్చి వాళ్ళు మద్రాసు తీసుకొచ్చి నీ కమ్మే శారు. నాలాంటి అమాయకురాలైన ఒక యువతి జీవి తాన్ని నాశనం చేయకు!" అందామె.

రాజా ఆమెవైపు చూశాడు. ఆమె వయస్సు పదహారు దాటి వుండొచ్చు. చాలా అందంగా వుంది. చదువుకున్న పిల్ల. ఆమె కొన్ని లక్షలు తనకు గడించి పెడుతుంది. కాని ఆమెను లొంగదీయాలి! తన తో వమ్మట ఆమె వెళ్ళేటట్టు చూడాలి!

అతడు నవ్వు నటిస్తూ ఆమెవైపు చూశాడు.

"నిన్ను వదిలేస్తానులే!" అన్నాడు.

"నిజంగా!" అందామె.

"నిన్ను వదిలేముందు కొన్ని విషయాలు నీతో మాట్లాడాలి" అన్నాడతను.

"చెప్పు!"

"ఆ పరుపుమీద కూర్చుని మాట్లాడుదాం."

"కావలిస్తే నువ్వు కూర్చో! నేను నించునే మాట్లాడగలను" అందామె.

ఆమె మాటలు వింటూంటే అతడిలో కోపం రగులు కుంది. ఆమెవైపు వెళ్ళాడతను. ఆమె మంచం చుట్టూ పరుగెడ్తోంది. వెనకనే అతడు వేటగాడిలా కదులుతున్నాడు.

అమాంతంగా మంచంమీదనుంచి దూకి అతడామెను పట్టుకున్నాడు. ఆమె అతడి కళ్ళలోకి ఉమ్మింది. అతడు

కళ్ళు మూశాడు. అతడి నాత్షణంలో పక్కన తోసి ఆమె దూరంగా పోయింది.

అతడు కోపంగా ఆమెవేపు చూశాడు.

"నీకు బుద్ధి చెప్తాను" అని తాళంతీసి తలుపు తెర్చాడతను.

బుచ్చి, పిచ్చి యిద్దరూ నిక్కర్లలో వున్నారు. అడవి పందుల్లా వున్నారు. వాళ్ళను చూడగానే ఆమె గుండె దడదడలాడింది.

"ఆమెను పట్టుకుని తాళ్ళతో కట్టేయండి. తర్వాత నేను వస్తాను" అని అతడు బయటకు నడిచాడు.

కునికిపాట్లు పడ్తూ రాజా ఆవులించాడు. పక్కన పడుకున్న భార్యవంక చూశాడు. ఆమె హాయిగా నిద్రపోతోంది.

అతడామె దగ్గరగా జరిగాడు. ఆమె ఒంటిమీద చెయ్యి వేశాడు.

కాస్సేపట్లో అతడికి నిద్రపట్టేసింది.

# 7

ఇరవై నంబరు గదిలో వున్న అనసూయ తలుపువైపు చూసి "కమిన్!" అంది.

తలుపు తోసుకుని ఒకమ్మాయి, వెనకనే రాజా లోపలకొచ్చారు. అతడా అమ్మాయిని కూర్చోమని మారు వేషంలో వున్న అనసూయ దగ్గరగా వెళ్ళాడు.

"జమీందార్ సాబ్, మీరు అల్బమ్ చూసి ఎన్నుకున్న యువతి అనారోగ్యంగా వుంది. అందువలన అంతకంటె అందమైన యువతిని తీసుకొచ్చాను. ఆమెకేసి చూడండి!"

అనసూయ సోఫాలో కూర్చున్న పిల్లవైపు ఆత్రంగా

చూసి పక్కనున్న రాజావంక చూసి కన్ను గీటింది.

"నాకు నచ్చింది, సంపత్!" అందామె.

"ఈమె చదువుకున్న పిల్ల. వర్జిన్! మీకు స్వర్గం చూపిస్తుంది. ఈమెకోసం మీరు మరో ఐదువందలు యివ్వాలి" అన్నాడతను.

బాగ్ తెర్చి అనసూయ ఆరువంద రూపాయలనోట్లు అతడికిచ్చింది.

"ఐదువందలు ఆమెకు, వంద నీకు!" అందామె.

"పొద్దుట నేనొచ్చి తీసుకు వెళ్ళిందాకా ఆమెను యిక్కడే వుంచండి."

"నా చేతుల్లోంచి కదలనివ్వను!" అందామె.

"జమిందార్ సాబ్, వెళ్ళొస్తాను."

అతడు వెళ్ళిపోయాడు. ఆమె టైమ్ చూసింది. ఏడు కావస్తోంది. అనసూయ మెల్లిగా వెళ్ళి తలుపు మూసి లాక్ చేసింది. నవ్వుతూ సోఫాలో కూర్చున్న పిల్లవైపు చూసింది.

"నీ పేరు, మైడియర్?" అడిగిందామె.

"శారద" అందా యువతి.

"రా, పడుకుందాం" అని అనసూయ పరుపువైపు వెళ్ళి కూర్చుంది.

శారద లేవలేదు. ఏడుస్తూ కూర్చుంది.

"ఎందుకు ఏడుస్తున్నావు?"

చేతులు జోడించి శారద ఆమెకు నమస్కరించింది.

"మీరు పెద్ద జమీందారని విన్నాను. నన్ను రక్షించండి!" అంది శారద.

"నీకే ప్రమాదమూ రాదు. నా చెల్లెలుగా భావించి నిన్ను కాపాడ్తాను. నీ కథంతా నాకు చెప్పు" అంది

అనసూయ.

పరుపు మీద కూర్చున్న వ్యక్తివైపు శారద ఆశ్చర్యంగా చూసింది. ధైర్యంగా వెళ్ళి అనసూయ పక్కనే కూర్చుంది.

కన్నీళ్ళతో జరిగిందంతా చెప్పింది.

"నేను సంపత్ చేతుల్లో యిరుక్కున్నాను. అతడు కిరాతకుడు. అతడు పెట్టే బాధ భరించలేక ఏం చెప్పినా చేస్తానన్నాను. మీ గురించి చెప్పి అతడు నన్ను ఇక్కడకు తీసుకొచ్చాడు. నన్ను మా విజయవాడ పోనీయండి. ఈ జీవితంలో మిమ్మల్ని మర్చిపోను" అంది శారద.

"నిన్ను మీ వూరు పంపుతాను. సంపత్ నిన్ను ఏ యింట్లో వుంచుతున్నాడో తెలుసా?"

"అడ్రెసు తెలియదు. కాని ఆ యిల్లు చూపించగలను" అంది శారద.

"పద, పోదాం" అంది అనసూయ.

ఇద్దరూ బయటకు నడిచారు. రిసెప్షన్ గుమస్తాకి గది తాళంచెవిని అనసూయ ఇచ్చింది. బయటనున్న టాక్సీలో వాళ్ళు ఎక్కారు.

"శారదా, ఎలా వెళ్ళాలో నువ్వు డ్రయివర్ కి చెప్పు" అంది అనసూయ.

హోటల్ గేటు దాటగానే ఎడంవైపుకు తిరగమంది శారద. ఆమె చెప్పినట్లు డ్రయివర్ టాక్సీని పోనిస్తున్నాడు.

నాలుగు రోడ్ల జంక్షన్ లో టాక్సీ ఆగింది. యెలా వెళ్ళాలో చెప్పలేక శారద సతమతమౌతోంది.

"ఎడంవైపుకి!" అందామె చివరకు.

నిమిషాలు గడిచిపోతున్నాయి. ఒక యింటివైపు

చూపిస్తూ శారద "అదే యిల్లు!" అని అరిచింది.

టాక్సీ ఆగింది. గేటు మూసి వుంది.

"రాజా గార్మెంట్స్ కంపెనీ" అనే బోర్డువైపు అనసూయ విచిత్రంగా చూసింది.

"సెంట్రల్ స్టేషన్‌కి పద!" అంది అనసూయ.

టాక్సీ సెంట్రల్ స్టేషన్ వైపు వెళ్తోంది.

"ఆ యింట్లో యువతులు చాలామంది వున్నారా?"

"చాలామంది వున్నారు."

టాక్సీ ఆగింది. ఇద్దరూ దిగారు. అనసూయ డబ్బు చెల్లించింది.

సెంట్రల్ స్టేషన్ ప్రయాణికులతో కిటకిటలాడ్తోంది. టికట్లమ్మే చోటకు వెళ్ళారు వాళ్ళు.

విజయవాడకు అనసూయ టికెట్ కొంది. "రిజర్వేషన్ లేదు. జనరల్ కంపార్టుమెంట్‌లో ఎలాగో నువ్వు సర్దుకోవాలి" అంది అనసూయ.

"ఈ యమకూపంలోంచి బయటపడ్డానికి ట్రెయిన్ పైన కూర్చునైనా వెళ్ళగలను" అంది శారద.

అనసూయ ఆమెకు వందరూపాయలు యిచ్చింది. కొన్న టికెట్ యిచ్చింది.

"ఇంతెందుకు, సార్?" అడిగింది శారద.

"వుంచుకో! కలకత్తా మెయిల్ పదింపావుకి బయలేరుతుంది. అంతవరకూ నేనిక్కడ వుండలేను. జాగ్రత్తగా వెళ్ళు" అంది అనసూయ.

శారద చెయ్యి పట్టుకుని ఆమె కళ్ళలోకి చూసింది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు కారాయి.

"మీరు దేవుడులాంటివారు. నన్ను నా ఊరుకు పంపిస్తున్నారు. మిమ్మల్ని ఎన్ని జన్మలెత్తినా మరువను"

అందామె.

"ధైర్యంగా వెళ్ళు శారదా! ముళ్ళూ, గులాబీలూ యీ లోకంలో పక్కపక్కనే వుంటూ వుంటాయి" అంది అనసూయ.

శారదకు బైబై చెప్పి అనసూయ వెనక్కి తిరిగింది. పరుగెత్తూ శారద వచ్చింది.

"సార్, మీ పేరూ, అడ్రెసూ చెప్పండి!"

అనసూయ ఆమెవైపు సూటిగా చూసింది.

"నేను దేవుడిలాంటివాడినని నువ్వు అన్నావు, జ్ఞాపకముందా? దేవుడికి పేరూ, అడ్రెసూ వుండవు" అని అనసూయ గబగబా వెళ్ళిపోయింది.

అదృశ్యమైనదాకా ఆ ఆకారంవైపే చూస్తూ వుండిపోయింది శారద.

క్షణకాలం నిశ్శబ్దంగా నిలబడి కళ్ళు మూసుకుంది. మెల్లిగా ప్లాట్‌ఫామ్‌వైపు అడుగులు వేసింది.

## 8

అనసూయ నిద్రలేచేసరికి అతడు యింట్లో లేడు.

మొహం కడుక్కుని కాఫీ తాగుతూంటే టెలిఫోన్ మ్రోగింది.

"హలో" అందామె.

"అనూ, యివాళ భోజనానికి వస్తానని నీతో రాత్రి చెప్పాను. కాని రావడంలేదు" అన్నాడతను.

"నేను లేచే ముందే వెళ్ళిపోయారు. ఏమైంది?" అడిగిందామె.

"ప్రోబ్లమ్స్" అన్నాడు రాజా.

"ఏమిటవి?"

"జమీందార్ ఆఫ్ ఆరా మిస్టర్ సింగ్ మా

హోటల్లో గదితీసుకుని మాయమయిపోయాడు."

"అతడు మీ హోటల్ కి ఏదేనా డబ్బివాలా?" అడిగిందామె.

"బాకీ లేదులే! అడ్వాన్స్‌గా ముందే యిచ్చాడు."

"అయితే అదంత సమస్యకాదు. మీకు చెప్పకుండా తన ఊరు పోయి వుండొచ్చు."

"అతడు మాకు ఫాల్స్ అడ్రెసు యిచ్చాడు. అతడలా ఎందుకిచ్చాడా అని ఆలోచిస్తున్నాం."

"మీ హోటల్ కి నష్టం రానప్పుడు అతడిని గురించి బుర్ర పగలగొట్టుకోకండి" ఆమె సలహా యిచ్చింది.

"చూద్దాం, బైబై" అని అతడు రిసీవర్ పెట్టేశాడు.

తనలో తను నవ్వుకుంటూ ఆమె రిసీవర్ని పెట్టేసింది.

స్నానంచేసి బ్రేక్‌ఫాస్టు సేవించి ఆమె తన ఫియట్ కారులో బయలుదేరింది. కారును మైలాపూర్ పోనిచ్చింది.

భారత్ డిటెక్టివ్ ఏజెన్సీ ముందు కారాపి, దిగి మెట్లెక్కి పైకి వెళ్ళింది. మేనేజర్ని కల్సుకుంది.

అతడామెవైపు నవ్వుతూ చూశాడు.

"ఏం కావాలో చెప్పండి!" అన్నాడతను.

"బలంగా వున్న యిద్దరు పురుషులు నాకు కావాలి. ఒకరోజు పూర్తిగా వాళ్ళు నా కోసం పనిచేస్తారు. పని ఏం చెయ్యాలో, ఎలా చెయ్యాలో నేను వాళ్ళకు చెప్తుకుంటాను" అందామె.

"గుడ్. మీరు ఐదువందలు యివ్వాలి. ఇద్దర్ని మేం సప్లయిచేస్తాం."

ఆమె ఐదువంద రూపాయిల నోట్లు టేబుల్‌మీద పెట్టింది.

"వాళ్ళు ఎప్పుడు కావాలి?"

"నేను ఫోన్ చేస్తాను. నేను రమ్మన్నచోటకొచ్చి వాళ్ళు నన్ను కల్సుకోవాలి."

"అలాగే. మీ పేరూ అడ్రేసూ చెప్పండి."

"అవన్నీ అడక్కండి!"

"మరో ఐదువందలివ్వాలి. అటుపైన ఏమీ అడగం. అంతా మీ యిష్టం."

ఆమె మరో ఐదు నోట్లు యిచ్చింది. బైబై చెప్పి ఆమె హుషారుగా బయటకు నడిచింది.

## 9

బుచ్చి తలుపు తెర్చాడు. ఆమెను యిరువైపులా పుట్టుకుని వాళ్ళు లోపలకొచ్చారు.

"ఈ అమ్మాయి అమ్మకానికుంది" అన్నాడు పైడిరాజు.

"ఎంత?" బుచ్చి అడిగాడు.

"పదిహేనువేలు" అన్నాడు కూనయ్య.

"ఇంతకంటె పెద్ద అందగత్తెలు తక్కువకు వస్తున్నారు" అన్నాడు పిచ్చి.

"కావలిస్తే కొనండి, వద్దంటే పోతాం" అన్నాడు పైడిరాజు.

"సంపత్ లేరు. దీన్ని యిక్కడొదిలి మళ్ళా రండి" అన్నాడు బుచ్చి.

ఆమె మొహంలో భయం గోచరిస్తోంది.

"పదరా పోదాం" అన్నాడు కూనయ్య.

"ఆగండి" అని బుచ్చి పిచ్చి లోపలకు వెళ్ళారు.

"పిల్ల బాగుంది. ఫోన్ చేసి అడుగుదాం" అన్నాడు బుచ్చి.

"నువ్వే ఫోన్ చేయి!" అన్నాడు పిచ్చి.

బుచ్చి రిసీవరెత్తి నంబరు తిప్పాడు. ఆ నంబరు బయట వాళ్ళకు తెలియదు.

"హలో, సంపత్!" అందో కంఠం.

"ఒకమ్మాయిని యిద్దరు కొత్తోళ్ళు తెచ్చారు. పదిహేను వేలు కావాలిట" అన్నాడు బుచ్చి.

"పిల్ల ఎలా వుంది?"

"రంభలా వుంది సార్. బాగా డబ్బు చేసుకోవచ్చు."

"పదివేలకి సేకొనండి. కాష్ బాక్సులో డబ్బు వుంటుంది."

"అలాగే సార్."

బుచ్చి రిసీవర్ని పెట్టేశాడు. ఇద్దరూ బయట గదిలోకొచ్చారు. ఆ యువతివైపు బుచ్చి పరీక్షగా చూశాడు. ఒంటిమీద నగలు లేవు. కాని ఆమె ఎంతో అందంగా వుంది.

"పదిహేనువేలనుంచి దిగుతారా?"

"ఎంతిస్తారో చెప్పండి. బేరం ఆడ్తూ కూర్చోడానికి మాకు టైములేదు."

"పదివేలు. పైసా ఎక్కువియ్యం" అన్నాడు బుచ్చి.

"త్వొందరగా డబ్బు ఫారేయండి. పోవాలి" అన్నాడు పెడిరాజు.

బుచ్చి లోపలకు వెళ్ళి కాస్సేపట్లో తిరిగి వచ్చి డబ్బు యిచ్చాడు. పెడిరాజు డబ్బును లెఖటి దాచుకున్నాడు. వాళ్ళిద్దరూ బయటకు వెళ్ళిపోయారు.

బుచ్చి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

"పద లోపలకు!" అర్చాడు.

"నన్ను వదులు. నా అంతట నేను వస్తాను" అందామె.

బుచ్చి ఆమెను వదిలేశాడు.

"నా మాట వింటే నీకు దెబ్బలు తగలవు!" అన్నాడు బుచ్చి.

ఆమెను ఒక గదిలోకి తీసుకెళ్ళాడు. ఆమెను పట్టుకుని దగ్గరగా లాగబోయాడు. ఆమె విదిలించుకుని దూరంగా వెళ్ళింది.

"మీ యజమాని సంపత్ కి యిదంతా చెప్పనా?" అడిగిందామె.

"ఆయనతో చెప్పొద్దు, పిల్లా. నిన్ను ఏమీ చెయ్యనులే. ఆయన కోపిష్టి. నా తోలు ఒల్చేస్తాడు" అన్నాడు బుచ్చి.

ఆమె కుర్చీలో కూర్చుంది. గదిలో లైటు వెల్గుతోంది. ఫాన్ తిరుగుతోంది.

"నువ్వు సుఖంగా విశ్రాంతి తీసుకో! మా యజమాని వచ్చి నీతో మాట్లాడతాడు" అన్నాడతను.

"నాకు బాగా ఆకలిగా వుంది. ఏదేనా తినాలి. వాళ్ళిద్దరూ నన్ను ఆకల్తో మాడ్చేశారు" అందామె.

బుచ్చి బయటకెళ్ళాడు. ఒక ప్లేటులో కేక్స్, బిస్కట్లు తెచ్చి ఆమెకిచ్చాడు. గ్లాసులో నీళ్ళుపోసి ఆమె పక్కనే పెట్టాడు.

"పిల్లా, నీ పేరు?"

"సంగమిత్ర" అందామె.

బుచ్చి బయటకు వెళ్ళాడు. తలుపు బయటనుంచి మూయబడింది.

# 10

వీర్రాజు, అతడి భార్య సత్యవతి ముందు వరండా మీద కూర్చుని గేటువైపు చూస్తున్నారు. టైమ్ పది

దాటింది.

"సాయంత్రం వెళ్ళింది అమ్మాయి. ఇంత సేపు ఏం చేస్తోందో!" అన్నాడు వీర్రాజు.

"అదే బెంగగా వుంది" అంది భార్య.

నిమిషాలు గంటలై దొర్లిపోతున్నాయి. పన్నెండు దాటింది. గేటులోకి తిరిగివస్తూన్న కారువైపు వాళ్ళు సంతోషంగా చూశారు.

మెర్సిడిస్ కారొచ్చి వాళ్ళముందు ఆగింది. రాజా కిందకు దిగి వాళ్ళవైపు చూశాడు.

"ఏమిటిక్కడున్నారు?" అడిగాడు.

"సాయంత్రం కారులో వెళ్ళిన అమ్మాయి యింకా తిరిగిరాలేదు!" అన్నాడు వీర్రాజు.

"ఏమైందో!" అంది సత్యవతి.

"మీరు గాభరాపడకండి. నేను అంతా చూస్తాను" అని అతడు లోపలకు వెళ్ళాడు.

పడగ్గదిలోకి వెళ్ళి చూశాడు ఆమె చీటీకోసం. ఎక్కడికేనా వెళ్ళి ఆలస్యంగా వస్తాననుకుంటే ఆమె చీటీరాసి తలగడక్రింద పెడ్తూ వుంటుంది. కాని ఎక్కడా ఆమె చీటీ పెట్టలేదు.

అనసూయ ఏమైంది? ఎక్కడికెళ్ళింది?

అతడు చిరాకుగా కిందకు పరుగెత్తాడు. ఎన్నో అడ్డంకులు తన వ్యాపారానికి యీ మధ్య యేర్పడుతున్నాయి.

తను పదివేలిచ్చి కొన్న శారద మాయమైపోయింది. ఆమె ఏమైందో తెలియదు. ఆరో జమీందార్ సింగ్‌తో ఆమె బయటకు వెళ్ళినట్లు కొంతమంది చూశారు. కాని సింగ్ యేమైనాడో యెవ్వరికీ తెలియదు. రిసెప్షన్

గుమస్తాకు గది తాళం ఇచ్చి సింగ్ వెళ్ళిపోయాడు. శారద అందానికి తానిసై సింగ్ ఆమెతో ఎక్కడికో వెళ్ళిపోయి వుండాలి!

పోలీసులదాకా వెళ్ళడం అతడికిష్టంలేదు. తానే పరిశోధన సాగిస్తున్నాడు.

కింద హాల్లో వున్న వీర్రాజు, సత్యవతి అతడివైపు భయంలో చూశారు.

"మీరు వెళ్ళి పడుకోండి. అనూ ఏమైందో నేను వెళ్ళి చూస్తాను" అని అతడు బయటకు పరుగెత్తాడు.

కారులో కూర్చుని తలుపు మూశాడు. డ్రయివర్ కారును పోనిచ్చాడు.

"ఎక్కడికి సార్?" అడిగాడు డ్రయివర్.

"పట్నం రోడ్డమ్మట పోనీ!" అన్నాడతను.

కారు వెళ్తోంది. రాజా ఆమె ఫియట్ కారుకోసం చూస్తున్నాడు.

రెండు గంటలుపైన కారు తిరుగుతూనే వుంది. కాని ఎక్కడా ఫియట్ కనబడలేదు.

అతడు టైమ్ చూశాడు. రెండున్నర కావస్తోంది. "బీచ్ కి పద!" అన్నాడతను.

కారు బీచ్ వైపు దూసుకుపోయింది. బీచ్ లోపల రోడ్డుకి తిరిగి వెళ్తోంది.

"డ్రయివర్, ఆ ఫియట్ పక్కనే ఆపు!" అరిచాడతను.

మెర్సిడిస్ కారు ఆగింది. అది అనసూయ ఫియట్ కారే! అతడు కిందకు దూకాడు. పరుగెత్తుకెళ్ళి ఫియట్ కారులోకి చూశాడు.

లోపల యెవ్వరూ లేరు. కారు కదలక, దాన్ని

ఇక్కడ వదిలేసి ఏ టాక్సీలోనో ఇంటికి వెళ్ళిపోయిందా?

అతడు ఫియట్ కారులో కూర్చున్నాడు. ఇగ్నిషన్ కీ కారులోనే వుంది. కీ తిప్పాడు కారు యింజన్ వెంటనే స్టార్ట్ యింది.

లోపల లైట్ ఆన్ చేసి అంతా చూశాడు. ఆమె వస్తువులేవీ కార్లో లేవు. అతడు డ్రయివర్ని పిల్చాడు.

"డ్రయివర్, నువ్వు ఆ కారులో ఇంటికిపో! నేను తర్వాత వస్తాను" అని ఫియట్ కారును పోనిచ్చాడతను.

అనసూయకు ఏదో ప్రమాదం సంభవించింది. సందేహం లేదు! అతడి గుండె దడదడలాడింది.

ఈ సమయంలో విస్కీ సేవించాలి. విస్కీ సేవిస్తే గాని తను బతకలేడు. అతడు కారును వేగంగా రాజా గార్మెంట్స్ కంపెనీవైపు పోనిచ్చాడు.

అతడిని చూడగానే గూర్ఖా గేటు తెర్చి శల్యూట్ చేశాడు. అతడు కారును కాంపౌండులోకి పోనిచ్చి ఆపాడు. కిందకు దిగి తలుపును తట్టాడు.

టైమ్ మూడు దాటింది. బుచ్చి కళ్ళు నులుపుకుంటూ తలుపు తెర్చాడు. అతడి చంపమీద రాజా తటాలున కొట్టాడు.

"తలుపు తీయడానికి యింత ఆలస్యమా!" అర్చాడతను.

అనసూయ కనిపించని ఈ లోకంలో ఎవర్ని చూసినా తన్నాలనిపిస్తోందతనికి!

అతడు తన గదిలోకి వెళ్ళి కుషన్డ్ కుర్చీలో కూర్చున్నాడు. బుచ్చి గదిలోకొచ్చాడు.

"స్కాచ్ విస్కీ, సోడా, ఐస్ క్యూబ్స్" అన్నాడతను.

క్షణంలో అన్నీ టేబుల్ మీద వున్నాయి. గ్లాసులో విస్కీ పోసి, సోడా కలిపి, ఐస్ క్యూబ్స్ పడేసి బుచ్చి అతడికి యిచ్చాడు. అతడు గడగడ తాగేశాడు.

నాలుగు పెగ్స్ తాగాక అతడి గుండె దడ తగ్గింది. బుచ్చి మళ్ళీ గ్లాసును అందించాడు. రాజా వేగంగా తాగేసి సిగరెట్ వెలిగించాడు.

"ఆ పిల్లను కొన్నారా?" అడిగాడు రాజా.

"పదివేలిచ్చి కొన్నాం, సార్" అన్నాడు బుచ్చి.

"ఆమె ఎక్కడుంది?"

"రూమ్ నంబరు 25లో. ఆమె పేరు సంగమిత్ర. ఇనపకడ్డీలాంటి యువతి. వంచడానికి మనం శ్రమపడాలి" అన్నాడు బుచ్చి.

"ఇనపకడ్డీలను వంచడం నాకు సరదా. ఇంకా విస్కీ పోయి!"

విస్కీ బాగా తాగి రాజా లేచాడు. ఇరవై ఐదు గది వైపు నడిచాడు. సంగమిత్ర! ఆమె తోలు ఒల్చేసి తన కాళ్ళముందు పడేటట్లు తను చూడాలి!

అతడు తలుపు తెర్చి లోపలకు వెళ్ళాడు. ఆమె పరుపుమీద పడుకుని నిద్రపోతోంది. ఆమె అటువైపుకు తిరిగి పడుకుంది!

అతడు మంచం పక్కనే నిలబడ్డాడు. ఆమె జడను పట్టుకుని బలంగా లాగాడతను. ఆమె లేచి కూర్చుంది. అతడివంక చూసింది. అతడు ఆమె జడను వదిలేశాడు. కన్నీళ్ళతో ఆమె అతడి చెయ్యి పట్టుకుంది.

"మీరు యిక్కడికెలా వచ్చారు?" అందామె.

"అనూ, గట్టిగా మాట్లాడకు! నిన్ను రక్షించడానికి నేనిక్కడికొచ్చాను. నిన్ను యిక్కడ అమ్మినట్లు నేను

కనుక్కొని తెగించి ఇద్దరితో పోట్లాడి లోపలకొచ్చాను. మనం పోదాం పద!" అన్నాడతను.

ఆమె కిందకు దూకింది.

"నువ్వు యిక్కడే వుండు. వాళ్ళు ఎలా వున్నారో నేను చూసి వస్తాను" అని అతడు బయటకు వెళ్ళాడు.

కాస్సేపట్లో అతడు తిరిగి వచ్చాడు.

"వాళ్ళు లేచారు. వాళ్ళతో యుద్ధంచేసి మనం బయటపడాలి, ఇక్కడుంటే ప్రమాదం" అన్నాడు.

"పదండి" అందామె.

ఇద్దరూ బయటకు నడిచారు. బుచ్చి వాళ్ళకు అడ్డు పడ్డాడు. రాజా అతడిని కాల్తో తన్నాడు. అతడు దూరంగా నేలమీద పడ్డాడు.

ఇద్దరూ పరుగెత్తారు. ముందు గదిలో పిచ్చి అతడిని ఎదిరించాడు. రాజా అతడి చంపమీద కొట్టాడు. పిచ్చి నేలమీద పడ్డాడు.

ఆమె చేయి పట్టుకుని రాజా బయటకు పరుగెత్తాడు. ఫియట్ కారులో యిద్దరూ కూర్చున్నారు.

అతడు కారును గేటువైపు పోనిచ్చాడు. గూర్ఖా గేటు తెర్చి అతడికి శల్యూట్ చేశాడు.

అతడు కారును బయటకు పోనిచ్చాడు.

"బతికాం!" అన్నాడతను.

"వాళ్ళిద్దరిలా గూర్ఖా మనల్ని ఆపనందుకు మనం సంతోషించాలి. గూర్ఖా మీకు శల్యూట్ కూడా చేశాడు" అందామె.

"నన్ను చూసి గూర్ఖా మరెవరో అనుకుని పొరబడి వుంటాడు!" అన్నాడతను.

"గూర్ఖా మిమ్మల్ని లోపలకు రానిచ్చాడుగా, అందుకే పోనిచ్చాడు" అందామె.

రాజా మాట్లాడలేదు. వేగంగా కారును యింటివైపు పోనిచ్చాడు. టైమ్ నాలుగు కావస్తోంది.

ఇంటిముందు కారు ఆపి, యిద్దరూ దిగారు. వీర్రాజు, సత్యవతి పరుగెత్తుకొచ్చారు.

"ఏమైందమ్మా?" అడిగాడు తండ్రి.

ఆమె నవ్వుతూ రాజావంక చూసింది.

"ఏమీ అవలేదు, నాన్నా! కారు కదల్లేదు. బీచ్‌లోనే వుండిపోయాను. ఆయనొచ్చి తీసుకొచ్చారు" అంది అనసూయ.

"రండి, భోజనాలు చేద్దురుగాని" అంది సత్యవతి.

"ఇప్పుడు భోజనం ఏమిటమ్మా!" అంది కూతురు.

"నాకు ఆకలిగా వుంది" అన్నాడు రాజా.

"పదండి" అంది అనసూయ.

భోజనాలు ముగించి యిద్దరూ, పైకి వెళ్ళారు. పరుపు మీద అనసూయ పడుకుంది. పక్కనే పడుకుని ఆమె మీద చెయ్యి వేశాడతను.

ఆమె అతడివైపు అసహ్యంతో చూసింది.

"మిస్టర్ సంపత్, నన్ను ముట్టుకోకండి! నామీద చెయ్యి వెయ్యకండి!" అర్చిందామె.

అతడు తృళ్ళిపడ్డాడు.

# 11

ఆమెవైపు సూటిగా చూశాడు.

"అనూ, సంపత్ ఎవరు?"

"మీరే!" అందామె.

"అనూ, నీ మెదడు పాడై వుంటుంది. నేను సంపత్

కాదు, నీ రాజాని.

ఇద్దరూ లేచి కూర్చున్నారు. ఏడుస్తూన్న కళ్ళతో ఆమె అతడివైపు చూసింది.

"మీరు మా పల్లెటూరికి వచ్చారు. నన్ను పెళ్ళాడ్తా నన్నారు. మీ డబ్బూ అదీచూసి, మీరేదో గొప్ప వ్యాపారం చేస్తున్నారని భావిస్తూ నాన్న మన పెళ్ళికి ఒప్పుకున్నారు. నిజం తెలిస్తే నాన్న తల దించుకుని, గుండెలు బాదుకుని ఏడ్చేవారు!" అందామె.

"ఏమిటి నువ్వనేది?"

"ఏ వ్యాపారంచేసి మీరు ఈ లక్షలు గడిస్తున్నారో ఆలోచించండి! నన్ను ఎత్తుకుపోయి అమ్మేసినట్లే అనేక మంది యువతులను ఎత్తుకొచ్చి మీరు నడిపే ఆ వ్యభిచార గృహానికి అమ్మేస్తున్నారు. అమాయకులైన ఆడపిల్లల్ని కొని, వాళ్ళను హింసించి, లొంగదీసి మీరు మీ వ్యాపారంకోసం వుపయోగిస్తున్నారు. మీరు అనుభవించే డబ్బు అనేకమంది కన్నీళ్ళలోంచి వెలువడే పాపిష్టి సొత్తు!" అర్చిందామె.

"అనూ, లేనిపోనివి వూహించుకుని నన్ను అవమాన పరుస్తున్నావు!" గద్దించాడతను.

ఆమె వ్యంగ్యంగా నవ్వింది.

"మాయమైన ఆరా జమీందార్ సింగ్ నేనే! మారు వేషంలో హోటల్ హెవన్‌లో గది తీసుకుని మీకు 1800 రూపాయలు యిచ్చాను. ఆ అమాయకురాలైన శారదను నేనే విజయవాడకు పంపేశాను. మీ నిజరూపం ఈ కళ్ళతో చూశాను! నేను పూజించే భర్త ఇటువంటి మట్టిబొమ్మని గుండెలు బాదుకుని ఏడ్చాను" అందామె.

అతడు మాట్లాడలేదు. వెక్కి వెక్కి యేడుస్తూ వుండి

పోయాడు. కొంతసేపయ్యాక కన్నీళ్ళతో ఆమెకేసి చూశాడు.

"అనూ, నా కథ చెప్తాను, విను. మా నాన్నకు పన్నెండుగురు పిల్లలు. డబ్బు లేదు. పెట్టింది తిని మేం బతికేవాళ్ళం. ఆ జీవితంతో విసుగెత్తి నేను మద్రాసుకు పారిపోయాను. అప్పుడు నా వయస్సు పధ్నాలుగు దాటి వుండదు.

"సామానులు మోసి కూలీ డబ్బుల్తో జీవించేవాడిని. పరశురామ్ అనే అతడితో నాకు పరిచయమైంది. కూమ్ నది ఒడ్డున ఒక పాకలో వుండేవాడతను. నేనూ అక్కడకు మారిపోయాను.

"నాటు సారా తాగినవాళ్ళు ఆ పాకలోకి వచ్చి వాళ్ళ కామాన్ని తీర్చుకునేవారు. ముగ్గురు యువతులు అక్కడ వుండేవారు. పరశురామ్‌కి నేను సహాయపడే వాడిని. తిండి పెట్టి అతడు నాకు జీతం యిచ్చేవాడు.

"కొంత కాలం తర్వాత అతడు మరణించాడు. అతడి వ్యాపారాన్ని నేను నడిపేవాడిని. ఆ పాకలోకి ఒకసారి తారాచంద్ వచ్చాడు. ఇద్దరం మిత్రులమయ్యాం, మేం కూడబెట్టిన డబ్బుతో ఒక లాడ్జిని నడిపాం. అలాఅలా మా వ్యాపారం పెరిగింది. హోటల్ హెవన్ గా రూపొందింది. కాని ఎప్పుడూ నా వృత్తి ఒక్కటే! అదేమిటో నీకు తెలుసు.

"ఇప్పుడు తారాచంద్‌ని పేరుకి మాత్రం వుంచు తున్నాను. అంతా నాదే. రాజా గార్మెంట్స్ అనే తెర వెనక అనేకమంది యువతులను కొని నా కస్టడీలో వుంచాను. హోటల్ హెవన్‌కి వచ్చే డబ్బున్నవాళ్ళు నా దగ్గరున్న యువతులను సప్లయిచేసి ఎంతో డబ్బు

సంపాదించాను. ఇదంతా చెప్పడానికి నాకే సిగ్గేస్తోంది. ఇప్పుడు ఏం చెయ్యాలో నాకు తెలియడంలేదు. ఈ మురికి కూపంలోంచి బయటపడాలని నాకూ వుంది. కాని ఇందులో యిరుక్కుపోయాను" అని అతడు ఆగాడు.

ఆమె అతడివైపు తీక్షణంగా చూసింది.

"రాజా, అధః పాతాళానికి దిగిపోయిన మనిషికూడా తన జీవితాన్ని మార్చుకునే అవకాశం వుంది. మీరు మారడమే కాదు! ఇంతకాలం మీరు హింసించి పిండుకు తిన్న ఆ యువతులను కూడా మనం మరో త్రోవకు మరలించాలి."

"అనూ, ఏం చెయ్యాలో నువ్వే చెప్పు!" అన్నాడతను.

ఆమె టైమ్ చూసింది. ఐదయింది. "దేవుడు మనకి చూపిస్తాడు సరైన త్రోవ!" అందామె క్లుప్తంగా.

## 12

ఆమె కార్లోంచి దిగి పైకి వచ్చింది. రాజా ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"రాజా, మొత్తం 120 మంది స్త్రీలు అక్కడ వున్నారు. అందులో 50 మంది వాళ్ళ ఊళ్ళకు వెళ్ళిపోతామన్నారు. ఒక్కొక్కళ్ళకి 10 వేలు ఇచ్చి వాళ్ళను క్షేమంగా పంపించేద్దాం" అందామె.

"అలాగే చేద్దాం" అన్నాడతను.

"ఇంతవరకూ రాజా గార్మెంట్స్ కంపెనీ ఒక అవినీతికరమైన వ్యాపారానికి తెరగా వుంది. ఇప్పుడది మారుద్దాం. విదేశీ మిషన్లను తెప్పించి గార్మెంటు ఫాక్టరీ నడుపుదాం. కొందరు స్త్రీలకు మనం అందులో ఉద్యోగాలు యివ్వొచ్చు. వర్కింగ్ వుమెన్స్ హాస్టలు

పాపించుదాం. మన దగ్గర మిగిలిన తతిమ్మా 70 మందికీ అక్కడ గదులిచ్చి, భోజన సౌకర్యాలు చేకూరేటట్లు చూద్దాం. ఏదేనా ఉద్యోగం దొరికితే అందులో చేరి పనిచేస్తూ, సక్రమంగా జీవిస్తామని ఈ 70 మందీ నాతో చెప్పారు."

"అనూ, బాగుంది. వాళ్ళ జీవితాలు మారిపోతాయి" అన్నాడతను.

ఆమె అతడివైపు చూసింది.

"మీ పేరు రాజా! సంపత్ పేరు గతంలో కలిసి మాయమైపోయింది. ఇటుపైన హోటల్ హెవన్ పెద్ద మనుషులు బసచేసే హైక్లాస్ హోటలుగా నడపబడుతుంది" అందామె.

కన్నీళ్ళతో అతడు ఆమెవంక చూశాడు.

"మళ్ళీ జన్మ ఎత్తినట్టు అనిపిస్తోంది నాకు" అన్నాడతను.

ఆమె నవ్వుతూ అతడివంక చూసింది.

"మనిషి మనస్ఫూర్తిగా కోరుకుంటే, ఆశిస్తే ఎటువంటి హీన పరిస్థితిలోంచైనా బయటపడి వున్నత శిఖరాలవైపు ప్రయాణం చేయొచ్చు! మనకు దీక్ష, సాధన వుంటే చాలు. దైవానుగ్రహం ఎప్పుడూ వుంటుంది" అంది అనసూయ.

"అనూ, నువ్వొక దేవతవు!" అన్నాడతను వుద్రేకంతో.

—: అయిపోయింది :—

# మూడు రోడ్ల జంక్షన్

బొమ్మిడి అచ్చారావు

"నేనో వింత పరిస్థితిలో చిక్కుకుపోయాను సార్! నన్ను మీరే గట్టున పడెయ్యాలి!" అన్నాడతను.

డిటెక్టివ్ కిరణ్ అతని వంక పరీక్షగా చూశాడు. వయసు ఏభై సంవత్సరాలుండొచ్చు. పచ్చటిపసిమి, ఆజాను బాహుడు. లాల్చీ, పంచె మల్లెపూవు తెల్లదనాన్ని ధిక్కరిస్తున్నాయి. చేతులకి వేళ్ళకి నాలుగేసి ఉంగరాలు, బంగారు వాచీ అతని సంపన్నతను చాటుతున్నాయి.

"చెప్పండి, ఏమిటా వింత పరిస్థితి? నే నే విధంగా మీకు సహాయపడగలను?" అడిగాడు కిరణ్.

"నా పేరు వరప్రసాద్. సిటీలో రెండు సినిమా హాళ్ళలో ఏభై పైసల వాటాలున్నాయి. మా స్వగ్రామంలో కొన్ని మాగాణి భూములు, రెండు ధాన్యం మిల్లులు వున్నాయి. నాకు యిద్దరే పిల్లలు. ఓ కొడుకు కూతురు. ఇద్దరికీ పెళ్ళిళ్ళు చేసేశాను. అమ్మాయిని అల్లుడ్ని మా ఇంట్లోనే పెట్టుకున్నాను. నా కొడుకు మా ఊళ్ళో

భూములు, మిల్లులు చూసుకుంటూ అక్కడే వుంటున్నాడు. వాడికోసం ఓ పెద్ద బంగళా అత్యాధునికంగా కట్టించి యిచ్చాను. సిటీకన్న అక్కడే హాయిగా వుంది వాడికి.

"ఇకపోతే నా కొచ్చిన సమస్యేమిటంటే, వారం రోజులక్రితం బ్యాంకునించి రెండు లక్షలు అవసరపడి డ్రా చేసి తెచ్చాను. తీరా అవి దొంగనోట్లు అని తేలింది" ఓ క్షణం ఆగి చేతి రుమాలుతో నుదుటికిపట్టిన చెమట తుడుచుకున్నాడు హరప్రసాద్.

కిరణ్ నిటారుగా అయాడు. అతనివంకే దీక్షగా చూస్తున్నాడు.

"అంటే....బ్యాంకులోనే దొంగనోట్లు యివ్వటం జరిగిందనా మీ అనుమానం?" అడిగాడు కిరణ్.

"వాళ్ళు అన్నీ వందరూపాయల నోట్లే యిచ్చారు. అన్నీ కొత్త నోట్లు! బ్రీఫ్ కేసులో పెట్టి తెచ్చాను. నంబర్లు చూడవలసిన అవసరం సాధారణంగా వుండదు కదా అని ఆ సంగతే పట్టించుకోలేదు. కాని, తీరా అవి మారకానికి వచ్చేటప్పటికి దొంగనోట్లని తేలిపోయింది!"

"మరి వెంటనే బ్యాంకుకు వెళ్ళి వెరిఫై చేసుకోక పోయారా? కొత్తనోట్ల నంబర్స్ వాళ్ళు నోట్ చేసి వుంచుతారు. మీకు అవి ఎలా వచ్చిందీ తెలిసిపోయి వుండేది!"

"అదీ జరిగిందండి. కాని నేను వెళ్ళటం నాలుగు రోజులు పట్టింది. తెచ్చిన వెంటనే డబ్బు అవసరంలేక పోయింది. బ్రీఫ్ కేసుతో అలాగే బీర్వాలో పెట్టేసి నాలుగోరోజున అవసరపడినపుడు చూసేటప్పటికి అవి దొంగనోట్లు! వెంటనే నోట్లు అలాగే పట్టుకుని వెళ్ళి

బ్యాంకు వాళ్ళకి చూపిద్దామనుకున్నానుగాని, వాళ్ళు నాలుగు రోజుల తర్వాత తీసుకువెళ్ళి అడిగితే నన్నే అనుమానించే ప్రమాదముందని గ్రహించాను. నాకు యిష్యూ చేసిన నోట్ల నంబర్లు, సిరీస్ అడిగాను. వాళ్ళు చెప్పిన నంబర్లు, నా దగ్గరున్న దొంగనోట్లతో టాలీ కాలేదు."

కిరణ్ తలూపాడు.

"పోలీసులకి రిపోర్టిచ్చారా?"

హరప్రసాద్ నిట్టూర్చి, "తమకు తెలియదా పోలీసు వాళ్ళతో పెట్టుకుంటే కథ ఎంతవరకు పోతుందో!? ఈ సంగతి బయటి వాళ్ళెవరికి చెప్పినా చిలవలు పలవలు అల్లి తిరిగి నామీదకే తిప్పుతారు. నేనేదో దొంగనోట్లు అచ్చువేస్తున్నట్టు ప్రచారం చేసేస్తారు. నేను సంపాదించిన ఆస్తిపాస్తులన్నీ అలాగే సంపాదించానంటారు. వాటి లెక్కలు, ఆరాలు, టాక్సులు....అబ్బ, చెప్పకండి. అందుకే సరాసరి మీ దగ్గరికి వచ్చాను" అన్నాడు.

"ఆ నోట్లు తెచ్చారా?"

"మచ్చుకి ఓ కట్ట తెచ్చాను, చూడండి" అంటూ హరప్రసాద్ ఓ నోట్లకట్ట తీసి బల్లమీద పెట్టాడు.

కిరణ్ ఆ నోట్లకట్టను చూసి దొంగనోట్లంటే నమ్మలేకపోయాడు. ముమ్మూర్తులా అసలు నోట్ల లాగానే వున్నాయి అవి! రిజర్వు బాంకు గవర్నరు సంతకం, వాటర్ మార్కులతోబాటు అంతా అసలు నోటులానే వుంది.

ఓ నోటు విడదీసి పరీక్షగా చూశాడు కిరణ్. 7DG సిరీస్ నంబర్లుగల నోట్లు అవి! నోటు వెనక్కి తిప్పి చూశాడు. అన్నీ యధాతథంగానే కనిపించాయి అసలు

నోటుకిలాగానే. అయితే నోటు మధ్యగా వున్న జేగురు రంగు పైకి అసలు దానిలాగానే కనిపించినా వెలుర్లో పెట్టి చూస్తే అసలు రంగు బయట పడుతోంది. పసుపు పచ్చని రంగు కనిపిస్తోంది. వాటర్ మార్కు దగ్గర గోటితో నోటుపైన గీకిచూస్తే కనిపించాల్సిన వెండిచార, కనపడటంలేదు—తేడా కనిపిస్తోంది.

ఆ రెండు కారణాలవల్ల అవి దొంగనోట్లని నిర్ధారించటం కొంత శ్రమతో కూడిన పనే! బాహ్య నేత్రంతో ఎవరూ వాటిని దొంగనోట్లని ఎట్టిపరిస్థితుల్లోనూ గుర్తించే అవకాశంలేదు. చాలా సునాయాసంగా చేతులు మారిపోయి అసలు నోట్లతో కలిసి చలామణీ కావటం చాలా తేలిక! అయితే ఒకేసారి కట్టలుగా ఇస్తే దొరికిపోవటం కూడా కష్టంకాదు!

నోట్లు పరీక్షించటం ముగించి టేబిలుమీద పెట్టి హరప్రసాద్ వంక తిరిగి, "మీరు నాలుగురోజులపాటు నోట్లు బ్రీఫ్‌తో బాటే యింట్లో వుంచానని చెప్పారు. అప్పుడు అవి స్థానం మారివుండవచ్చునేమో! ...." అన్నాడు కిరణ్.

"అదెలా సార్! ఆ నాలుగు రోజులు కొత్తవాళ్ళు గాని, బయటివాళ్ళు గాని ఎవరూ యింట్లోకి అడుగు పెట్టలేదు. పైగా బీరువా తాళాలు అనునిత్యం నాతోనే వుంటాయి. దొంగ ఎవరూ ప్రవేశించటానికి వీల్లేకుండా రెండు కుక్కల్ని ఆవరణలో వదిలేస్తాను. ఓ వాచ్‌మన్ యిరవై నాలుగ్గంటలూ కాపలా వుండనే వున్నాడు. ఇంకెవరొస్తారు?"

"మరి బీరువాలోని సూట్‌కేసులో వున్న నోటు

అకస్మాత్తుగా దొంగనోట్లుగా మారిపోయాయంటే ఆశ్చర్యమే మరి! నాలుగు రోజుల వరకు మీకు వాటి అవసరం కూడా రాకపోవటంవల్ల ఆ నోట్లు బ్యాంకు నించి తెచ్చినపుడు మారిపోయాయో ఈ నాలుగురోజుల వ్యవధిలో మారిపోయాయో తెల్సుకోవటం కష్టమే అవుతుంది....

దొంగలే అయితే డబ్బుతోపాటు బ్రీఫ్ ఎత్తుకు పోతారుగాని, జాగ్రత్తగా మీ పెట్టె తెరిచి ఆ నోట్లు తీసి దొంగనోట్లు ఆ స్థానంలో పెట్టాల్సిన అవసరంలేదు. దీన్నిబట్టి చూస్తే మిమ్మల్ని అపఖ్యాతిపాలు చెయ్యటానికి మిమ్మల్ని వీధిలోకి లాగటానికి కావాలనే ఎవరో చేసివుంటారనిపిస్తోంది!"

"ఎగ్జాట్లీ! నేనూ అదే అనుకుంటున్నాను సార్! నా శత్రువులెవరో నామీద కక్షతో యిలాచేసి వుండొచ్చు ననుకుంటున్నాను."

"మీ శత్రువులెవరు? మీకూ శత్రువులున్నారా?"

"ఎందుకుండరు సార్! కొంతమంది వృత్తి శత్రువు అయితే మరికొందరు మరో కారణంవల్ల, మరొకరు ఆస్థి వల్ల—యిలా నా చుట్టూ శత్రువులే!

"ఆ వివరాలు చెప్పండి. వాళ్ళ గురించి ఆరాతీస్తే ఏమన్నా ఫలితముండొచ్చు....ఇంతకీ నేను మీకు చేయవలసిన సర్వీస్ ఏమిటో మీరు చెప్పనేలేదు.." అన్నాడు కిరణ్.

హరప్రసాద్ టేబిలుమీదకి వంగి, "ఇక వేరే చెప్పేదేముంది సార్! ఆ డబ్బు అలా మారిపోవటానికి కారకుడెవరో తెలుసుకోవాలి. ఎందుకలా చేశాడో కనుక్కోవాలి. వీలైతే నా డబ్బు నాకు అప్పగించాలి!" అన్నాడు.

"మనిషి దొరికితే డబ్బు దొరకటం కష్టంకాదు. అసలు అందుకు కారకుడెవరో తెలిస్తే అన్నీ వాటంతటవే బయటికొస్తాయి....ఆల్ రైట్! చెప్పండి వివరాలు!" పెన్నూ నోట్ బుక్ సిద్ధంగా పెట్టుకున్నాడు కిరణ్.

హరప్రసాద్ చెప్పసాగాడు.

కిరణ్ వరసగా రాసుకున్నాడు. ఆ వ్యక్తులతో హరప్రసాద్‌కున్న పరిచయం, సంబంధం, ఆయనతో వున్న శత్రుత్వం వివరాలు అన్నీ విపులంగా అడిగి నోట్ చేసుకున్నాడు.

"త్వరలో ఈ విషయం కనుక్కోండి సార్! నాకో పక్క బెంగగా వుంది. నాకిది బ్యాడ్ పిరియడ్‌లా కనిపిస్తోంది చూడగా....ఇదిగో అడ్వాన్స్‌గా వుంచండి!" అంటూ ఓ నోట్ల దొంతర టేబిల్ మీద పెట్టాడు.

కిరణ్ మెల్లగా నవ్వి, "సరే, మీరు వెళ్ళి రండి. అవసరమైతే నేనే మీ యింటికొచ్చి విశేషాలుంటే చెపుతాను" అన్నాడు.

హరప్రసాద్ సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు.

## 2

కిరణ్ హరప్రసాద్ వెళ్ళిపోయాక కేసుని పరిశోధించాల్సిన విధానం గురించి ఎక్కడినుంచి మొదలు పెట్టాలో అని ఆలోచిస్తూండగా టెలిఫోన్ మోగింది. ఫోన్ ఎత్తి "హల్లో, ఎవరు కావాలి?" అన్నాడు కిరణ్.

అవతల కర్కశంగా వున్న గొంతు వినిపించింది.

"మిష్టర్ కిరణ్! ఈ నోట్ల కేసులో పరిశోధన విరమించుకో, లేకుంటే చాలా ప్రమాదం!" అన్న హెచ్చరిక విని నిటారుగా అయాడు కిరణ్.

"ఎవరు నువ్వు? నోట్లకేసేమిటి?"

"అదే సార్, ఇప్పుడే హరప్రసాద్ దగ్గర అడ్వాన్సు కూడా తీసుకున్నావు కదా! వాడో పరమ ద్రోహి, పాపాత్ముడు! వాడి సంగతి మేం చూసుకుంటాంగాని నువ్వనవసరంగా కలగజేసుకోకు."

"నువ్వెవరు? నన్ను శాసిస్తున్నావా?"

"నేనెవరో నీకు తెలియదు. చెప్పినా తెలియదు. శాసించటమే కాదు, అవసరమైతే మా లక్ష్య సాధనకి నిన్ను అడ్డు తొలగించుకోవటానికి ఏమైనా చేస్తాం. అందుకే మా దారికి అడ్డు రాకు! వెంటనే హరప్రసాద్ కేసు విరమించుకో."

"అది జరగని పని!"

"నీ ఖర్మ అనుభవిస్తావు!" అవతల గట్టిగా ఫోన్ పెట్టిన శబ్దం.

కిరణ్ తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. ఎవరో హరప్రసాద్‌ని వెంబడిరిచి వచ్చారు. తమ మధ్య నడిచిన సంభాషణ, తనకు అడ్వాన్సుకింద డబ్బివ్వటం అన్నీ చూశాడు, విన్నాడు.

కిరణ్ చటుక్కున సీట్లోంచి లేచి బయటికొచ్చాడు. తన గది బయట నడవా పరీక్షగా చూశాడు. నీట్‌గా వున్న ఫ్లోర్ మీద యిసక, దుమ్ము కనిపించాయి. తెల్లగా పడ్డ చెప్పుల గుర్తులు కూడా కనిపించాయి. తనింట్లోకి అంత చొరవగా ఎవరూ రారు. అదీగాక దొంగచాటుగా వచ్చే అవకాశం కూడా లేదు. గేటు దగ్గర గూర్ఖా వున్నాడు!

కిరణ్ చకచక గేటు దగ్గరకొచ్చాడు. ఆవరణలోని పూల మొక్కల మధ్యగా పడివున్న గూర్ఖా కనిపించాడు.

దగ్గరగా వెళ్ళి చూశాడు. స్పృహతప్పి పడివున్నాడు.

లేపిన వెంటనే లేవలేదు. నీళ్ళు చల్లి సేద తీర్చాక లేచి కూచున్నాడు. అతని తలమీద వున్న గాయం అప్పుడు కిరణ్ కళ్ళబడింది. అతను చెప్పనవసరం లేకుండానే జరిగింది అర్థమయ్యింది కిరణ్ కి.

గూర్ఖాను కొట్టి స్పృహ తప్పించి గేట్లోంచి లోపలికి ఎవరో వచ్చారు.

"కితనే ఆద్మీ ఆగయేఁ?" అనడిగాడు కిరణ్.

"దో ఆద్మీ ఆయే సాబ్! మైఁ క్యా, హోనా పూంచ్ రహాహూఁ, బీచ్ మె ఏక్ ఆద్మీ జోర్ సే ముఝే మారా!" అంటూ వివరించాడు గూర్ఖా.

వాళ్ళ పోలికలు అడిగి గుర్తుపెట్టుకున్నాడు కిరణ్.

వాళ్ళెందుకు వచ్చినట్టు? కేవలం తమ మధ్య జరుగుతున్న సంభాషణ తెలుసుకోవటానికేనా? తమ యిద్దరో ఎవరికీ హాని చెయ్యకుండా వచ్చిన దారినే మళ్ళీ బయటికి దాటుకున్నారు. ఇంతకీ వాళ్ళ ఉద్దేశ్యమేమిటి? వాళ్ళకీ, వారప్రసాద్ కి, ఈ దొంగనోట్లకీ ఏమిటి సంబంధం?

ఆలోచిస్తూ కిరణ్ లోపల్నుంచి మెజరింగ్ టేప్ తెచ్చి నడవలో పడ్డ చెప్పుల గుర్తుల కొలతలు సేకరించాడు. తర్వాత వాటిని ఫోటో తీశాడు. మట్టిని సేకరించి భద్రపరిచాడు. సిగరెట్టుపీకల వంటివి కనిపిస్తాయేమోనని చూశాడు. అలాంటివేం కనిపించలేదు.

లోపలికొచ్చి నోట్ బుక్ లో రాసిన వ్యక్తుల వివరాలు పరిశీలనగా చూశాడు. అందులో నాలుగు పేర్లు అతన్నాకర్షించాయి.

ఒకతను — పేరు — రంగనాథ్ ఓ. సినిమా థియేటర్

యజమాని. వృత్తి శత్రువు! సంఘంలో హోదా, పేరు వున్నవారే! హరప్రసాద్‌తో చాలాకాలంగా విరోధముందతనికి! అతను తీసుకోబోయిన థియేటర్లో షేర్ హరప్రసాద్ పోటీపడి కొన్నాడు. అదే శత్రుత్వానికారణం.

పారసారిధి. హరప్రసాద్ థియేటర్లో మేనేజర్‌గా పనిచేసి బాగా డబ్బు తినేసి హరప్రసాద్ చేత ఉద్యోగంనించి తొలగించబడ్డాడు. సహజంగా హరప్రసాద్ పట్ల కత్తుబూనటం, దాన్నిలా సాధించుకోవాలనుకోవటం జరగొచ్చు. ఏ పనీ లేకపోతే ఇలా దొంగనోట్ల చలామణీలో పనిచేస్తూండవచ్చు. అతని విషయం ఆరాతీయాల్సింది వుంది!

పరశురామయ్య. ఇతను ఒకప్పుడు హరప్రసాద్‌తో వియ్యమందాలనుకున్నాడు. తన కూతుర్ని హరప్రసాద్ కొడుకు సత్యప్రసాద్‌కిచ్చి చెయ్యాలని ప్రయత్నించి విఫలుడయ్యాడు. బాగా డబున్నవాడు. రెండు పెద్ద బట్టల షాపులున్నాయతనికి.

నాలుగో వ్యక్తి పేరు కారయ్య. హరప్రసాద్ ఇంటి నౌఖరు. ఓసారి ఏదో సందర్భంలో పొగరుగా ప్రవర్తించాడని అల్లుడుగారు ఆరోపించగానే, హరప్రసాద్ వాడిపై ఆగ్రహించి పనిలోనుంచి తొలగించాడు. వాడు పనివాడయినా అవమానం సహించడనీ, ప్రతీకారం తీర్చుకు తీరతాడని తనకోపక్క భయంగానే వుందనీ వాడిపని కావచ్చునేమోనని అనుమానం వెలిబుచ్చాడు హరప్రసాద్. ఇది జరిగి కూడా వారంరోజులే అయింది.

ఇవిగాక యింకా మరో ఆరు పేర్లున్నాయి లిస్టులో.

కాని వాళ్ళకు హరప్రసాద్‌తో పెద్దగా శత్రుత్వంగాని, ప్రత్యేకంగా చెప్పుకోవాలసిన పగ, ప్రతీకారం, కక్ష లాంటివేమీ లేవు. అంతగా అవసరమైతే వాళ్ళ గురించి కూడా ఎంక్వయిరీ చేయాలనుకున్నాడు కిరణ్.

ఇంతలో కిరణ్‌కి ఓ విషయం స్ఫురించింది.

హరప్రసాద్ రెండు లక్షల రూపాయల గురించి బెంగపడుతున్నట్టు కనిపించదు. అవి ఖచ్చితంగా రాబట్టుకోవాలనే ధోరణి అతని ప్రవర్తనలోగాని, మాటల్లోగాని తనకు అంతుపట్టలేదు. బహుశా కోర్టికి పడగలెత్తినందువల్లనో ఏమో! కేవలం తన పరువు మర్యాదల్ని రచ్చకీడ్చి, తన ఆస్తిపాస్తుల విషయం బయటికి లాగుతారనే ఎక్కువగా అతను దిగులుపడుతున్నట్టుంది అతని ధోరణి.

అసలు హరప్రసాద్ చెప్పిన విషయాలు నిజమేనా? అతను నమ్మదగ్గ వ్యక్తేనా? ఫోన్‌లో వ్యక్తి మాటలే అనుక్షణం గుర్తొస్తున్నాయి కిరణ్‌కి; ఆ వ్యక్తికి హరప్రసాద్‌మీద చాలా కక్ష వున్నట్టుంది. అతను పాపాత్ముడని, లుచ్చా అనీ సంబోధించాడంటే ఏదో ముఖ్యమైన శత్రువు లాగానే వున్నాడు.

అతను తన యింటికొచ్చిన యిద్దరు వ్యక్తుల్లో ఒకడయి వుంటాడు. ఫోన్ చేస్తున్నప్పుడు రెండోవాడు పక్కనే వుండివుండాలి. హరప్రసాద్ బయటికి వచ్చే సమయానికి వాళ్ళు అతని కంట పడకుండా తనింటినుంచి బయటపడి ఏ పబ్లిక్ బూత్‌నుంచో ఫోన్ చేసి తనని బెదిరించారు.

కిరణ్ లేచాడు. చకచక దుస్తులు మార్చుకుని పోర్టికోనుంచి టయోటాని బయటికి తీశాడు. హరప్రసాద్ యిచ్చిన అడ్రసు ఓసారి మననం చేసుకున్నాడు.

సరాసరి టయోటాను ముందుకు హరప్రసాద్ ఇంటి వైపు పరుగెత్తించాడు.

దూరంనుంచే మూడంతస్తుల అధునాతనమైన భవనం చూచేవాళ్ళ కళ్ళు చెదరగొడుతూ కనిపించింది. దాన్ని కట్టడానికి కనీసం పాతిక ముప్పయి లక్షలు ఖర్చుపెట్టి వుంటాడు హరప్రసాద్.

ఇంటిముందు ఆగకుండా కారు స్లో చేసి గేటుముందున్న చలవరాయి పలకమీద 'సౌజన్య విహార్' అన్నమాటలు ఓ పక్క, హరప్రసాద్ లాండ్ లార్డు, అన్న మాటలు రెండో పక్క చదివాడు కిరణ్. దీన్నిబట్టి హరప్రసాద్ చెప్పిన మాటలు ఏమాత్రం సత్యదూరం కాదన్న విషయం తెలిసిపోతూనే వుంది.

## 3

సాయంత్రం ఆరుగంటల సమయం. రోడ్లన్నీ రద్దీగా వున్నాయి. అది మెయిన్ రోడ్ కావడంతో షాపింగ్ సెంటర్లన్నీ జనంతో కిటకిటలాడుతున్నాయి.

కిరణ్ తన పరిశోధన కారయ్యతో మొదలుపెట్టాలని నిర్ణయించుకున్నాడు. కారుని ఊరికో చివరగా వున్న స్లమ్ ఏరియాకు పోనిచ్చాడు. అక్కడ కూలీపనులు చేసుకునేవాళ్ళు ఫ్యాక్టరీల్లో పనిచేసేవాళ్ళు, కాయకష్టం చేసుకునేవాళ్ళు నివసిస్తూంటారు.

కారయ్య ఆ లొకాలిటీలోనే వుంటున్నాడు.

కిరణ్ టయోటాని ఆ వైపు పోనిస్తున్నాడు. ఎక్కడ్నుంచో ఓ చెవర్లెట్ కారు అక్కడికి దూసుకుంటూ వచ్చింది.

ఆ ప్రదేశంలో జనం బాగా పల్చగా వున్నారు.

చెవర్లెట్ టయోటాకు అడ్డంగా పెట్టేశారు. అందులోంచి చకచక నలుగురు వ్యక్తులు దిగారు.

టయోటాను చుట్టుముట్టారు.

కిరణ్ రాబోయే ప్రమాదాన్ని ఊహించాడు. చటుక్కున కోటు జేబులోనించి పిస్తోలు తియ్యబోయాడు-కాని అప్పటికే ఆలస్యమయింది.

అందులో దృఢంగా పొడవుగా వున్న పిల్లిగడ్డం వ్యక్తి చేతిలో నల్లగా నిగనిగ మెరుస్తోంది రివాల్వర్ అప్పటికే!

"మేము చెప్పినట్టు విన్నావా సరే, లేకపోతే నిర్దాక్షిణ్యంగా చంపి పారేస్తాం" అన్నాడు.

కింద దవడ కండరాలు బిగుసుకున్నాయి.

"ఎవరు మీరు? ఏమిటీ దౌర్జన్యం" అన్నాడు.

"అవన్నీ తర్వాత. నువ్వు మర్యాదగా పక్కసీట్లోకి జరుగు. నేను డ్రైవ్ చేస్తాను" అని ఆ పిల్లిగడ్డం వ్యక్తి తనవాళ్ళవంక చూసి సైగ చేశాడు.

అప్పటికే కొన్ని చెక్కపెట్టెలు టయోటా డిక్కీలోకి చెవర్లెట్ నుంచి చేరవేశారు తక్కిన ముగ్గురు. ఇద్దరు చెవర్లెట్ ఎక్కి ఎటో వేగంగా మాసుకుపోయారు. ఒకడు టయోటా వెనక సీట్లో కూచున్నాడు.

కిరణ్ మౌనంగా పక్కకు జరిగాడు.

పిల్లిగడ్డం మనిషి అంతలోనే యేమనుకున్నాడో, "వద్దులే నువ్వే డ్రైవ్ చెయ్యి. డైరెక్షన్స్ నేను చెబుతాను" అన్నాడు.

"నేను డ్రైవ్ చెయ్యను" అన్నాడు కిరణ్ మొండిగా.

"మిస్టర్ కిరణ్! నువ్వు చాలా తెలివైనవాడివి. నీ సేవలు ఈ దేశానికి చాలా అవసరం. యెందుకు అనవస

రంగా ప్రాణం పోగొట్టుకుంటావు?" అన్నాడు పిల్లి గడ్డం వ్యక్తి.

కిరణ్ అతనితో వాదిస్తూనే తీవ్రంగా ఆలోచిస్తున్నాడు. వాళ్ళిద్దరున్నారు. తను ఒక్కడే అయినా రివాల్వర్ చేతికి అందుకునే అవకాశం యివ్వకుండా పిస్తోలు గురిపెట్టి వున్నాడా వ్యక్తి.

వీళ్ళెవరు? ఆ పెట్టెల్లో ఏమున్నాయి? తన కార్లోకి ఎందుకు చేరవేశారు? — అని మరో పక్క ఆలోచిస్తున్నాడు.

రివాల్వర్ కొసని గట్టిగా కిరణ్ డొక్కలో గుచ్చాడా వ్యక్తి.

"నువ్వు కావాలని నాతో వాదన పెట్టుకుని ఆలస్యం చేస్తున్నావు. వెంటనే కారుని బయల్దేరతియ్యి-లేకపోతే చంపటానికేమాత్రం సంకోచించను. యిక్కడ నిన్ను రక్షించేవారుగాని, నన్ను అడ్డుకునేవారుగాని యెవరూ లేరు. ఆ కూలి జనం అలాగా జనం మన కార్ల మనుషుల సంగతులు పట్టించుకోరు. ఎవడో నీకు సాయంవస్తాడని, మానించి తప్పించుకోవాలని ప్రయత్నించకు. ఊఁ. క్విక్!" అన్నాడు.

కిరణ్ కారు స్టార్టు చేశాడు.

"ఊఁ, వేగంగా పోనీయ్! జి.ఎన్.టి. రోడ్ కి కారు తిప్పు. తిన్నగా పోనియ్యి. దార్లో ఎవరు అడ్డొచ్చినా కారు ఆపకు. ఆపాలని ప్రయత్నించినా, దారి మళ్ళించాలని ప్రయత్నించినా అనవసరంగా నష్టపోతావు" అన్నాడా వ్యక్తి హెచ్చరిస్తూ.

కిరణ్ కారు పోనిస్తున్నాడు.

జి.ఎన్.టి. రోడ్డు చాలా రద్దీగా వుంది. లారీలు

చాలా విస్తారంగా నడుస్తాయి ఆ దారిన. చీకటిపడింది. హెడ్ లైట్సు ఆన్ చేశాడు కిరణ్. తల తిప్పటాని కూడా వీల్లేదు-పిల్లిగడ్డంవాడు తన డొక్కమీదినుంచి రివాల్వర్ని ఒక్క అంగుళం కూడా సడలించటంలేదు.

రోడ్డు మలుపు తిరిగేచోట పోలీసు వేన్, జీపు రోడ్డుకి అడ్డంగా పెట్టబడి వున్నాయి.

కిరణ్ కళ్ళు మెరిశాయి. జీప్లో కూచుని వున్న ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ అతనికి స్పష్టంగా కనిపిస్తున్నాడు.

పిల్లిగడ్డం రివాల్వర్ని మరింత గట్టిగా బిగించి, "పిచ్చి వేషాలు వెయ్యటానికి ప్రయత్నించకు. రోడ్ బ్లాకయిపోయింది కాబట్టి ఆపు చెయ్యక తప్పదు. అతను ఇన్స్పెక్టర్ శ్రీనివాస్. నీ ఫ్రెండు. నీ కారు సాధారణంగా ఆపడు. అడిగితే ఏదో చెప్పెయ్యి" అంటుండగానే టయోటా జీపు వేసు వున్న ప్రదేశం చేరింది.

శ్రీనివాస్తోబాటు నలుగురు కాన్స్టేబుల్స్ ఆయుధాలు టయోటాకి గురిచేసి నించున్నారు. ఇన్స్పెక్టర్ శ్రీనివాస్ టయోటాని సమీపించాడు.

డ్రైవింగ్ సీట్లో వున్న కిరణ్ని చూడగానే అతని ముఖం సంతోషంగా వెలిగింది. "హల్లో బ్రదర్, ఏమిటీ సర్ప్రయిజ్! ఇలా ఎక్కడికి బయల్దేరావు?" అన్నాడు శ్రీనివాస్ రివాల్వర్ కేస్లో పెట్టేస్తూ.

పోలీసులు గన్స్ వాల్చేశారు.

కిరణ్ బలవంతాన నవ్వి, "ఓ కేసు విషయంలో చిన్న యిన్ఫర్మేషన్ కావలసి వచ్చి దగ్గర్లో వున్న ఓ గ్రామానికి వెళ్తున్నాను. నువ్వేమిటి యిక్కడున్నావు? ఏదైనా రైడింగా?" అన్నాడు.

"అవును. నిన్ను కలుద్దామనుకున్నాను. కాని యింతలోనే అర్జంటుగా ఫోన్ మెసేజ్ వచ్చింది. ఈ రోడ్న ఓ. చెవర్లెట్ కార్లో దొంగనోట్లు రవాణా అవుతున్నాయని విశ్వసనీయంగా తెలిసింది. అందుకని కాచుకుని వున్నాను. అవును, యింకా కార్లో ఎవరో వున్నట్టుంది, ఎవరు వాళ్ళు?" అన్నాడు కిరణ్.

కిరణ్ వెంటనే, "చెప్పానుకదా ఓ. కేసు విషయంలో వెళ్తున్నానని. నా క్లయింట్సు వివరాలు నీకు తర్వాత చెపుతాను" అన్నాడు.

కిరణ్ కి తన డిక్కీలో వున్న చెక్క పెట్టెలేమిటో అర్థమయింది. దుండగుల ప్రయత్నం కూడా తెలిసింది. తను కావాలంటే ఈ క్షణంలోనే వాళ్ళిద్దర్నీ పోలీసుల కప్పచెప్పెయ్యగలడు! శ్రీనివాస్ కి కన్ను గీటాడంటే చాలు క్షణంలో వాళ్ళిద్దరి పనీ సమాప్తమవుతుంది.

కాని ఇప్పుడు తను తొందరపడకూడదు. వీళ్ళు దొంగనోట్లు చలామణీ చేస్తున్న స్మగ్లర్సు. వీళ్ళు ఈ నోట్లు ఎక్కడికి చేరవేస్తున్నారో, వీళ్ళ అసలు స్థావరమెక్కడో తెలుసుకోవటం చాలా అవసరం! వీళ్ళిద్దర్నీ పట్టి బంధించి హింసించినా తక్కిన వాళ్ళ గురించి చచ్చినా చెప్పరు. తనే స్వయంగా తెలుసుకోవటానికి యిది చక్కని అవకాశం!

"సరే, వెళ్ళు. మనం మళ్ళీ కలుద్దాం. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి దొంగనోట్లు చలామణీ గురించి. మళ్ళీ ఎప్పుడొస్తావు? రాత్రికొచ్చేస్తావా?"

"బహుశా వచ్చేస్తాను. రేపు కలుద్దాం" అన్నాడు కిరణ్. శ్రీనివాస్ స్నేహపూర్వకంగా నవ్వాడు.

వేన్, జీపు అప్పటికే రోడ్ కి అడ్డుతీసి పక్కకు

పెట్టారు.

కిరణ్ టయోటా స్టార్టుచేసి ముందుకు పోనిచ్చాడు.

## 4

"గుడ్! సమయస్ఫూర్తితో వ్యవహరించి ప్రాణాలు కాపాడుకోవటమేకాక, మా ఆస్తి కాపాడావు. థాంక్స్! ఎంతైనా డిటెక్టివ్ బుర్ర పాదరసంలా పని చేస్తోంది!" అన్నాడు పిల్లిగడ్డం వ్యక్తి.

"నీ ప్రశంసలు నాకొద్దు. ఆ పెట్టెల్లోని దొంగనోట్లు ఎక్కడికి సరఫరా చేస్తున్నావు?"

"అవన్నీ నీ కనవసరం. ఎవడో మా సంగతి పోలీసులకి చెప్పేశాడు. అందుకే అప్పటికప్పుడు చెవర్లెట్ నించి సరుకు నీ కార్లోకి మార్చేశాం. నిన్ను మా వెంట ఎందుకు తీసుకు వస్తున్నామో తెలుసా? దార్లో ఎక్కడ పోలీసులు ఎదురైనా నువ్వు డిటెక్టివ్‌వి కాబట్టి వది-లేస్తారు. మా గురించి ఎవరూ పట్టించుకోరు. గుర్తుపట్టరు. రోజుకి వేషాలు ఎన్ని వేస్తామో మాకే తెలియదు. అంచేత వాళ్ళు గుర్తుపట్టే అవకాశరం లేదు."

కిరణ్ చటుక్కున పిల్లిగడ్డం వాళ్ళవైపు చూశాడు. కాళ్ళకి షూస్ వున్నాయి. తన యింటివద్ద దొరికినవి చెప్పుల గుర్తులు. షూస్‌వి కావు. పైగా ఇతని కాలు బాగా చిన్నగా వుంది—షూ వేసుకున్నా తన యింట్లో దొరికిన గుర్తులు తొమ్మిదంగుళాలున్నాయి. ఇతనుకాదు-అనుకున్నాడు మనసులో.

"పోలీసులకి తెలిసిపోయిందని నీకు తెలిసినపుడు రవాణా చేయటం మానెయ్యొచ్చుకదా! అంత అర్జంటుగా ఎందుకు నా కార్లో చేరవెయ్యాలి?"

"అవన్నీ నీ కనవసరమన్నానుకదా...." అని పిల్లి

గడ్డం వ్యక్తి ఏదో అంటుండగానే వెనక సైరన్ మోగిన శబ్దం. వేన్, జీపు వేగంగా దూసుకొస్తున్నాయి.

వెనక కూచున్న వ్యక్తి, "గురూజీ, పోలీసులు పసి కట్టేశారు. వెనకపడి తరుముతున్నారు" అన్నాడు.

పిల్లిగడ్డం వ్యక్తి వెనక్కి చూసి కంగారుగా, "వెంటనే ఈ పక్కకు జరుగు. నేను డ్రయివ్ చేస్తాను" అన్నాడు.

ఆ క్షణాన్ని వెంటనే సద్వినియోగం చేసుకోవాలను కున్నాడు కిరణ్. స్టీరింగు అందుకోవటానికి పిల్లిగడ్డం వ్యక్తి రివాల్వర్ చెయ్యి మార్చుకున్నాడు. సరిగ్గా అదే సమయంలో తన కోటు జేబులోనించి రివాల్వర్ తీయ బోయాడు కిరణ్.

కాని అప్పటికే ఆలస్యమయి పోయింది.

వెనకసీట్లో వ్యక్తి చేతిలో కూడా రివాల్వర్ వుంది. దాని మడమతో కిరణ్ నెత్తిమీద బలంగా కొట్టి తలుపు తీసి బయటకి తోసేశాడు కిరణ్‌ని.

వేగంగా పరుగెత్తుతున్న కార్లోంచి అమాంతం రోడ్ మీద పడిపోయాడు కిరణ్.

వెనక వస్తున్న జీప్, వేన్ కిరణ్‌ని చూడగానే ఆగుతాయనీ, ఆ కాస్త సమయంలోను తాము దొర క్కుండా తప్పించుకోవచ్చనీ వెనక సీట్లోని వ్యక్తి ఊహించాడు.

సరిగ్గా అదే జరిగింది.

వేన్, జీవు కిరణ్ బయటికి పడిపోవటంచూసి ఆగి పోయాయి. బిలబిలమంటూ పోలీసులు శ్రీనివాస్‌తో బాటు దిగి కిరణ్ దగ్గరికి పరుగెత్తుతున్నారు.

"వెల్‌డన్ మై బోయ్!" అన్నాడు పిల్లిగడ్డం వ్యక్తి

తన అనుచరుడితో ప్రశంసగా.

• • •

శ్రీనివాస్ కిరణ్‌ని లేపి కూచోబెట్టాడు. మోకాళ్ళ మో చేతులు బాగా కొట్టుకుపోయాయి. పాంటు మోకాళ్ళ దగ్గర చినిగిపోయింది. కోటు మోచేతుల దగ్గర చిల్లులు పడిపోయింది.

తల చిట్లి నెత్తురు స్రవిస్తోంది.

"ఎవరు వాళ్ళు? నువ్వు వాళ్ళకెలా లొంగిపోయావు?" అడగబోయాడు శ్రీనివాస్.

"ఆ విషయం తర్వాత. వాళ్ళు స్మగ్లర్స్. తప్పించుకు పోనివ్వకు. పద వెంటాడు" అన్నాడు కిరణ్ లేని ఓపిక తెచ్చుకుని.

చేతులమీద ఆపుకున్నాడుగాని లేకుంటే తల రోడ్‌కి కొట్టుకుని ప్రాణంపోయి వుండేది.

శ్రీనివాస్ ఎగిరి కూచున్నాడు జీపులో. కిరణ్‌ని యిద్దరు కానిస్టేబిల్సు వేన్‌లోకి ఎక్కించారు. జీపు వెనక వేన్ పరిగెడుతోంది.

కిరణ్ టెన్షన్‌తో రోడ్‌వంకే చూస్తున్నాడు.

అప్పటికే టయోటా పూర్తిగా కనుమరుగైపోయింది. దాన్ని తను ప్రత్యేకంగా బుల్లెట్ ప్రూఫ్ చేయించాడు. మొన్ననే సర్వీసింగ్ చేయించాడు. మంచి కండిషన్‌లో వుంది. ఆ స్పీడును జీప్ అందుకోవటం జరగని పని!

వాళ్ళు తప్పించుకు పోయినందుకు ఉసూరుమనిపించింది కిరణ్‌కి. చేతులారా తనే అవకాశాన్ని జారవిడుచుకున్నాననిపించిందతనికి. దొరికిన వాళ్ళని వదిలి యింకా మొత్తం ముఠాని బంధించాలనుకోవటం పొరపాటయిందా అనిపించిందో క్షణం.

జీప్ ఆపేసి, వైర్‌లెస్‌లో చకచక ముందున్న పోలీస్ స్టేషన్స్‌కి మెసేజ్ పంపిస్తున్నాడు శ్రీనివాస్.

కేన్ దగ్గరికి రాగానే "నువ్వు హైదరాబాద్ తిరిగి వెళ్ళిపో! నీకు వైద్య సహాయం చాలా అవసరం. రక్తం కూడా పోతోంది. నేను ముందుకి వెళ్తాను. ఈలోపల నా మెసేజ్ అందుకుని సూర్యాపేటలోనో యీ లోపలనో మనవాళ్ళు టయోటాను ఆపేస్తారు. వాళ్ళు తప్పించుకోలేరు."

"ఏం ఫరవాలేదు. ముందుకే పోనియ్యి. నేనూ నీతోనే వస్తాను. వాళ్ళను వదిలిపెట్టేదిలేదు. జీప్ ఎందుకు ఆపు చేశావు?"

"ఇంక వాళ్ళనెటూ పట్టుకోలేను. నిన్నయినా వెనక్కి పంపిద్దామని ఆగాను."

"మనం కాకపోయినా సూర్యాపేట పోలీసులైనా పట్టుకుంటారుకదా! ఈలోపల మనమూ స్పాట్‌కి చేరుకోవచ్చు. ఊఁ, క్విక్!" అన్నాడు కిరణ్.

అంత బాధాకరస్థితిలో వుండికూడా తనను ఎంకరేజ్ చేస్తున్న కిరణ్‌ని చూసి జాలిపడ్డాడు శ్రీనివాస్.

మరో అరగంట ప్రయాణం తర్వాత దూరంగా టయోటా కనిపించింది.

శ్రీనివాస్ జీప్ వేగం పుంజుకుంది.

అయిదు నిమిషాల్లో టయోటాని అందుకున్నారు.

టయోటా రోడ్ పక్కగా ఆగివుంది. పోలీసులు చుట్టుముట్టారు.

శ్రీనవాస్ లోపలికి తొంగి చూశాడు.

టాయోటాలో ప్రయాణించిన వ్యక్తులు లేరు! నంబరు చూశాడు. కిరణ్‌దే!

"డిక్కీలో చూడు" అన్నాడు కిరణ్.

డిక్కీ తెరిచి చూశారు. అందులోని చెక్క పెట్టెలు మాయమయ్యాయి.

"చాలా తెలివిగా తప్పించుకున్నారు" ఉస్సురన్నాడు శ్రీనివాస్.

అక్కడ దారి మూడుగా చీలిపోయింది. ఒకటి అడవిదారి. ఒకటి సూర్యాపేట, మరొకటి ఖమ్మంపోయే దారి "వాళ్ళు ఏ దారిన ఎక్కడికి తప్పించుకున్నారో, ఏ వాహనంమీద తప్పించుకున్నారో ఎలా తెలుస్తుంది? మెసేజ్ పంపించే అవకాశంలేదు. నేను టయోటా అని చెప్పాను" అన్నాడు శ్రీనివాస్.

"ఈ మూడు దార్లలోను ఏ వాహనం వెళ్ళినా ఆపు చేయించి చెక్ చెయ్యమని మళ్ళీ మెసేజ్ పంపు. వాళ్ళు ఏదైనా వాహనంమీద వెళ్తే మాత్రం తప్పకుండా దొరికి పోతారు" అన్నాడు కిరణ్.

శ్రీనివాస్ వెంటనే మెసేజెస్ పంపాడు. ఇన్ఫర్మేషన్ దొరికితే హైద్రాబాద్ హెడ్‌క్వార్టర్స్‌కి తెలియ చెయ్యమని చెప్పాడు.

టయోటా, జీప్, వేన్ వెనక్కి హైద్రాబాద్ దారి పట్టాయి.

# 5

"నాతో తమకేం పనిబాబూ?" అన్నాడు కాశయ్య. అతనికి దాదాపు నలభై అయిదేళ్ళుంటాయి. కాయ కష్టంతో రాటుదేలిన శరీరం మనిషి. చదువుకోలేదు. మోటుగా వున్నాడు.

"మరేంలేదు, నాకు కొన్ని వివరాలు కావాలి. నీ ఋణం వుంచుకోనులే!" ఏభైరూపాయల కాగితం అతని

చేతిలో పెట్టాడు కిరణ్.

"అబ్బే, ఎందుకండి బాబూ, అడగండి చెబుతాను" అన్నాడు శారయ్య. నోటు ముట్టుకోలేదు. అతని నిజాయితీ కళ్ళలో ప్రతిఫలిస్తోంది.

"ఫరవాలేదు శారయ్యా, తీసుకో! నా సంతోషం కొద్దీ యిస్తున్నాను. డబ్బిస్తేనే గాని చెప్పవని కాదు" అని కిరణ్ బలవంతాన అతని గుప్పెట్లో పెట్టాడు నోటు.

శారయ్య అడగమన్నట్టు చూశాడు.

"గతంలో నువ్వు హరప్రసాద్ గారింట్లో పని చేశావు కదూ...."

"అవును బాబూ, నిన్న మొన్నటివరకు ఆరింట్లోనే ఆళ్ళ ఉప్పు పులుసు తిని ఈ శరీరం పెంచాను" కృతజ్ఞత తొణికిసలాడింది శారయ్య మాటల్లో.

"మరి ఎందుకు మానేశావు?"

"నేనెందుకు మానేస్తాను బాబూ, ఆరే మానిపించేసేరు."

"ఆరే అంటే హరప్రసాద్ గారేనా?"

"ఆరే బాబూ! కాని అయ్యగోరు దేవుడులాటోడు బాబూ! ఆరి అల్లుడిగారి మూలాన్న అంతా వొచ్చింది."

"ఏం, అల్లుడుగారు మంచివాడు కాదా?"

"ఏం మంచో బాబూ! ఇల్లరికం వొచ్చి వున్న అల్లుడుగదా ఎంత ఒద్దికగా వుండాలి? అదేంలేదు. ఓ పక్క అమ్మాయిగారు అడిగినంతా యిత్తానే వుంటారు. అయినా అదంతా ఆయనగోరి తాగుడికే చాల్దుబాబు! యిరవైనాలు గ్గంటలూ మత్తులోనే వుంటాడు. పనా, పాటా? తిరి కూకుని తింటమే కదూ!"

"మీ చినబాబు ఎలాంటివాడు?"

"సత్తెపెసాదుగారా? అరికేశవండీ, మానిక్యం గదండీ! ఆ పల్లెటూళ్ళో యెగసాయం సేసుకుంటూ దరిజాగా వున్నారండి. అయ్యగోరి పేరు నిలబెట్టి తీర్తాడండి చినబాబు!"

"ఎప్పుడైనా బస్తీ వస్తుంటాడా?"

"అయ్! నెలకోసారి చిన్నమ్మగార్ని తీసుకొని వొత్తుంటారండి! ఓ రెండు రోజులుండి ఎలిపోతారండి."

"సరే, అల్లుడిగారి సంగతి చెపుతూ మధ్యలో మానేశావు? ఆయనకు తాగుడు ఒకటేనా, యింకా ఏమైనా అలవాట్లున్నాయా?"

"తాగుడికి అలవాటుపడ్డాక ఒకటేమిటి బాబయ్యా ఎన్నో అలవాటవుతాయండి, రేసులకెల్తారండి మలక్ పేట. పేకాట కబ్బుల్లో యీయనగారేనండి, ఏమైనా పందేలుగట్రా జరిగితే అక్కడ యీనగారేనండి."

"ఆయన పేరేమిటి?"

"పేరు మంచిదేనండి, అశోకబాబండి."

"అసలు నిన్ను పనిలోనుంచి ఎందుకు తీసేశారు?"

"అదే సెప్పటం మరిసానండి బాబయ్యా. నేను ఆ యింట్లో పదేళ్ళుగా పనిజేత్తన్నానండి బాబూ నేనా ఇంట్లో కేరేసరికి అబ్బాయిగారికీ అమ్మాయిగారికీ ఇంకా పెళ్ళిల్లే కాలేదండి. అమ్మాయిగారి పెళ్ళయినంక అల్లుడు గారొచ్చినంక నా పనులన్నింటికీ ఏదో వొంక పెడ్తుండే వోరండి. నన్ను పెద్దయ్యగారే అరే, ఒరే అనరుగాని ఈయనగారు ఒరే కారిగా అని పిలిసేవోరండి. పేదోడ్నయినా నాకూ అభిమానముండదాండి. సయించానండి.

"సరింగా వోరంరోజులకిత్తం ఆయనగారు ఓ కాని పని జేసాడండి. జేత్తా నా కల్లబడిపోయాడు. ఉత్తినే

నాతో గొడవపెట్టుకుని నేను పొగరుగా తన మీది మీది కొచ్చి కొట్టబోయానని అమ్మాయిగారికి పెద్దయ్యగోరికి లేనిపోనియ్యి జెప్పాడండి. ఎప్పుడూ కోపంరాని అయ్య గోరి కోప్పమొచ్చిందండి. నేను నిజం జెప్పేదామను కున్నానండి, కాని పోయేది ఆ యింటి పరువేనని జెప్ప లేదండి. అయ్యగోరు కోపగించి నన్ను పన్లోంచి తీసేసా రండి. నన్ను తీసెయ్యకపోతే అల్లుడుగోరు యింట్లోంచి పోతానని బెదిరించారండి."

"ఇంతకీ ఆ కాని పనేమిటో చెప్పావుకాదు!"

"పోనీయండి బాబూ, పెద్దోళ్ళు ఎలాపోతే మన కెందుకు? అయ్యగోరికి అందుకే చెప్పలేదు."

"నాతో చెప్పితే నష్టంలేదు, చెప్పు!"

"అల్లుడుగోరు దొంగతనం చేశారండి."

"దొంగతనమా?"

"అవునండయ్యా. అప్పుడే పెద్దయ్యగోరు బాంక్ నించి డబ్బు తెచ్చిపెట్టి పరుపుమీదెట్టి, బాతురూంలో కెళ్ళారండి. సరిగ్గా అదే టయానికి అల్లుడుగారొచ్చి పెట్లోంచి డబ్బు తీసేరండి. సరిగ్గా నేను ఏదోపనుండి ఆ గదిలోకి వచ్చానండి. నన్ను జూసి మళ్ళీ డబ్బు పెట్లో పెట్టేసి అరిజెంటుగా ఎల్లిపోయారండి."

"అప్పుడు ఆయన చేతిలో యేదైనా సంచిగాని పెట్టె గాని వుందా?"

"లేదండి. ఆఁ....భుజంమీద తుండుందండి. దాన్ని ఒంటిమీద కప్పుకుని ఆడావిడిగా ఎల్లిపోయారండి."

కిరణ్ మస్తిష్కంలో మెరుపులు మెరిశాయి.

కేసుకి కొస అందింది.

"చాలా సంతోషం కారయ్యా! ఇదిగో ఈ యాభై

"కూడా వుంచు" మరో యాభై నోటు కారయ్య వద్దంటున్నా బలవంతాన అతని గుప్పెట్లో నొక్కాడు.

"ఇంతకీ ఈ సంగతులన్నీ ఎందుకడిగినట్టు బాబయ్యా, మీరడగ్గానే నాకు తోసిందంతా చెప్పేశాను. అల్లుడు గారు దొంగతనం సేసినట్టు ఎక్కడా సెప్పకూడదనుకున్నాను. అయ్యగోరు పిలిపిస్తే మళ్ళీ ఆరి పంచన పంజేసుకు బతకాలనుంది."

"త్వరలో మీ అయ్యగారికి చెప్పి నీకు ఆ యింట్లో పనిప్పిస్తానులే. నేను మీ అయ్యగారి స్నేహితుడ్ని. ఆయన నీ గురించి చెప్పి నాతో బాధపడ్డాడు. నిన్ను అనవసరంగా పనిలోనుంచి తీసేశానని, నువ్వొస్తే పనిలో పెట్టుకుంటాననీ నాతో అన్నాడాయన."

కారయ్య ముఖంలో వేయి జ్యోతులు వెలిగాయి.

"అలాగాండీ! అందుకా తమరొచ్చింది? అయితే వెంటనే ఎల్లి అయ్యగోరిని కల్సుకుంటానండి."

"కంగారొద్దు. త్వరలో మీ అయ్యగోరు అమ్మాయి గోరికి కూడా ఆస్థి పంచేసి వాళ్ళిద్దర్నీ వేరు కాపురం పెట్టిస్తారట. అప్పుడు మీ అయ్యగారు ఒక్కరే వుంటారు కదా. అప్పుడు నిన్ను పిలిపించుకుంటాడట. ఆ సంగతి నీకు చెప్పిరమ్మని పంపారు. నువ్వు తొందరపడి మీ అయ్యగారిని కలవకు, నేనే యెప్పుడు రావాలో మళ్ళీ వచ్చి చెపుతాను."

"సాలా సంతోసం బాబూ! ఈ పేదవాడిమీద దయ తలిచి నన్ను ఎతుక్కుంటూ వచ్చారన్నమాట."

"ఈ వందరూపాయలు కూడా మీ అయ్యగారే ఇచ్చారు. సరాసరి యిస్తే నువ్వు తీసుకోవని యిలా ప్రశ్నలు అడిగి బహుమానంగా ఇచ్చినట్టు యిచ్చాను."

"అలాగా బాబయ్యా! మా అయ్యగోరిది యెంత దొడ్డ మనసో నాకు తెల్సు బాబూ! ఉంటానండయ్యా!"

"ఆ, వస్తాను" అంటూ కిరణ్ లేచి టయోటా దగ్గరికొచ్చాడు. యెలాగైనా హరప్రసాద్ కి చెప్పి శారయ్యకు పనిప్పించాలి. తను చెప్పిన మాట అబద్ధం కాకూడదు అనుకున్నాడు.

## 6

"రండి సార్, ఏదయినా వివరాలు తెలిశాయా?" హరప్రసాద్ ఆత్రంగా అడిగాడు.

"ఇంకా లేదండి. పరిశోధన చేస్తున్నాను. ఓసారి మిమ్మల్ని కలసిపోదామని వచ్చాను" అన్నాడు కిరణ్.

"అలాగా! కూచోండి. మా యిల్లు చూస్తారా?"

"బయటికే తెలుస్తోంది మీ యింటి వైభవం. ఓసారి మీ ఇంటి సభ్యులని పరిచయం చేసుకోవాలనుకుంటు న్నాను."

"దానికేమండి. అమ్మాయి, అల్లుడు, నేను, ఓనొఖరు, వాచ్ మన్. మొత్తం అయిదుగురమే ఈ పెద్ద భవంతిలో బతికేవాళ్ళం. అందుకే ఒంటరితనం భరించలేక అమ్మాయిని, అల్లుడ్ని యింట్లో పెట్టుకున్నాను."

ఇంతలో అటుగా ఓ యిరవై రెండేళ్ళ యువతి వచ్చింది.

హరప్రసాద్ ఆమెని చూపించి "ఈమె నా కూతురు జయప్రద.... అమ్మా వీరు డిటెక్టివ్ కిరణ్ గారు" అంటూ పరిచయాలు చేశాడు.

నమస్కార ప్రతి నమస్కారాల తర్వాత, "అల్లుడు గారు యింట్లోనే వున్నారు. పిలిపిస్తాను" అన్నాడు హరప్రసాద్.

"ఇక్కడికెందుకులెండి. నేనే వెళ్ళి మాట్లాడతాను. గది చూపించండి" అన్నాడు కిరణ్ లేస్తూ.

"అమ్మా, అల్లుడుగార్ని చూపించు" అన్నాడు కూతురితో.

జయప్రద కిరణ్‌ని వెంటబెట్టుకుని వెళ్ళింది.

పోతపోసిన విగ్రహంలా సోఫాలో కాళ్ళు నిగిడ్చి కూచుని వున్న వ్యక్తిని తన భర్తగా పరిచయంచేసి, "కూచోండి. కాఫీ తెస్తాను" అంటూ వెళ్ళిపోయింది జయప్రద.

విగ్రహానికి కదలిక వచ్చినట్టు, అతను బలవంతాన తల తిప్పి కిరణ్ వంక చూశాడు. వయసు ముప్ఫయి సంవత్సరాలలోపే అయినా భారీ శరీరం కావటంవల్ల ఓ పదేళ్ళు పెద్దగానే కనిపిస్తున్నాడు.

"మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి!" అన్నాడు కిరణ్ సూటిగా.

"నాతో ఏం మాట్లాడతారు? మా మామగారితో మాట్లాడండి" అన్నాడతను నిర్లక్ష్యంగా. మాట్లాడుతుంటే ఖరీదైన బ్రాందీ వాసన గుప్పుమంది.

కిరణ్ ముక్కు నలుపుకుని, "మరేంలేదు. మీ మామగారితో మాట్లాడే విషయమైతే అలాగే చేద్దును. కాని యిది మీ స్వవిషయం, డబ్బు విషయం, దొంగనోట్ల విషయం! పైవాళ్ళకెలా చెప్పను?" అన్నాడు.

అశోక్‌బాబు నిటారుగా కూచున్నాడు.

"ఏమిటి మీరంటున్నది?"

"నాకు శారయ్య అంతా చెప్పాడు. మీరు బుకాయించటానికి ప్రయత్నించవద్దు. దొంగిలించిన రెండు లక్షలు ఏం చేశారు?"

"నీవేమిటి, దొంగిలించట మేమిటి? ఆ శారయ్యగాడు చెప్పట మేమిటి? మీకేమైనా మతిపోయిందా?"

"నాక్కాదు. పోలీసులకి మీ దొంగనోట్ల వ్యవహారం చెపితే అప్పుడు మీకు నిజంగా పిచ్చెత్తుతుంది."

అశోక్ కొంచెం తగ్గాడు. ఏం మాట్లాడలేదు.

"ఇప్పటిదాకా మీ మామగారిముందు మీ పరువు ఉజ్వలంగా వెలిగిపోతోంది. జరిగిన విషయం చెపితే ఆయన తక్షణం మిమ్మల్ని నడివీధిలోకి గెంటడమేకాదు, పోలీసులు కూడా తగిన విధంగా మర్యాద చేస్తారు."

అశోక్ పెదవి విప్పాడు. "ఇంతకీ మీకేం కావాలి? ఎందుకు నా వెంట పడ్డారు?"

"నాకు దొంగనోట్ల గురించి నిజానిజాలు కావాలి. మీరు ఆ రెండు లక్షలు ఏం చేశారో తర్వాత చెప్పుదురు గాని! మీరీ దొంగనోట్ల చలామణీ ఎప్పట్నుంచి చేస్తున్నారు? శారయ్య చూసేసరికి మీరు దొంగనోట్లు బ్రీఫ్‌లో పెట్టేసి మంచి నోట్లు తుండుగుడ్డలో చుట్టేశారు. కాని ఆ అమాయకుడు తనని చూడగానే తీసిన డబ్బు బ్రీఫ్‌లో పెట్టేశారనుకున్నాడు. అవి నకిలీవని అతనికి తెలీదు. ఆ తర్వాత పదిలంగా ఆ బ్రీఫ్ బీరువాలో దాచుకున్న మీ మామగారికి అంతకంటే తెలీదు."

అశోక్ అదిరిపడ్డాడు. శూన్యంలోకి చూస్తున్నాడు.

"మీ రెండుకీ దొంగనోట్ల చలామణీలో తలమూర్చారు. ఎవరు ఆ ముఠా? మీకు వాళ్ళకి ఏమిటి టరమ్స్? మీ వాటా ఎంత?"

కిరణ్ మాటలకు అడ్డుపడి, "నాకు, వాళ్ళకి ఏం

సంబంధం లేదండి. నాకు అవసరపడి రెండు లక్షలు మా మామగారివి తీసుకున్నమాట నిజం. అసలు మామగారి బ్రీఫ్‌లో రెండు లక్షలున్న విషయంకూడా నాకు అతనే చెప్పాడు" అన్నాడు.

"ఎవరను?"

"నాకు దొంగనోట్లిచ్చినతను."

"ఎందుకిచ్చాడు?"

"మా మామగారి బ్రీఫ్‌లో పెట్టమని!"

"వివరంగా చెప్పండి."

"చెపుతాను—కాని ఈ విషయాలేవీ నా భార్యకు గాని, మా మామగారికిగాని చెప్పకూడదు."

"అలాగే, చెప్పండి!"

అశోక్ ఏదో చెప్పబోయేంతలో జయప్రద రెండు కాఫీ కప్పుల్తో వచ్చింది.

"మీరు తీసుకోండి. నేను నాన్నగారితో వాళ్లో తీసుకుంటాను" అని వెళ్ళిపోయింది.

కిరణ్, అశోక్ వంక చూశాడు.

అశోక్ గొంతు సవరించుకున్నాడు.

"అతనెవరో నాకు తెలీదు. ఇదివరలో యెప్పుడూ చూడలేదు కూడా. ఉదయం ఎంతో తెలిసినవాడిలా నా గదికొచ్చాడు. వాచ్‌మన్ నా స్నేహితుడినని చెప్పాడని లోనికి వదిలాడు. సమయానికి జయప్రద లేదు. అర్చన చేయించటానికి కోవెలకెళ్ళింది. మామగారు అరగంట క్రితమే బయటికి వెళ్ళిపోయారు.

"నువ్వెవరని అడిగితే అతను నవ్వి వూరుకున్నాడు. నీకు రెండు లక్షలొచ్చే మార్గం చెపుతాను, నాకేమి స్తావు? అనడిగాడు. ఏం కావాలని అడిగాను. అతను

తన వెంట తెచ్చిన బ్రీఫ్‌లోనించి రెండులక్షల వందనోట్లు పైన పెట్టాడు. నేను ఆశ్చర్యపోయాను.

"అతను నవ్వి, యివి నిజం నోట్లుకాదు, నకిలీవి. నిజం నోట్లు మీ మామగారు మరో గంటలో యిక్కడికి తీసుకొస్తాడు. అందులో నోట్లు తీసుకుని, వీటిని బ్రీఫ్‌లో సర్దెయ్యి సమయం చూసి! అంతే, నాకేం ప్రతిఫలం అక్కర్లేదు" అన్నాడు.

"నేను మొదట ఒప్పుకోలేదు. ముక్కూ మొఖం ఎరగని వ్యక్తి నాతో టరమ్స్ మాట్లాడుతుంటే నాకే ఏదోలా అనిపించింది. తిరస్కరిద్దామనుకున్నాను. కాని రెండు లక్షల రూపాయలు వదులుకోవటానికి మనస్కరించలేదు. నా అవసరాలు అలాంటివి!

"కనీసం కారణం చెప్పమన్నాను. అతను చెప్పిందేమిటంటే—వాళ్ళ గ్యాంగ్ దొంగనోట్లని చలామణి చేయబోతోందట. ఆ నోట్లు ముందుగా మా మామగారిద్వారా బయట చలామణీ చేస్తారట. ఆ నోట్లు ఎవరూ అనుమానించకపోతే అప్పుడు ధైర్యంగా వాటిని అన్నిచోట్లా చలామణి చేయిస్తారట.

"మా మామగారు కేసులో యిరుక్కుంటేనో అనడిగాను. అటువంటిదేం రాదని, మా మామగారివంటి కోటీశ్వరుడ్ని ఎవరూ అనుమానించరనీ, అందుకే ఆయన్ను మొదటసారిగా తమ ప్రయోగానికి యెన్నుకున్నామనీ అతను చెప్పాడు. నేను నమ్మాను. ఎవరికీ ఈ సంగతి చెప్పొద్దని అతను మరీమరీ చెప్పి వెళ్ళిపోయాడు.

"ఆ తర్వాత ఓ గంట తర్వాత మామయ్య బ్రీఫ్‌తో బ్యాంకునించి కేష్ తెచ్చారు. నేను వెంటనే పథకం అమల్లో పెట్టేశాను. ఆ సంగతి కారయ్య చూశాడనే

ఉక్రోషంతో వాడ్ని యింట్లోంచి వెళ్ళగొట్టించాను. అంతే, అంతకుమించి ఆ దొంగనోట్ల విషయం నాకేం తెలియదు" గుక్క తిప్పుకోకుండా చెప్పేశాడు.

"ఆ వ్యక్తి ఎలా వుంటాడు?"

"వయసు ముప్పయి వుండొచ్చు. ఎర్రగా పొడవుగా వున్నాడు. లాల్చీ, పైజామా వేసుకున్నాడు...."

కిరణ్ మనసులో పిల్లిగడ్డం వ్యక్తి మెదిలాడు. అతనన్న మాటలు చెవుల్లో రింగుమన్నాయి. అది మరో అవతారమన్నమాట! పిల్లిగడ్డం కూడా వేషమే! అయితే, అశోక్ చెప్పిన గుర్తులు చాలావరకు పిల్లిగడ్డం వ్యక్తితో సరిపోతున్నాయి. అతనే ఈ నోట్ల చలామణిలో అగ్రస్థానం వహిస్తున్నట్లు తోస్తోంది.

ఇంతకీ ఎవరతను? తక్కిన ముగ్గురు ఎవరు? ఇంకా వాళ్ళు ఎంతమంది వున్నారు? తనని ఫోన్‌లో బెదిరించిన వాళ్ళెవరు? తన యింటికొచ్చిన వాళ్ళెవరు?

కిరణ్ అకస్మాత్తుగా అశోక్ కాళ్ళవంక చూశాడు. ఏనుగు పాదాల్లాగా వున్నాయి. పదకొండు అంగుళాలకి తక్కువ పొడవులేదు కాలు. కచ్చితంగా అతను కాదు. యిక అడగనక్కర్లేదు!

"మీరిప్పుడు చెప్పిన విషయాలు నేను నమ్మొచ్చా?"

"ఎంతమాట సార్! నేను డబ్బుకోసం నీతిమాలిన పని చేసినంత మాత్రాన నాది నీతిలేని బతుకు కాదు. నేను చెప్పినవి నూటికి నూరుపాళ్లు నిజం!"

"ఆల్ రైట్! తెలిసో తెలీకో మీరు కూడా దేశద్రోహులతో చేతులు కలిపారు. అయితే అతను మీకు చెప్పినట్లుగా నోట్లను చలామణికి తీసుకురావటానికి కాదు మీ మామగారిని ఎన్నుకొన్నది! ఆ నోట్లను చలామణి చేసే

సందర్భంలో మీ మామగారు పోలీసులకి పట్టుబడాలని! మీ మామగారి పరువు ప్రతిష్టలు వీధిన పడాలని. అయితే మీ మామగారు ముందుగానే మేలుకున్నాడు."

అశోక్ నోరు తెరుచుకుని వింటున్నాడు.

"నేను వస్తాను" డిటెక్టివ్ కిరణ్ లేచి బయటికి నడిచాడు.

## 7

"ఏమైనా తెలిసిందా?" ఆతృతగా అడిగాడు శ్రీనివాస్.

"నీకు మళ్ళీ ఎలాంటి మెసేజెస్ రాలేదా?" ఎదురు ప్రశ్న వేశాడు కిరణ్.

"లేదు. ఇదివరలో ఫోన్ చేసిన వ్యక్తి ఎవరో కూడా తెలీదు. నేను పంపిన మెసేజ్‌లన్నీ ఏమైపోయాయో అర్థంకాలేదు. చాలా తెలివిగా మన కళ్ళముందే ఆ ద్రోహులు తప్పించుకుపోయారు!"

"వాళ్ళని అంత తేలిగ్గా వదులుతామా? చూద్దాం, ఎక్కడికి పోతారు?"

కిరణ్, శ్రీనివాస్‌కి ఏం చెయ్యాల్సిందీ చెప్పాడు. శ్రీనివాస్ శ్రద్ధగా విని తలూపాడు.

కిరణ్ టయోటా స్టార్టుచేశాడు. సరాసరి జి.ఎన్.టి. రోడ్డున పోనిచ్చాడు.

సాయంత్రం ఆరుగంటల సమయం. రోడ్డు మామూలుగానే రద్దీగా వుంది. లోడ్ లారీలు నిండు గర్భిణీల్లాగా రోడ్డున వస్తూ పోతున్నాయి. రకరకాల గూడ్సు ప్రతి రోజు హైదరాబాదుకి రవాణా అవుతునే వుంటాయి. హైదరాబాదునించి జిల్లాలకు కూడా అలాగే సరుకులు చేరవేస్తుంటాయి ప్రతిరోజు, లారీలు.

మలుపు దాటాడు.

సూర్యాపేట జంక్షన్ దగ్గరికొచ్చాడు.

ఎనిమిది గంటలు చూపిస్తోంది గడియారం.

టయోటాని పక్కగా తీసి పార్కు చేశాడు. కారు దిగాడు. కోటు జేబు తడుముకున్నాడు. రివాల్వర్ గట్టిగా తగిలింది.

కారు దిగేముందు యిగ్నిషన్ బోర్డు పక్కనున్న బటన్ నొక్కాడు కిరణ్.

అంతవరకు క్రీం కలర్‌లో వున్న టయోటా తనరంగు మార్చుకుంది. నీలిరంగుకి మారింది. అదంతా టయోటా పైన తాత్కాలికంగా ఏర్పడ్డ మైకా కాగితం పొర అనీ, నీలిరంగు ఆ పొర దేనని చూసేవాళ్ళు దాని ఒరిజినల్ కలర్ నీలిరంగు దేనని పొరపడతారనీ కిరణ్‌కి తెలుసు.

బయటనించి దాని అద్దాల తలుపులన్నీ మూసి లాక్ చేసేశాడు. టార్చి చేతపట్టుకున్నాడు.

రోడ్ జంక్షన్ దగ్గర నించున్నాడు.

లారీలు వస్తున్నాయి. పోతున్నాయి. చిన్న కార్లు ఏవైనా వస్తున్నాయేమోనని చూశాడు. కాని ఏమీ రావటంలేదు.

ఓసారి తనవంక పరీక్షగా చూశాడు. సన్నిహితులు కూడా తనని యీ క్షణంలో గుర్తుపట్టడం కష్టం. పూర్తిగా సిక్కు వేషంలో వున్నాడు. గడ్డం, మీసం, తలపాగా అన్నీ అచ్చు పంజాబీలా మేకప్ చేసుకున్నాడు.

లాంగ్ జర్నీ చేసే లారీలు ఆ జంక్షన్ దగ్గర ఆగుతుంటాయి. అక్కడ కిళ్ళీబడ్డీలు, ఓ మాంసాహార హోటలు, పెట్రోలు బంకు వెలిశాయి. నిత్యం అక్కడ

డ్రయివర్లు తిని తాగుతుంటారు. ఓ గంట విశ్రాంతి అనంతరం తమ ప్రయాణాలు కొనసాగిస్తూంటారు. రాత్రిళ్ళ ఎక్కువగా లారీలు తిరుగుతుంటాయి.

కిరణ్ ఆలోచిస్తున్నాడు. సూర్యాపేటవైపు గాని ఖమ్మం రోడ్డునగాని వాళ్ళు తప్పించుకుపోలేదు. మూడో దారినుంచే తప్పించుకున్నారు. అది సరాసరి అడవిలోకి దారితీస్తోంది. అంటే ఆ దుండగుల స్థావరం అడవిలోనే అయివుండాలి. లేదా అడవిలో యీ నోట్లను చేతులు మార్చుకుని, మళ్ళీ ఎవరిమట్టుకు వారు విడిపోతూ వుండి వుండాలి.

ఇలా బహుశా ప్రతిరోజు జరక్కపోవచ్చు. కాని, అలవాటుపడ్డ వ్యక్తులు సాధారణంగా తమ సంకేత స్థలాన్ని మాటిమాటికీ మార్చరు. అందుకే తను ధైర్యంగా యిక్కడికొచ్చారు. వాళ్ళు యీ రోజు కాకపోయినా మరో రోజైనా యీ స్థలానికి వచ్చి తీరతారని తనకు గట్టి నమ్మకం!

వాచీ చూసుకున్నాడు. గడియారం పది గంటలు చూపిస్తోంది. హోటలు దగ్గర రద్దీ పెరుగుతోంది.

మొన్న యింతకంటె ముందే వాళ్ళు యిక్కడి కొచ్చారు. బహుశా ఎనిమిదిగంటలవుతుంది. ఈ రోజు యిప్పటిదాకా రాలేదు. తన ఉనికి వాళ్ళకు తెలిసే అవకాశంలేదు. తనని ఎవరూ గుర్తించే అవకాశం కూడా లేదు! టయోటా కూడా రంగు మార్చుకుంది.

హోటల్ దగ్గర జనం పలచబడిపోయారు. అంత వరకు కోలాహలంగా వున్న ఆ ప్రదేశం నిశ్శబ్దంగా తయారయింది. లారీలు వెళ్ళిపోయాయి. ఒకటీ, అరా యింకా మిగిలిపోయాయి.

పదకొండున్నర అయింది. దుండగులు రాలేదు.

కిరణ్ యిక తిరిగి వెళ్ళిపోదామన్న నిర్ణయానికొచ్చాడు. కారు దగ్గరికి నడవబోయాడు.

సరిగ్గా అదే సమయంలో హైద్రాబాద్ నించి ఏదో చిన్న కారు వస్తూన్నట్టు హెడ్ లైట్సునిబట్టి గ్రహించాడు.

తన కారు దగ్గరికి రెండంగల్లో వెళ్ళి బోనెట్ ఎత్తాడు. సీరియస్ గా రిపేరు చేస్తున్నట్టు నటించసాగాడు.

ఆ కారు దగ్గర పడింది. క్రీగంట చూశాడు.

అది డాట్సన్ కారు. చాలా వేగంగా వస్తోంది.

ఎటూ ఆగకుండా అడవిదారివైపు దూసుకుపోయింది.

కిరణ్ కళ్ళు మెరిశాయి.

అనుమానంలేదు. అందులో వున్న వ్యక్తులు ఖచ్చితంగా దొంగనోట్ల స్మగ్లర్సే. వాళ్ళకి ఏమాత్రం అనుమానం రాలేదనటానికి నిదర్శనం-సరాసరి తమ స్థావరం వైపు దూసుకుపోవటమే!

కిరణ్ బోనెట్ మూసేశాడు.

చకచక నడవసాగాడు. అడవిదారి అయినా కంకర రోడ్డుంది. బహుశా లారీలు లోపలికి వెళ్తూ వస్తూ వుండొచ్చు! అడవినుంచి కలప, బొగ్గు రవాణా అవుతుంటాయి.

# 8

కిరణ్ నడుస్తున్నాడు.

తను చేస్తున్న పని చాలా ప్రమాదకరమైందని అతనికి తెలుసు. వాళ్ళకేమాత్రం దొరికినా నిలువునా చంపేస్తారని తెలుసు. అయినా అతను పట్టు విడవలేదు. కారులో వెళ్తే వాళ్ళకి కారు శబ్దంవల్ల తెలిసిపోతుంది.

అందుకే నడిచే వెళ్ళటానికి నిర్ణయించుకున్నాడు. తను ఒక్కడే కాబట్టి సమయానికి ఏ పొద చాటునో, చెట్టు చాటునో దాక్కొని అన్నీ గమనించవచ్చు.

కిరణ్ జాగ్రత్తగా ముందుకి నడుస్తున్నాడు. అర చేయి అడ్డుపెట్టి టార్చి ఫోకస్ చేసుకుంటూ వెళు న్నాడు. తనకి దారి కనిపించటానికి కాళ్ళముందుమాత్రమే వెలురుపడేలా జాగ్రత్త తీసుకున్నాడు.

దూరంగా కారు కనిపిస్తోంది. అక్కడినుంచి అడివి మొదలయినట్టుంది. చెట్లు చాలా దట్టంగా కనిపిస్తు న్నాయి. దారికి అటు ఇటు చెట్లున్నాయి అక్కడినుంచి కిరణ్ సరాసరి రోడ్డునకాకుండా చెట్లపక్కగా నడవ సాగాడు.

చటుక్కున ఎవరైనా గమనించినా చెట్టు చాటున దాక్కోవచ్చు. అక్కడ పొదలు కూడా దట్టంగా వున్నాయి. యెండుటాకులమీద జరజర పాకుతున్న చప్పుళ్ళు తరచు వినిపిస్తూనే వున్నాయి. ముందుగానే మోకాళ్ళవరకు కవర్ చేసే షూ — ఫైర్ సర్వీస్ వాళ్ళు వేసుకునే షూ—ధరించాడు కిరణ్. ఏ విష పురుగైనా ముట్టుకున్నా మరేం ప్రమాదంలేదు.

కారు సమీపించింది. అదే డాట్సన్ కారు.

కిరణ్ అడుగులో అడుగేస్తూ నడుస్తున్నాడు.

కారు దగ్గర ఎవరూ లేరు. అసలు అక్కడ జన సంచారమే కనిపించటంలేదు. వంగి కారు చక్రాలనుంచి గాలి విప్పేశాడు. తుస్సుమంటూ చక్రాలు భూమిని కరుచుకున్నాయి.

కిరణ్ చుట్టూ పరిశీలనగా చూశాడు. చీకటికి అతని కళ్ళు బాగా అలవాటుపడ్డాయి.

అడవి లోపల ఎక్కడో వెలుగు కనిపిస్తోంది.

కిరణ్ అడవిలోకి ప్రవేశించాడు. అటు యిటు కాషస్‌గా చూసుకుంటూ నడుస్తున్నాడు.

వెలుగు కనిపించిన వైపు అడుగులు వేశాడు.

అది ఫారెస్టు గార్డు వుండటానికి కట్టబడ్డ నివాస గృహం! అక్కడే లైటు కనిపిస్తోంది.

పెట్రోమాక్స్ లైటు వెలుగుతోందక్కడ.

అక్కడ అయిదుగురు వ్యక్తులున్నారు.

అందులో పిల్లిగడ్డం వ్యక్తిని వెంటనే గుర్తుపట్టాడు కిరణ్. అతనిప్పుడు బవిరిగడ్డం బాగా పెంచుకుని వున్నాడు. మీసాలు కూడా బాగా పెంచినట్టు మేకప్ చేసుకున్నాడు.

అందులో పొటుగా మొద్దుగా వున్న వ్యక్తిని చూడగానే త్రుళ్ళిపడ్డాడు కిరణ్.

అతను శారయ్య! వరప్రసాద్ నౌఖరు. అమాయకుడిగా తను ఘోరంగా పొరబడ్డ శారయ్య! అతనికీ ఈ దొంగనోట్లతో సంబంధముందనుకోవాలంటే అతని మనసు అంగీకరించటంలేదు. ఏదో ప్రలోభపెట్టో, అతని భార్యాబిడ్డల్ని చంపుతానని బెదిరించో వశపరచుకుని వుంటారనుకున్నాడు కిరణ్. అందుకే ఆ రోజు చెవర్లెట్ కారు తనకి ఆ ప్రాంతంలో కనిపించింది.

తక్కిన ముగ్గురిలో ఒకడు తనని రివాల్వర్ హేండిల్‌తో గాయపరిచినవాడు. మిగిలిన యిద్దరు తనకి కొత్త. ఆ రోజు శారయ్య యింటి సమీపంలో పెట్టెలు తన కార్లోకి మార్చిన వాళ్ళను గుర్తుచేసుకున్నాడు. కాని పోలికలు సరిపోవటంలేదు.

బవిరిగడ్డం వ్యక్తి ముందు నాలుగు చెక్కపెట్టె

లున్నాయి. వాటినిండా వందరూపాయిల నోట్లు! చిత్తు కాగితాల్లాగా వున్నాయి.

తక్కిన యిద్దరు వ్యక్తులకీ వాటినీ అప్పగిస్తున్నాడు. వాళ్ళు బ్రీఫ్‌కేసు తెరిచి నోట్ల కట్టలు చూపించారు. బవిరిగడ్డం వ్యక్తి వాటిని పైకితీసి పరీక్షగా చూసుకుని సంతృప్తిగా తలూపాడు.

కిరణ్‌కి అర్థమయింది. నాలుగు చెక్కపెట్టెల్లో వున్న దొంగనోట్ల ఖరీదు ఆ బ్రీఫ్‌కేసులోని నిజం కరెన్సీ నోట్లు! బహుశా ఏ పదో వంతుకో అమ్మకం జరిగిపోతుండ వచ్చు. ఆ లెక్కన ఆ చలామణీచేసే వ్యక్తికి పదిరెట్లు లాభం దొరుకుతుంది.

కిరణ్ పళ్ళు కొరికాడు. అందరూ ఈ దేశంవాళ్ళేనని పోలికలే చెబుతున్నాయి. దేశద్రోహులు! ఇలాంటి వాళ్ళని నిలువునా చీరెయ్యాలి.

కిరణ్ చెయ్యి రివాల్వర్ మీద బిగుసుకుంది.

ఇంతలో మరో ముగ్గురు వ్యక్తులు లోపల్నించి వచ్చారు.

ఆ తక్కిన యిద్దర్నీ కిరణ్ గుర్తుపట్టాడు. వీళ్ళే ఇదివరకు చెవర్లెట్ నుంచి చెక్కపెట్టెల్ని తన కారులోకి మార్చినవాళ్ళు. మూడో వ్యక్తి ఫారెస్టు గార్డులా వున్నాడు. ఖాకీ బట్టలు వేసుకున్నాడు. ఈ దేశద్రోహుల లిస్టులో అతనూ చేరిపోయాడన్నమాట! అందుకే వాళ్ళు ఆ ప్రదేశాన్ని సంకేత స్థలంగా పెట్టుకున్నారు. అతని మద్దతుతోనే.

కిరణ్ లోపల్నుంచి వచ్చిన ఆ యిద్దరు వ్యక్తుల కాళ్ళవంక చూశాడు. ఎస్, అవే చెప్పులు. అవే కొలతలు. తనకి బాగా గుర్తు. వాళ్ళ చెప్పులతో వచ్చిన

దుమ్ముకూడా యిక్కడి జేగురు బూడిదలాగానే వుంది! ఆ రోజు తన యింటికొచ్చి గూర్ఖాని గాయపరిచిన వాళ్లు వీళ్ళే! గూర్ఖా చెప్పిన పోలికలు వీళ్ళలో స్పష్టంగా వున్నాయి.

ఇద్దర్లో ఒకడు పచ్చి నెత్తురు తాగే రాక్షసుడిలా వున్నాడు! ఆ రోజు చెక్కపెట్టెలు మార్చేసమయంలో తను వీళ్ళ పోలికలు సరిగ్గా చూడలేదు. వాళ్ళు కూడా పరిశీలించే అవకాశం దొరకలేదు. లేకుంటే ఆ వాడే గుర్తుపట్టి వుండేవాడు.

ఎక్కడినుంచో లారీ శబ్దం వినిపించింది.

కిరణ్ తల తిప్పి చూశాడు. లారీ వచ్చి బయట ఆగింది.

శారయ్య ఓ చెక్కపెట్టె భుజంమీదికి ఎత్తుకున్నాడు. లోపల్నుంచి వచ్చిన యిద్దరు వ్యక్తులు చెరో పెట్టె ఎత్తుకున్నారు. తనని గాయపరిచిన వ్యక్తి నాలుగో పెట్టె ఎత్తుకున్నాడు.

బ్రీఫ్ యిచ్చిన వ్యక్తులిద్దరు బవిరిగడ్డం వ్యక్తితో కరచాలనం చేశాడు. కరెన్సీ చలామణి కావటానికి ఉరకలు వేస్తోందన్నమాట!

సమయం చేజారిపోతోంది. కిరణ్ చెవులు రిక్కించి విన్నాడు. ఎక్కడా ఎలాంటి శబ్దమూ లేదు.

పెట్టెలు లారీలో లోడవుతున్న చప్పుడు వినిపిస్తోంది. బవిరిగడ్డం వ్యక్తి, ఫారెస్టుగార్డుతో బాటు అందరు లారీ దగ్గరకు వెళ్లారు.

శారయ్య లారీ మీదికెక్కి లోడ్ చేస్తున్నాడు.

నాలుగు పెట్టెలు వేసేశాడు. పైన ఏవో బస్తాలు సర్దేస్తున్నాడు. అప్పటికే లారీలో కొంత లోడ్ వుంది.

అవి తౌడు బస్తాలో చిట్టు బస్తాలో అయి వుంటాయి. చాలా తేలిగ్గా పైకి లేపుతున్నాడు కారయ్య. హైద్రాబాదునుంచి తౌడు లోడ్ జిల్లాలకు రవాణా కావటం తనకు తెలుసు!

కారయ్య దిగిపోయాడు.

లారీ కదలటానికి సిద్ధంగా వుంది. కిరణ్ యిక ఆలస్యం చెయ్యలేదు. బవిరిగడ్డం వ్యక్తి దగ్గరగాని, తనని గాయపరచిన వ్యక్తి దగ్గరగాని ఆయుధాలేవీ కనిపించటంలేదు. బహుశా తమని ఎవరూ పట్టుకోలేరన్న ధీమాతో వున్నట్టున్నారు. లారీ స్టార్టయింది.

కిరణ్ వెంటనే గురిచూసి ముందు చక్రాన్ని కాల్చాడు. వెంటనే గాలిపోయి చక్రం నేలకి అతుక్కుంది.

ఒక్కసారిగా అందరిలోను కలకలం చెలరేగింది.

బవిరిగడ్డం చేతిలోకి పిస్తోలు వచ్చేసింది.

తనని గాయపరిచిన వ్యక్తి చేతిలో కూడా పిస్తోలు నిగనిగ మెరుస్తోంది.

కారయ్య, ఫారెస్టుగార్డు, తక్కిన యిద్దరు వ్యక్తులు, లారీ డ్రయివరు, కరెన్సీ తీసుకున్న యిద్దరు మనుషులు గుంపుగా కూడిపోయారు.

వాళ్ళు తొమ్మిదిమంది! తనొక్కడు.

బవిరిగడ్డం వ్యక్తి కిరణ్ వైపు గురిచూసి కాల్చాడు. అదే సమయంలో రెండో వ్యక్తి కూడా కాల్చాడు. వాళ్ళకు కిరణ్ కనిపించటంలేదు. కాని కిరణ్ కి వాళ్ళందరూ కనిపిస్తున్నారు.

కిరణ్ బవిరిగడ్డం వ్యక్తి చేతికి గురిచూసి కాల్చేశాడు. అతని చేతిలోని పిస్తోలు దూరంగా ఎగిరిపడింది.

రెండో వ్యక్తి మళ్ళీ కాల్చాడు. కిరణ్ ఈసారి కూడా ఆ గుండు దెబ్బనుంచి తప్పించుకున్నాడు.

కర్కశంగా వున్న వ్యక్తి పరుగెత్తుకెళ్ళి కిందపడి వున్న రివాల్వర్‌ని అందుకోవాలనుకున్నాడు కాని కిరణ్ అతని కాలికి గురిచూసి కాల్చగానే ముందుకి అమాంతం కూలిపోయాడతను. తక్కినవాళ్ళు ధైర్యం చెయ్యలేక పోయారు.

కిరణ్ బుల్లెట్స్ లోడ్ చేసుకోవటానికి ప్రయత్నించే లోపల రెండో వ్యక్తి కిరణ్ ఉనికిని గుర్తించి సరిగ్గా గురిచూసి కాల్చాడు.

కిరణ్ చేతిలోని రివాల్వర్ ఎగిరి అవతలపడింది. అతని కుడిచేతికి గాయమైంది. రక్తం ధారకట్టింది.

కిరణ్ చటుక్కున పక్క పొదల్లోకి తప్పుకున్నాడు. తన ఉనికి తెలిసిపోయింది. వాళ్ళకి దొరికిపోయినట్టే!

ఆ వ్యక్తితోపాటు అందరికీ కిరణ్ ఆయుధం పడిపోవటం స్పష్టంగా వినిపించింది. ధైర్యంగా పొదవైపు పరుగెత్తుకొచ్చేశారు.

సరిగ్గా అదే సమయంలో మహా వేగంగా రెండు జీప్‌లు దూసుకొచ్చేశాయి. దాన్నిండా పోలీసులు!

"ఎవరూ కదలొద్దు" అన్న ఇన్‌స్పెక్టర్ శ్రీనివాస్ కంఠం గంభీరంగా వినిపించింది. కిరణ్ తేలిగ్గా స్వాస వదిలాడు.

బవిరిగడ్డం వ్యక్తి, అతని అనుచరులు, కరెన్సీ కొనుక్కున్న వ్యక్తులు, లారీ డ్రయివరు, ఫారెస్టుగార్డు-అందరూ దొరికిపోయారు.

శ్రీనివాస్ కిరణ్ దగ్గరకు పరుగెత్తుకొచ్చాడు, కిరణ్

పొదనుంచి బయటికి రాగానే.

బవిరిగడ్డం వ్యక్తి క్రూరంగా చూశాడు కిరణ్ వంక.

"నిన్నారోజే చంపకుండా వదలటం పొరపాటయి పోయింది. మావాడు గాయపరచి వూరుకున్నాడుగాని, నేను చంపేసి తోసి వుండేవాడ్ని! ఈ ఒక్కసారికే ఈ స్థావరంలో పని ముగించుకుని తరవాత సంకేత స్థలం మార్చేయాలనుకున్నాం. కాని వీళ్ళకు చానాళ్ళ క్రితమే ఈ చోటు గురించి చెప్పి వుండటంవల్ల యిక్కడికి రాక తప్పలేదు" అంటూ తన బాధ వెళ్ళగక్కుకున్నాడు ఆ వ్యక్తి.

కిరణ్ తన యింటికొచ్చిన వ్యక్తులిద్దర్నీ చూసి, "మీకు హరప్రసాద్ ఏం హాని చేశాడు? ఎందుకు అతని వెంటపడ్డారు?" అనడిగాడు.

కర్కశంగా వున్న వ్యక్తి చెప్పాడు. "నేను అతని థియేటర్లో మేనేజర్ గా పనిచేశాను. నన్ను పనినుంచి తొలగించాడు. దాంతో ఎలాగైనా నా కక్ష తీర్చుకోవాలనుకున్నాను. అందుకే యిదిగో మావాడి ద్వారా రెండు లక్షల దొంగనోట్లు హరప్రసాద్ అల్లుడిద్వారా మార్పిడి చేయించాను. ఆ విషయంలో నాకు శారదయ్య చాలా సాయం చేశాడు. అవకాశం దొరికితే హర ప్రసాద్ అల్లుడ్నికూడా ఈ దొంగనోట్ల కేసులో యిరి కించాలనుకున్నాను...."

"అయితే పార్థసారధిని నువ్వేనన్నమాట!" అన్నాడు కిరణ్. అవునని తలూపాడతను. అశోక్ పొరబడి బవిరి గడ్డం వ్యక్తి పోలికలు చెప్పాడు. కాని కేష్ తెచ్చి యిచ్చినది ఆ రెండో వ్యక్తి. అతనికి, బవిరిగడ్డం మనిషికి

దగ్గర పోలికలున్నాయి.

"మీరేనా ఆ రోజు నా యింటికొచ్చి నా గూర్ఖాను గాయపరిచినది?"

పార్థసారధి తలూపాడు.

"జంక్షన్‌లో నీ ఫొటో కనిపించింది. నువు చెప్పావు కదా! అయితే మధ్యలో ఓ టీపు ట్రబులిచ్చింది. అందుకే రావటం బాగా ఆలస్యమయింది" అన్నాడు శ్రీనివాస్.

కిరణ్ నీరసంగా నవ్వాడు.

—:అయిపోయింది:—

సీరియల్

# విషసర్పాల సికిందర్

(గత సంచిక తరువాయి)

ఆమె ఎంత వేగంగా నడుస్తోందో, అంత వేగంగానూ కుడిచేతిలో హేండ్ బ్యాగు వూగుతోంది. నిండుగా కప్పుకున్న తెల్లని పైట ఆమె మొహాన్ని బాగా మరుగు పర్చింది. కళ్ళు మాత్రమే జ్యోతుల్లా వెలుగుతూ కనిపిస్తున్నాయి. ఆ కళ్ళలో మృత్యుదేవత కదలాడుతోంది.

ఆమె రోడ్లమీద అక్కడక్కడా కనిపించే బీటు పోలీసుల్ని ప్రక్క సందుల్లోకి తిరుగుతూ తప్పించుకుం టోంది. ఎక్కడా ఏ వ్యాను హెడ్ లైట్లూ తనమీద పడకుండా జాగ్రత్తపడింది. అలా ఆమె అరగంట క్రితం యూనివర్సిటీ రోడ్డునుంచి బయల్దేరి ప్రస్తుతం రాం నగర్ లో నడుస్తోంది....

రాంనగర్ లో తనకు సూచించబడ్డ వీధికి చేరుకుని ఆమె ఇంటి నెంబర్ కోసం చూడసాగింది. ముప్పై అడుగుల్లో సరిగ్గా ఆ ఇంటిని చేరుకుంది. పైట వదిలేసి, హేండ్ బ్యాగును తెరుస్తూ ఆ ఇంటి తలుపు కొట్టింది.

ఆమె కొట్టిందే తడవుగా తలుపు తటాలున తెరచు

కుంది.

అప్పటికింకా సిద్ధంకాని ఆమె అప్రయత్నంగా వెనక్కి దూకింది.

తలుపు పూర్తిగా తెరుచుకుంటూండగానే, ఆమె సంభాళించుకుంటూ బ్యాగులోంచి కత్తితీసి పట్టుకుంది. అడుగు ముందుకేసింది.

"ఎవరు కావాలి?" అడుగుతోంది, తలుపు తీసిన యువతి.

"సుధాకర్ వున్నాడా?" అడిగిందామె దగ్గరికెళ్తూ.

ఆ యువతి తృళ్ళిపడి వెనక్కి జరిగింది. "నువ్వు సుహాసినివి కదూ?"

"అవును—నువ్వెవరు?"

"నేను.. నేను.." నీళ్ళు నమిలిందా యువతి. "ముందు లోపలికిరా, మాట్లాడుకుందాం!"

"ఏం మాట్లాడాలి, సుధాకర్‌ని పిలువ్!" రెట్టించిందామె కత్తి చూపుతూ.

ఆ యువతి బెదిరిపోయింది. "అలా చూపకు, ప్లీజ్."

"నువ్వెవరు? సుధాకర్ కేమవుతావు?"

"ప్లీజ్, లోపలికిరా, మాట్లాడుకుందాం. నిన్నేమీ చెయ్యం—" ఆ యువతి లోపలికి నడిచింది వేగంగా, "సుధాకర్, ఆమె వచ్చేసింది!"

"వచ్చేసిందా? అక్కడే ఆపు!" మగ గొంతు అంది లోపలినుంచి.

ఆమె కత్తినలాగే పట్టుకుని అడుగుపెట్టింది లోపలికి.

ఆ యువతి బలవంతాన నవ్వింది. ఆ యువకుడు ఆమె వెనుక నిల్చున్నాడు బెదురుతూ. వాళ్ళిద్దర్నీ అనుమానంగా చూడసాగిందామె.

"నేను రమాదేవిని. నేనే వ్రాశా నా ఉత్తరం—ఆవేశంలో. తర్వాత తప్పు తెలుసుకున్నాను. సుధాకర్ నా కన్యాయం చేయనన్నాడు. మేమిద్దరం ఒక్కటయ్యాం. నన్ను మన్నించు, నీకు శ్రమ కల్గించాను."

ఆమెని ఇంకా అనుమానంగా చూసిందామె.

"అవును, రమకు అన్యాయం చేయను. ఒట్టేసి చెబుతున్నా, నీ సమక్షంలో నే ఈమెను స్వీకరిస్తున్నాను. దయచేసి నన్ను క్షమించి వదిలేయ్! అన్నాడతను వేడికోలుగా."

వాళ్ళిద్దర్నీ మార్చి మార్చి చూసిందామె. అప్పుడు అడ్డంగా తలూపింది, "లేదు, ముందు నీ మనసులో విషముంది. దీన్ని కాదనలేవు. అది ప్రవేశించనేకూడదు. నేను నిన్ను చంపాలనుకున్నాను. దీనికి తిరుగులేదు. ఇది నా మనసులోకి రానేకూడదు. నిన్ను చంపాల్సిందే...."

"నన్ను—నన్ను చంపితే నీకేముస్తుంది? ఎందుకు నువ్వింత ఉన్మాదిలా ప్రవర్తిస్తున్నావు?"

"ఉన్మాదం కాదు. మనసెరిగే చేస్తున్నానీ పని. నీలాంటి వాళ్ళని కనీసం వందమందిని చంపితేగానీ నా కసి తీరదు!"

"కానీ నిన్ను పెట్టుకున్న ముఠావాళ్ళు నిన్నెరకంగా వంచిస్తున్నారో తెలుసా? వాళ్ళు అందరి వివరాలు నీకివ్వడంలేదు. నాలాంటి సామాన్యుల మీదికే పంపుతున్నారు నిన్ను. డబ్బున్నవాళ్ళని బెదిరించి లక్షలు గడిస్తున్నారు—ఈ రోజు పేపర్లో చూశాను!"

"నాకు తెలుసు" అందామె నిర్లక్ష్యంగా. "వాళ్ళు నాకింకేమేం చేశారో కూడా తెలుసు. వాటన్నిటికీ శిక్షించే సమయం సందర్భం త్వరలో వస్తాయి—"

"కానీ ఆలోపు నీకేదైనా జరిగితే — పోలీసులకి దొరికిపోతే—చచ్చిపోతే—"

"అది అంత సులభంకాదు-నన్నెవరూ పట్టుకోలేరు!"

ఆమె గొంతులో దృఢనమ్మకం ధ్వనించింది. క్రోధావేశాలతో ముందుకు కదలబోతున్న ఆమెని చూసి రమాదేవి చటుక్కున చెయ్యి పట్టుకుంది. ఆమె విదిల్చి కొట్టబోయింది. రమాదేవి పట్టు విడవలేదు. ఆమె దీనంగా, అర్థింపుగా చూసిందామె వంక.

"ఆయన్ని చంపకు, ప్లీజ్. నేను నా పొరపాటు తెలుసుకున్నాను. ఆయన తన తప్పు తెలుసుకున్నాడు. ఇద్దరం ఇప్పుడు ఒకటయ్యాం. నువ్వాయన్ని క్షమించి వదిలేయ్. నీకే హానీ చేయం. నువ్వు మమ్మల్ని వదిలేసావనే నమ్మకంతోనే నీకే అపకారంచేసే ఉద్దేశ్యం పెట్టుకోలేదు. లేకపోతే అరిచి గొడవచేసేవాళ్ళం. నీ దారిని నువ్వెళ్ళిపో, ప్లీజ్. నీకింత పట్టుదల కూడదు. నువ్వాయన కేదైనాచేస్తే, అదే కత్తితో నేను పొడుచుకుని చస్తాను."

ఈ మాటలు విని, వాళ్ళిద్దర్నీ తేరిపార చూసిందామె. కత్తిచుట్టు ఆమె చేతివేళ్ళ పట్టు సడిలాయి. రమాదేవి ముఖంలోకి సావధానంగా చూసి, భుజం తట్టింది.

"నీలాటి వాళ్ళతో త్యాగాలు చేయించడంకాదు నా పని, సుఖంగా వర్థిల్లు."

ఆశ్చర్యకరంగా ఆమె గొంతులో ఆప్యాయత పలికిందిప్పుడు.

• • •

ఇన్‌స్పెక్టర్ రమణారెడ్డి తెచ్చిన కబురుతో హుటా

హుటికి బయలుదేరి వెళ్ళాయి పోలీసుదళాలు, తొమ్మిది న్నరకు.

కూకట్ పల్లి కూలిపోయిన మసీదు పరిసరాలు కన్ను పొడుచుకున్నా కనిపించని చీకట్లో మునిగి వున్నాయి. మసీదు చుట్టూతా యాభై గజాల వ్యాసంలో, చెట్లూ పొదల చాటున మాటువేశారు వాళ్ళంతా.

రమణారెడ్డి, కృష్ణన్, కమీషనర్, మరికొందరు అసి స్టెంట్ కమీషనర్లూ, ఇన్స్పెక్టర్లూ, కాన్స్టేబుల్స్తో మొత్తం అరవైమంది బలగం తమ తమ పొజిషన్లు చూసుకుంటూ హడావుడిగా వున్నారు.

అరగంటలో అంతా సర్దుకున్నారు.

అప్పటి నుంచీ ఇప్పుడు పదకొండు గంటల వరకూ వాళ్ళంతో ఓపిగ్గా కాచుకుని వున్నారు. ఎవరి ఆజ్ఞలు వారికున్నాయి. ఆయుధాలూ, వాహనాలూ మసీదు వైపుకే సంధించి వున్నాయి. వాళ్ళందరి కళ్ళూ రెండు కాంతిపుంజాలకోసం రెప్పపడకుండా నిరీక్షిస్తున్నాయి. ఆ రెండు కాంతిపుంజాలతోపాటు వచ్చే మోటారు శబ్దం కోసం చెవులు రిక్కించుకుని వున్నారు.

అదే సమయంలో అడ్డమార్గాలద్వారా రంగుమార్చిన బొంగా జీపులో రంగేళీ రాజాల్లా వస్తున్నారు వాళ్ళు ఆరుగురూ, ఆవురావురుమంటూ డబ్బు మేసేద్దామని. కానీ ఆ మసీదు దగ్గర తాము మేసేది వేరు అని వాళ్ళకు తెలియందికా....

• • •

హఠాత్తుగా తలుపు తెరచుకోవడంతో ఆమె లోనికి చూసి కత్తి దూసింది.

"ఎవరు—ఎవరు నువ్వు?" అరిచాడతను.

"సుహాసిని!"

"సుహాసిని? ఏ సుహాసిని?" అతను వెనక్కి జరిగి పోతూ అన్నాడు.

"నీలాటి వంచకుల్ని చంపే సుహాసిని—"

"ఏమిటి—ఏమిటి నువ్వనేది?"

"రేవతి ఉత్తరం వ్రాసింది—నీ యజమానికూతురు. నువ్వామెని ఇంట్లో యెవరూ లేనిది చూసి—"

ఆమె మాటలాపేసి చెయ్యి లేపింది. "వివరాలన్నీ అనవసరం. నువ్వేంచేశావో నీకు తెలుసు. శిక్ష అనుభవించు!"

ఆమె చెయ్యి బలంగా తనకేసి వచ్చేస్తూంటే, కళ్ళు మూసుకొని కెవ్వున అరిచాడతను.

లోపల అలికిడి వినిపించింది. "ఏమిటండీ, ఏమైంది?"

ఓ నలభై ఏళ్ళ స్త్రీ పరుగెత్తుకొచ్చింది. అక్కడి దృశ్యం చూసి ఒక్క క్షణం బిత్తరపోయి, పరుగునవచ్చి అతన్ని వెనక్కి లాగేసింది. గుండెలో దిగబోతున్నదల్లా కత్తి గాలిలో విన్యాసం చేసింది.

"ఎవరు? ఎవర్నువ్వు? ఏమిటీ అఘాయిత్యం?" నిలదీసిందామె.

"నీ మొగుడు మోసగాడు. తన యజమాని కూతుర్ని మాయ మాటలతో వంచించాడు—"

"ఎవరన్నారు? నువ్వెవరసలు?"

"నీ మొగుడు దుర్మార్గుడు, అతన్ని చంపుతాను" కత్తితో ఆమె మళ్ళీ ఒక అడుగు ముందుకేసింది.

అతను మరో కేకవేశాడు కెవ్వున, భార్య వెనుక దాక్కుంటూ. కేకవేసి అన్నాడు, "అబద్ధం! నేనెవర్నీ మోసం చేయలేదు! నువ్వు తప్పుగా భావిస్తున్నావు!

రేవతికి నేనేం చేయలేదు! కావాలంటే ఆమెనే అడిగి తెలుసుకో—"

"ఆమే ఉత్తరం వ్రాసింది."

"కాదు! ఆమె వ్రాయలేదు — ఇందులో మోసం జరిగింది! ఇప్పుడే — ఇప్పుడే వెళ్ళి అడుగుదాం. పద! ఆమె అవునంటే, ఆమెకేదేనా చేశానంటే, అప్పుడు కచ్చితంగా చంపు!"

"తప్పించుకునే దారులు వెతకకు!"

"ఆయన అలాటివారు కారు! నువ్వు పొరబడ్డావు! ఆయన్నేదైనా చేశావంటే, నిన్ను కొట్టి చంపేస్తాను! నీకంటే యెక్కువ బలం వుంది నాకు!" అరిచిందతని భార్య.

"ఆ ఉత్తరం రేవతి వ్రాసింది కాదు! ఆమె అలాటి పని చేయదు! ఎందుకు, నేనెప్పుడూ ఆమెతో మాట్లాడనే లేదసలు! ఆమెకు నేనేం చేస్తాను?"

"మరి ఎవరు వ్రాశారు ఉత్తరం?"

"ఏమో, నాకెలా తెలుస్తుంది...." మాటలాపేశాడతను. ఉలిక్కిపడ్డాడు, "ఇప్పుడు తెలిసింది!" అంటూ భార్యని వూపాడు, "ఆచారి—ఆచారి వ్రాసివుంటాడా ఉత్తరం! అవును, వాడే!"

భార్యకూడా ఉలిక్కిపడింది, "వాడు వ్రాశాడా?"

"ఎందుకు వ్రాస్తాడు?" అడిగిందామె, కత్తిని అలాగే పట్టుకుని.

"పగతో! వ్యాపారంలో వాడ్ని నష్టపర్చానని వాడి వాదన! ఆ పగతోనే నన్నిలా చంపించాలనుకున్నాడు."

"నన్ను ఏమార్చకు. నువ్వు కుటుంబరావు దగ్గర పనిచేస్తున్నావు. నీకు వ్యాపారమేమిటి? ఆచారిని నువ్వు

నష్టపర్చేడమేమిటి? నన్ను నమ్మించకు!"

"ఓహ్, ఈ కుటుంబరావు దగ్గర చేరకముందు వ్యాపారం చేశాను! చేతులు కాల్చుకున్నాను! అప్పుడు నా పార్ట్‌నర్ ఆ ఆచారి వాడ్ని నష్టపర్చాననని నామీద పగబట్టాడు!"

"నమ్మించకు!"

"వాడిదగ్గరి కెళ్దాం, పద! వాడొప్పుకోడు. ముందు రేవతి దగ్గరికెళ్ళి ఆమె వ్రాసిందో లేదో తెలుసుకుందాం!"

అతను భార్య వెనుకనుంచి ధైర్యంగా ఆమెముందు కొచ్చాడు. భార్య గబుక్కున వచ్చి అతని చెయ్యి పట్టుకుంది. "పదండి, నేనూ వస్తాను!"

వాళ్ళని సందిగ్ధంగా చూస్తూ ఆమె కత్తిని దించేసింది. దానివైపోసారి నిరసనగా చూసి నిట్టూర్చింది. అప్పుడక్కడ్నించి కదలి వాళ్ళవైపు చూడకుండా బయటికి నడిచింది.

ఆగలేదామె. మళ్ళీ తిరిగి చూడలేదు. చీకట్లో కలిసిపోయింది.

వాళ్ళిద్దరు ఏమీ అర్థంకాక ఒకరొక్కరు పట్టుకుని నిలబడిపోయారు.

* * *

రంగు మార్చిన జోంగా జీపులో రంగేళీరాజాలా వస్తున్నవాళ్ళు ఆరుగురు ఇంకా డబ్బు మేసే ఆశలోనే వున్నారు.

బాంబే హైవేమీదికి వచ్చాక అన్నాడు శంభూనాథ్, "మనలో మాట, మన కాడిస్టుకో షాక్ ట్రీట్‌మెంట్ ఇస్తే ఎలా వుంటుంది?"

"ఎలా అది?" జింబో ఆసక్తిగా అడిగాడు.

"ఇప్పుడు మనం ఎత్తుకునే డబ్బు కోటి పదిలక్షలు. దాంతో అదే పోతగా బాంబే వెళ్ళిపోతే?"

"ఓహ్, స్వామి ద్రోహం."

"లేకపోతే మన ప్రాణాలకే మోసముంది, జింబో. చూశావా పరిస్థితులు ఎలా మారుతున్నాయో? ఈ తీరున రేపో మాపో మన పని కొలిక్కి వచ్చేలా వుంది. కట కటాలో, లేకపోతే కైలాసానికి ఎక్స్‌ప్రెస్ టిక్కట్టో అవుతుంది మన గతి."

"కానీ మరాఠీవాడు మొత్తుకుని చస్తాడు!" అన్నాడు జింబో.

"చావనీ, మనకేం? నన్నెంత అవమానిస్తున్నాడు! ఆఫ్టరాల్ ఒక మేనియాక్ నాలాంటి కార్యశూరుడ్ని అవమానించడమా? చెల్లదు. ఏమంటారు మీరంతా?" అడిగాడు శంభూనాథ్ మిగతా వాళ్ళని.

"మేమంతా నీతోటే, బాస్!" అన్నారు వాళ్ళంతా.

• • •

అక్కడ లాల్ గంట సేపటినుంచీ కాచుకునివున్నాడు- అపర్ణా అపార్టుమెంట్స్ దగ్గర, సతీష్ అతడి స్నేహితుడి రాకకోసం.

కానీ వాళ్ళ జాడ లేదు.

సమయం పదకొండు దగ్గర దాటింది.

పదింపావు వరకూ ఆఫీసుకు తనకు ఫోన్ రాలేదు, పక్క ఫ్లాట్‌లో వాళ్ళనుంచి. అప్పుడు తనే బయల్దేరి వచ్చాడు, ఇహ వుండలేక. ఫ్లాట్‌కి అప్పటిలాగానే తాళం వేసి వుంది. కిందికివచ్చి, కారెక్కి అపార్టుమెంట్స్ కెదురుగా వున్న చిన్న సందులోకి తీసికెళ్ళి ఆపి కూర్చు

న్నాడు—సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ.

ఆఫీసులో వున్నప్పుడు కృష్ణన్ ఫోన్ చేసి, ఇన్‌స్పెక్టర్ రమణారెడ్డి ఇచ్చిన టిప్ అందించాడు. కానీ లాల్ తనకు సతీష్‌తోనే ఇంట్రెస్టు వుందన్నాడు. అతని విషయం తేల్చుకోనిదే మరేదీ చూడనని చెప్పి, కూకట్‌పల్లి ఆపరేషన్‌ని అతన్నే హాండిల్ చేయమన్నాడు. అప్పుడు బయల్దేరి ఇక్కడికి వచ్చేశాడు.

ఈ గంటసేపూ అతను వివిధ రకాలుగా ఆలోచించాడు. సతీష్ అయిపు గురించిన ఏ వూహా సరయినదని నమ్మకం కల్గడంలేదు.

అప్పుడతని కొకటి తట్టింది. కారుదిగి రోడ్డుమీది కొచ్చాడు. బషీర్ బాగ్ మెయిన్ రోడ్డుమీద షాపులూ బార్‌లూ అన్నీ మూసీ వున్నాయి. కానీ ఒకటి రెండు హోటల్స్ తీసే వున్నాయి. దగ్గర్లో వున్న ఇరానీ హోటల్‌లోకి నడిచి లాల్ ఫోన్ అడిగి డయల్ చేశాడు కంట్రోల్ రూముకి. "దయచేసి ఈ కారు ఎక్కడుందో ట్రేస్ చేయగలరేమో చూడండి—" అని నెంబర్ చెప్పాడు.

ఆ కారు నెంబర్ సతీష్ వాళ్ళది.

* * *

ఆమె అటూ ఇటూ చూసింది. ఎవరూ లేరు. చిక్కడపల్లి లోని ఆ వీధి నిర్మానుష్యంగా చీకటిగా వుంది.

జాగ్రత్తగా ఆమె ఆ ఇంటి తలుపు చేరుకుని దబదబ కొట్టింది.

ఆ శబ్దం పిడుగులు పడుతున్నట్టే వుందా సమయంలో.

అప్పుడామె బ్యాగు తెరచి కత్తి తీసింది. ఇంకెన్ని వున్నాయో లెక్కపెట్టింది. ఆరు. ఆమె ముఖంలో

అలసట తాలూకు చిహ్నాలు స్పష్టంగా వున్నాయి. కాని నిరాశ రవంతైనా లేదు.

ఆమె అసహనంగా, సమాధానం రాకపోవడంతో, మళ్ళీ కొట్టింది తలుపుని.

ఎవరూ పలకలేదు.

మళ్ళీ కొట్టింది.

ఇంకోసారి కొట్టబోయింది—

అప్పుడు—

"ప్లీజ్.... హేండ్సప్, మిస్ సుహాసినీ" విన్పించాయి మాటలు, వెనకనుంచి.

ఆమె శరీరం కట్టెలా బిగుసుకుపోయింది. వెనక్కి తిరిగే స్పృహే లేకపోయింది.

"మిస్ సుహాసినీ, ఆ కత్తి పడేసి చేతులెత్తు...." విన్పించింది మళ్ళీ అదే గొంతు, "డిసీజ్ ఇన్స్పెక్టర్ రవేరా! నీ మెడకు అనుతున్నది నా చేతిలో రివాల్వర్! జాగ్రత్త. చెప్పినట్టు చెయ్. నిన్ను చంపడం నాకే మాత్రం ఇష్టంలేదు.... వెరీగుడ్, కత్తి వదిలేశావు....ఇక ఇలాగే....ఇలాగే.... వెరీ వెల్, ఇలాగే వెనక్కి తిరిగి నడువ్. హాహా! నువ్వొస్తావని నేను పెద్దగా ఆశించలేదు, సుహాసినీ. నా వంతు ఇవ్వాళ రాదనుకున్నాను.... కానీ-గుడ్లక్. ఇవ్వాళే వచ్చేసి ఇలా నాకు చిక్కిపోయి..."

అప్పుడా వెనకనుంచి అతని తలమీద యేదో వచ్చి పడింది—

'ఠంగ్'మని మోగిందతని మెదడు. జిగేలుమని మెరిసిందొక మెరుపు. 'హుంఫ్!'మని కూలిపోయాడతను, తల పట్టుకుని.

ఆమె కొయ్యబారిపోయి చూసిందిదంతా.

అతను నవ్వుతూ చూస్తున్నాడు, చేతిలో కర్ర ముక్కతో.

"ఆ ఎదురిల్లే మాది. ఈ ఇంట్లో ఏవో మార్పులు జరుగుతూంటే ఆసక్తి కలిగి ఆరాలుతీసిన మీదట ఇతను ఇన్‌స్పెక్టర్ రివేరా అని తెలిసింది. ఆపైన ఇతని ఎత్తు యేమిటో తెలుసుకోవడం కష్టంగాలేదు సిష్టర్, సిటీలో పరిస్థితుల్ని గమనిస్తూంటే. అది పారకుండా చేయాలనుకున్నాను. చేసేశాను."

"ఎందుకు? ఎందుకు చేశావు?"

"నువ్వు పట్టుబడడం నేనంగీకరించను."

"ఎందుకు — ఎందుకు అంగీకరించవు?"

"నా సిష్టర్ కూడా నీకులాటి అన్యాయానికే బలైంది. షీ ఈజ్ డెడ్ నౌ."

ఆమె ఆశ్చర్యంగా చూసిందతనివంక. "థాం..క్స్."

"నో మెన్షన్. నువ్విక్కడ్నించి తొందరగా వెళ్ళిపో."

ఆమె కృతజ్ఞతగా చూసి, గబగబ కిందపడ్డ కత్తిని అందుకుంది. ఇన్‌స్పెక్టర్ పక్కనే వున్న అతని రివాల్వర్‌ని కూడా తీసుకుంది. అప్పుడతనివైపు చూడకుండా వడివడిగా నడిచి వెళ్ళిపోసాగింది.

ఆమె కనుమరుగయ్యేవరకు చూసి ఆ యువకుడు నిట్టూర్చాడు. అప్పుడు ఇన్‌స్పెక్టర్ దగ్గరికి కదిలి అతని జేబులో ఒక చీటీ వుంచాడు. దానిమీద ఇలా వుంది. "I am sorry."

• • •

నెమ్మదిగా ఎగుడు దిగుడుగా వున్న బాటగుండా జాగ్రత్తగా, పైకీ కిందికీ వూగుతూ సమీపిస్తున్న రెండు

కాంతిపుంజాలు కంటపడటంతో, ఒక్కసారి అక్కడ చలనం ప్రారంభమైంది....

"దే హేవ్ కమ్!" అన్నాడు కమీషనర్, చటుక్కున బాయ్ నెట్ మీదనుంచి లేస్తూ.

అతని పక్కన ఇద్దరు ఇన్ స్పెక్టర్లు, ఆరుగురు కాన్ స్టేబుల్స్, వెంటనే మోకాళ్ళమీద కూర్చుంటూ ఆయుధాలు ఎక్కుపెట్టారు.

మరి కొంచెం దూరంలో, వాళ్ళకిరువైపులా మరో రెండు అసిస్టెంట్ కమీషనర్లతో కూడిన జట్లు అదే ప్రకారం చేశాయి.

వాళ్ళ కభిముఖంగా మరో మూడు జట్లు కూడా అలాగే సిద్ధమయ్యాయి.

మొత్తం అయిదు జట్లవద్దవున్న ఏడు వాహనాలలోని డ్రైవర్లు కమీషనర్ ఆజ్ఞకోసం యెదురుచూస్తున్నారు.

వాళ్ళందర్నీ చెట్లూ పొదలూ కవర్ చేస్తున్నాయి. అలా సమీపిస్తున్న ఆ రెండు హెడ్ లైట్లు ఆ చీకటి ప్రదేశాన్ని కాంతివంతం చేస్తున్నాయి. అవి క్రమంగా దగ్గరవుతూ మసీదువైపుకు తిరిగాయి. దాన్ని కాంతిమయం చేశాయి. చేస్తూ ప్రాంగణంలోకి ప్రవేశించిందా వాహనం. మెట్లకు పదడుగుల దూరంలో ఆగిపోయింది.

లైట్లు ఆరిపోయాయి.

"లైట్సాన్!" కమీషనర్ గొంతు మార్మోగింది. దాంతోపాటే చకచక లైట్లు వెలిగిపోయి, మూడు పక్కలనించీ, ఆ వెహికల్ ని తళుక్కున మెరిపించాయి.

కమీషనర్ గొంతు స్పీకర్ లోంచి వెలువడసాగింది. "కమీషనరాఫ్ పోలీస్ స్పీకింగ్. డిసీజ్ సరెండర్ వార్నింగ్. మీరంతా ఖాళీ చేతులతో కిందికి దిగి నిల

బడాలి. మిమ్మల్ని మేం చుట్టుముట్టాం. మీరే పిచ్చి ప్రయత్నాలు చేయకుండా చేతులెత్తి దిగాలి. వరుసగా ఒక్కొక్కరు ... చెప్పినట్టే చేయాలి. ఎవరైనా అతిగా ప్రవర్తిస్తే వెంటనే ఫైరింగ్ ఓపెన్ చేయబడుతుంది.... కమాన్, వన్ బై వన్, మోర్ స్లోలీ ప్లీజ్!...."

చెప్పడం పూర్తిచేసి కమీషనర్ పొద చాటునుంచి తొంగి చూశాడు రివాల్వర్ గురిపెడుతూ. ఆ ప్రాంతం దేదీప్యమానంగా వుంది. ఆ వాహనం అలాగే ఆగివుంది. అందులో కదలిక లేదు. శబ్దాలు లేవు. మాటలు లేవు.

"కమాన్! ఆలస్యం చేయకండి! ఒక్కొక్కరే దిగి నిలబడండి!" మళ్ళీ అరిచాడతను.

అయినా కదలిక లేదు.

మిగతా జట్లలో వాళ్ళుకూడా ఆదుర్దాగా చూస్తున్నారు. కృష్ణన్ పూర్తిగా నేలమీద బోర్లా పడుకుని వున్నాడు.

కదలిక లేదు..

"ప్లీజ్ ఫైనల్ వార్నింగ్! వెంటనే దిగకపోతే ఫైరింగ్ ఓపెన్ చేయబడుతుంది!"

అదే మొండితనం.

అదే సమయంలో హైవే దిగి మలుపు తిరుగుతున్న జోంగా జీపులో రంగేళీరాజాలు, ఈ హెచ్చరిక వినేశారు.

వాళ్ళు కలవరపడ్డారు.

"ష్యూ, స్టాప్ హియర్!" అరిచాడు శంభూనాథ్, "ఏమిటది? అక్కడ లైట్లేమిటి? ఓ గాడ్, వాళ్ళొచ్చేశారు! పోలీసులొచ్చేశారు! కొంప మునిగింది! గాడ్, కొంప మునిగింది..తిప్పు వెనక్కి బండిని, నారాయణ్!"

నారాయణ్ గాభరాగా స్టీరింగ్‌ని కుడివైపుకు తిప్పాడు. జీపు గిర్రున తిరిగిపోతుంటే జింబో గొంతు చించుకుని అర్చాడు, "ఓహ్, వాళ్ళిలా వచ్చారిక్కడికి? ఎవర్ని అక్కడ హెచ్చరిస్తున్నది?"

"మనకోసం ఎవరో పార్టీ వచ్చి వుంటుంది—వాళ్ళు మనమనుకుని పొరబడ్డారు! పోనీయ్!"

నారాయణ్ స్టీరింగ్‌ని తిప్పేస్తూ వెనుకే శరవేగంతో వచ్చేస్తున్న మూడు హెవీ లోడ్ లారీల్ని చూసుకోలేదు—

జీపు అమాంతంగా ఎగిరి అల్లంత దూరాన పడింది.

అదే క్షణంలో కమీషనర్ చేతిలో రివాల్వర్ ప్రేలింది. బుల్లెట్ పైన గాలిలోకి దూసుకుపోగానే ఆ కారులోంచి ఒక వ్యక్తి "చంపొద్దు! నన్ను చంపొద్దు!" అని అరుచుకుంటూ పరుగెత్తుకొచ్చాడు.

అంతా దిగ్భ్రమ చెంది అటువైపు వురుకుతూండగానే, రోడ్డుమీద పెద్ద అలజడి రేగింది....

క్షణంలో ఇక్కడ పరిస్థితి గ్రహించిన రమణారెడ్డి కృష్ణన్‌లు లేచి దొడుతీశారు కసురుకుంటూ, రోడ్డు మీదికి.

జీపు అంత పైకెగిరి మూడుచుట్లు తిరిగి తలకిందుల పడగానే అందులోని వాళ్ళు ఎలుకపిల్లలాగా బయటికి వచ్చేయసాగారు. కానీ శంభూనాథ్ మాత్రం కాదు. అతను అతని కాళ్ళ దగ్గరే వున్న అల్యూమినియం ట్రంకు వచ్చి తలకు తగలడంతో తెలివి తప్పిపోయాడు. అతన్ని బయటికి లాగసాగాడు జింబో. మిగిలిన నల్గురూ అప్పుడే బయటపడి పరుగెత్తసాగారు, కుడివైపు రోడ్డు దిగి.

జోడు గుర్రాల్లాగా పరుగెత్తుకొచ్చిన రమణారెడ్డి,

కృష్ణన్‌లని అక్కడి దృశ్యం ఉద్రేకపర్చింది. ఆ మూడు లారీలూ ఒకదాని వెనక ఒకటి ఆగిపోయాయి. పదిగజాల దూరంలో జీపు.

వాళ్ళంతా తేరుకునేలోగానే అవతలినుంచి శంభూనాథ్‌ని లాగి భుజాన ఎత్తుకుని నిలబడుతున్న జింబో, లారీ హెడ్ లైట్ల కాంతిలో తను ఎక్స్‌పోజ్ కాగానే, రివాల్వర్ తీసి పేల్చి పరుగుతీశాడు రోడ్డు దిగి కుడివైపుకి.

అప్పుడు గానీ జోడు గుర్రాల మెదళ్ళు పనిచేయలేదు. ఆ బుల్లెట్ వాళ్ళకు తగ్గలేదు. ఓ హెడ్ లైట్‌ని బద్దలు చేసింది. విజిల్స్ తీసి వూదుతూ, లారీ వాళ్ళనించి చెరో టార్చి తీసుకుని అటు వురికారు.

ఆ చీకటి మైదానంలోపడి అడవి దున్నల్లా పరుగెడుతున్న వాళ్ళందరూ తనమీద టార్చిలైట్లు పడగానే క్షణం ఆలస్యం చేయకుండా రివాల్వర్స్ తీసి ప్రేల్చేశారు.

గభాల్న కింద కూర్చుండిపోయి బదులిచ్చారు కృష్ణన్, రమణారెడ్డిలు. దున్నలు నేలకూలలేదు. సంతోష్, సుభాష్, అశోక్, నారాయణ్‌లు ముందున్నారు. వెనుక జింబో శంభూనాథ్‌తో పరుగెడుతున్నాడు..... వాళ్ళంతా మరో రౌండు కాల్చారు. వాటినుంచి తప్పించుకుని మళ్ళీ లేచి వురికారు కృష్ణన్, రమణారెడ్డిలు. ఈసారి మెరుపులా మూడు క్షణాల్లో ముప్ఫై అడుగుల దూరాన ముగ్గుర్ని నేల కూల్చేశారు.

సుభాష్, అశోక్, నారాయణ్‌లు.

సంతోష్ పిచ్చివాడిలా మరింత వేగం పెంచి వురుకుతూండగా అప్పుడు — ముందు టార్చి వెలుగూ, దాని

వెనుక రెండు గుళ్ళూ ఆశన్నాకరిఁచుకున్నాయి.

జింబో అలసిపోలేదు. శంభూనాథ్ బరువుని మోస్తూ, కాల్పులకి బదులిస్తూ శాయశక్తులా పరుగుతీస్తున్నాడు. అతని మీదనుంచి ఎక్కడా టార్చిలైట్ల వెలుగు తప్పి పోవడం లేదు. అప్పుడు-రమణారెడ్డి గురి సరిగ్గా కుదిరింది. ఒక బుల్లెట్ తలలోకీ, జింబో ఆగిపోగానే మరొకటి శంభూనాథ్ వీపులోకీ దిగబడ్డాయి.

రెండు బుల్లెట్లని మోస్తున్న శంభూనాథ్ శరీరాన్ని జారవిడిచేశాడు జింబో. "ఫేర్ వెల్, మై ఫ్రెండ్ ...." అని అతను రివాల్వర్ ని రెండు చేతుల్తో పట్టుకున్నాడు. ఇరవై అడుగుల దూరంలోనే ఆగిపోయిన ఇన్ స్పెక్టర్ కి అప్పుడు జింబో ఆకారం విశ్వరూపం ప్రదర్శించింది.

వికృతంగా, క్రూరావేశంతో రెచ్చిపోయిన ఆంబోలాతు వచ్చేస్తున్నాడతను మీదికి.... రివాల్వర్ పేల్చుకుంటూ.

మొదటి రెండు షాట్ లకే తేరుకున్న కృష్ణన్, మిగిలిన గుళ్ళన్నీ అతనిమీదికి కురిపించేశాడు.

రమణారెడ్డికూడా రివాల్వర్ ఖాళీచేశాడు.

వరసగా కడుపులో ఒకటీ, కంఠంలో ఒకటీ, ఆ తర్వాత ఛాతీలో ఒకటీ, నడుములో ఒకటీ బుల్లెట్లతో మోయలేని బరువైపోయింది జింబోకి. అతనూ బ్రతుకు చాలించాడు.

* * *

లాల్ సిగరెట్ పారేశాడు. అసంతృప్తిగా నొసలు చిట్లించాడు. రెండుసార్లు ఆవులించాడు. విసుగ్గా టైము చూసుకున్నాడు. పన్నెండూ నలభై.

ముంచుకొస్తున్న నిద్రని ఆపుకుంటూ అతను అపార్ట

మెంట్ బిల్డింగ్ కేసి చూశాడు. అదలాగే వుంది, నిశ్శబ్దంగా. చాలా తక్కువ భాగాలలో దీపాలున్నాయి. ముందంతా నిర్మానుష్యం. ఒక్క మనిషి లేడు ఫోన్ చేయడానికి. కానీ అంత త్వరగా ఫలితముంటుందనిపించలేదు. తిరిగి అలాగే కూర్చుని సిగరెట్ తీసి వెల్గించాడు. అప్పుడు జాన్ జ్ఞాపకమొచ్చాడు.

అతను ఆందోళన పడ్డాడు. జాన్ గురించి ఆలోచన ఇదివరకెప్పుడూ ఆందోళన పర్చలేదు ఇంతగా. ఏ కేసూ అతని తోడులేకుండా పరిశోధించలేదు. ఇప్పుడీ వ్యవహారమంతా అతను తోడు లేకుండానే సాగిపోతోంది. నిట్టూర్చాడతను. ఆ డర్టీ పార్టనర్ కి తను జ్ఞాపకం వస్తున్నాడా? తననెప్పుడైనా జ్ఞాపకం చేసుకుంటాడా, ఆ బ్రూట్?

అప్పుడు-తను బందీగా వున్నప్పుడు జాన్ చేసిన ప్రయత్నాలు జ్ఞాపకం వచ్చాయి అతనికి. నిట్టూర్చాడు తేలికగా.... వెల్, షర్టెన్ లీ దట్ బ్రూట్ కేర్స్ ఫర్ మీ. మరి తనేం చేస్తున్నాడు అతనికోసం?

ఈ ప్రశ్న అతనికి సూటిగా తగిలింది.

గిల్టీగా ఫీలవుతూ రోడ్డుమీదికి చూశాడు.

అంతే, అప్పుడతని చూపులక్కడ నిల్చిపోయాయి.

అక్కడ—

ఆ లైటు స్తంభం కిందనుంచి వస్తూన్న ఆకారంమీద.

అతను గాభరాగా ముందుకు వంగాడు.

చరచరా నడిచి వచ్చేస్తూన్న ఆ స్త్రీ ఆకారం, గబగబా అపార్టుమెంట్ బిల్డింగ్ లోకి తిరిగింది, చూస్తూండగానే.

లాల్ గబగబా కారు దిగేశాడు.

సుహాసిని! అనుకున్నాడతను అదుర్దాగా. సందేహం లేదు. ఇక్కడికెందుకొచ్చింది?

అతను తటపటా యిస్తూండగానే ఆమె బిల్డింగ్ లోకి అదృశ్యమైంది. లాల్ తేరుకుని వేగంగా దాటికాడు అటువైపు. లోపలికెళ్ళిపోయి మెట్లెక్కి చకచకా రెండో అంతస్థు చేరుకున్నాడు. మార్గంలో ఆమె ఎక్కడా కన్పించలేదుగానీ, లాల్ రెండో అంతస్థు వడవలోకి రాగానే ఆమె ఆతలుపు దగ్గర బెల్ నొక్కుతోంది.

లాల్ వెనక్కి జరిగి, గోడచాటున మెట్లమీదే నిలబడ్డాడు.

అప్పుడు తలుపు తెరచుకుంది___

ఆమె చటుక్కున లోనకడుగు పెట్టింది___

ఆ వెంటనే తలుపు మూసుకుంది___

లాల్ విసురుగా కదిలాడక్కడికి. తలుపు దగ్గరాగి కీ హోల్ లోంచి చూశాడు. ఏమీ కన్పించలేదు. కానీ మాటలు విన్పించాయి. అలాగే వంగి కీ హోల్ లోకి చెవి ఆనించాడు.

లోపల ఆమె ఆశ్చర్యంగా చూస్తోందతన్ని.

అతను నవ్వుతూ చూస్తున్నాడు, తలుపు కానుకుని.

ఆమె చేతిలో కత్తి కంపిస్తోంది. నోరు తెరచి అస్పష్టంగా, "నువ్వు___నువ్వు___" అంది.

అతను నవ్వాపి, "నేనే సుహాసినీ....నీ అన్నని!"

"ఇక్కడికెలా వచ్చావ్?"

"నీ కోసమే వచ్చాను. ఇలా అయితేనే నిన్ను కలుసుకోగలననుకున్నాను. కలుసుకున్నాను. మొన్న మీ కరపత్రం చూసినప్పుడే నాకీ ఆలోచన కల్గింది...."

నవ్వాడతను మళ్ళీ, "నేనేం చేశానో తెలుసా? మీ సొసైటీకి బోగస్ ఉత్తరం వ్రాసి పడేశాను, ఈ ఫ్రెండ్ మీద. ఆ ప్రకారం నువ్విక్కడికి వస్తావని వూహించాను. మూడు రాత్రులు యిక్కడే గడిపాను. ఇవేళ నా ఆశ ఫలించింది! అనుకున్నట్టే నువ్వొచ్చావు-"

బయట లాల్ ఉలిక్కిపడ్డాడు. ఇతనెప్పుడొచ్చాడు ఫ్లాట్‌లోకి? తను పోలీసులకు ఫోన్ చేయడానికెళ్ళినప్పుడు-వచ్చేశాడా....

ఆమె గాభరాగా చూడసాగింది. "ఎందుకు—నన్నెందుకు కలుసుకోవాలనుకున్నావు?"

సతీష్ ముఖం ఆవేశపూరితమైంది. "ఎందుకా? ఓహ్, సుహాసినీ! నువ్వేం చేస్తున్నావో తెలుసా? నీ వంటిమీద అసలు తెలివి వుందా? వాళ్ళెవరు? వాళ్ళు మనకేం చేశారు! వాళ్ళకోసం నువ్వేం చేస్తున్నావు! నాన్నని చంపినప్పట్నించీ, వాళ్ళ కారణంగానే అమ్మ పోయినప్పట్నించీ, వాళ్ళే నీ నరేన్‌నికూడా చంపినప్పట్నించీ ఓహ్— నీకెలా చెప్పను, సుహాసినీ—పగతో నా గుండె రగిలిపోతోంది! వాళ్ళందర్నీ హతమారిస్తేగానీ నిద్ర పట్టదు నాకు! మరి నువ్వేమో—వాళ్ళతోనే చేతులు కలిసి ఉన్మాదిలా ప్రవర్తిస్తున్నావు!"

ఆమె కలవరంగా చూడసాగింది. ఆమె కళ్ళు విశాలంగా తెరచుకోసాగాయి, తెలుసుకుంటున్న వాస్తవాలకి.

అతను దగ్గరకొచ్చి ఆమెను పట్టుకున్నాడు. "వద్దు, సుహాసినీ! నువ్విలా చెయ్యొద్దు! నీకు జరిగిన అన్యాయాన్ని కాదనను. దానికి నువ్వు బదులు తీర్చుకున్నావు. అది చాలు. ఇంకెవరికోసమో నువ్వు నీ శక్తిని వృధా చేయడం

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ము ఖ చి త్రా ల కు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలకోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగాల్సిన అవసరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవారు ఏడాది పైకము రు. 120/-లు ముందుగా పంపవచ్చును.

మంచిదికాదు. కళ్ళు తెరువు. నిజం తెలుసుకో! ఈ శక్తిని మన శత్రువులమీద ప్రయోగించు! నీకు నేనూ తోడ్పడతాను. ఇద్దరం కలిసి అంత మొందిద్దాం వాళ్ళని."

ఆమె తేరుకుని అతన్ని విడిపించుకుంది. ఆమె కళ్ళు ఒక్కసారిగా ఎర్రబారాయి. తీక్షణంగా చూసిందతన్ని. "వాళ్ళని ఏం చేయాలో నాకు తెలుసు, నువ్వు అడ్డు రాకు!"

"సుహాసినీ!"

"నా దారికి అడ్డు రాకు!"

"నువ్వొక్కదానివే ఏం చేస్తావు? నన్నూ రానియ్యి! వాళ్ళెక్కడుంటారో చెప్పు! ఇప్పుడే — ఈ రాత్రే వెళ్ళి అందర్నీ అంత మొందిద్దాం!"

ఆమె విసురుగా కదిలింది, "నన్నొడ్డుకోకు!"

అతను వెనుకనుంచి మళ్ళీ పట్టుకున్నాడు, "ప్లీజ్ నా మాట విను....నీకీ ఆవేశం పనికిరాదు!"

ఆమె కత్తి చూపించింది, "నన్ను వదుల్తావా, లేదా?"

"ఓహ్, సుహాసినీ!"

ఆమె విదిల్చి కొట్టిందతన్ని.

"సుహాసినీ!" అతను మళ్ళీ పట్టుకున్నాడామెని.

ఆమెకు సహనం నశించింది. ఉగ్రురాలైనది, కత్తిని ఝుళిపిస్తూ. అతను వెనక్కి తప్పుకోబోయాడు. కానీ అంతలోనే అది వచ్చి కుడి భుజానికి తగిలింది. బాధతో ఒక్క అరుపు అరిచాడు. అతని షర్టు ఎర్రబడిపోయింది. ఆమె కళ్ళలో క్రోధం మరింత దాల్చింది. కత్తిని లాగి బలంగా ఛాతీలో పొడిచింది. అతను ఛాతీ పట్టుకుని కిందపడ్డాడు. ఆమె ఆగలేదు, ఇంకా ఉన్మాదంతో

మరో పోటు పొడిచింది. అతను నేలమీద దొర్ల సాగాడు, ఛాతీ పట్టుకుని, రక్తం ధారలుగా కారిపో తూంటే....

"ఓ.హ్_నేను_నేను_నీ అన్నను, సుహాసినీ! నువ్వ్-నువ్వు తప్పుచేస్తున్నావు, సుహాసినీ! నువ్వు తొక్కుతున్న మార్గం...."

అతని కళ్ళు మూతబడుతున్నాయి. ఇంకా ఏదేదో గొణుగుతున్నాడు.

తలుపు మోగిపోతోంది. ఆ దెబ్బలకది వూడిపడేలా వుంది.

ఆమె తేరుకుంది. కత్తిని కింద పడేసింది. గాభరాగా అటూ ఇటూ చూసింది. లోపలి గదిలోకి వురికింది. వెనుక కిచెన్, బాత్ రూంలలోకి వెళ్ళి చూసింది. మార్గం లేదు. కిటికీలోంచి కిందికి చూసింది. తృళ్ళిపడి ఆ ఆలో[illegible] మానుకుని తిరిగి ముందు గదిలోకొచ్చింది.

ఆమె నుదురంతా చెమటలు పట్టేసింది. వేగం[illegible] వూపిరి తీసుకుంటూ మోగిపోతున్న తలుపుని చూడ సాగింది. అవతలినుంచి అరుపుల్ని వినసాగింది. అప్పుడామె చెయ్యి హేండ్ బ్యాగులోకి వెళ్ళింది. అది రివాల్వర్ తో బయటికొచ్చింది...

"సతీష్!....ఏయ్, సుహాసినీ! తలు[illegible]

అరుపులు మరింత యెక్కువయ్యాయి.

గొంతులు బయట విన్పిస్తున్నాయి.

అప్పుడామె అడుగులు తలుపు దగ్గరికి ప[illegible]ాయి.

అవి రక్తంతో తడిసి జాడల్ని సృష్టించాయి.

కింద సతీష్ నిర్జీవంగా పడివున్నాడు.

(సశేషం)

